అపరాధ పరిశోధన అనుబంధం—155

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ముగ్గురు సాధువులు

రచన: సుంకరి రాంప్రసాద్

## మహాపతివ్రత

రచన: వసుంధర

## దెయ్యాల బండి

రచన: అపర్ణా నైటింగేల్

## బ్లూ ప్రింట్స్

రచన: దీపిక

అపరాధ పరిశోధన సప్లిమెంట్—155
నవంబరు, 1986
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ముగ్గురు సాధువులు

సుంకరి రాంప్రసాద్

"అదివో.... అల్లదివో
శ్రీహరి వాసమూ
పదివేల శేషుల
పడగల మయమూ
అదివో.... అల్లదివో
శ్రీహరి వాసమూ...."

స్టీరియో శాబ్దాలగుండా అన్నమాచార్యుల కీర్తన శ్రావ్యంగా వినిపిస్తూంది.

భక్తితో చేతులు జోడించి, ఆలయం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు భక్తులు. ఆ ప్రశాంత వాతావరణంలో అన్నమాచార్యుని ఆ భక్తి గీతం వింటుంటే వారిలో యేదో తెలియని తాదాత్మ్యత కల్గసాగింది.

ఆలయ ప్రాంగణంలో ఏపుగా పెరిగిన నందివర్ధనం, దేవ పారిజాతం, మందారం, సురపొన్నలు ఆదిగాగల పూల మొక్కలు, పచ్చగా కళకళలాడుతూ, అరవిరిసిన

పూలతో భక్తులకు కనువిందు చేస్తున్నాయి.

భీమునిపట్టణంలోని భ్రమరాంబికాదేవి ఆలయం అది.

ఆలయ గోపురంపై చెక్కబడ్డ చిత్ర, విచిత్రమైన శిల్పాలను చూస్తూ భక్తులు నెమ్మదిగా ప్రదక్షిణాలు చేస్తున్నారు.

అవి వాత్స్యాయనుని కామసూత్రాలను అనుసరించి యెంతో నేర్పుతో చెక్కబడ్డ శృంగార శిల్పాలు.

ప్రదక్షిణాలు చేస్తున్న భక్త బృందంలో ఒక స్వామీజీకూడా వున్నారు. ఆ శృంగార శిల్పాల వంక ఆబగా చూస్తూ నిలబడిపోయిన తన ఇద్దరు శిష్యుల వంక కోపంగా చూశాడు స్వామీజీ.

పాదాలపై జీరాడుతున్న పొడవైన కాషాయ రంగు అంగీ, మెడలో రుద్రాక్షమాలలూ, నుదుట విభూతి రేఖలూ, చేతులలో దండమూ, కమండలమూ, గుండెలపై జీరాడే నిడుపాటి గెడ్డమూ.... చూడగానే అతని రూపం ఒక విధమైన భక్తిభావం కల్గిస్తుంది యెవరిలోనైనా.

అతడి శిష్యులుకూడా సుమారుగా అతడిలాంటి వస్త్రధారణనే కలిగి వున్నారు.

స్వామీజీ దృష్టి ఆ శృంగార శిల్పాలమీద లేదు. అతని కళ్ళు చుట్టూ వున్న పొదలనూ, పూల మొక్కలనూ నిశితంగా గమనిస్తున్నాయి హఠాత్తుగా అతని దృష్టి ఒక ఆకు సంపెంగ పొదపైన నిలిచిపోయింది.

సన్నని చిరుదరహాసం అతడి పెదవులపై క్షణకాలం నర్తించింది. ఒక్క క్షణంపాటు తన శిష్యులవంక సాభిప్రాయంగా చూశాడతడు. వారు కళ్ళతోనే ఏదో మాట్లాడుకున్నారు.

స్వామీజీ కనుసన్న నందుకుని వారు పూవులను

ఏరడం ప్రారంభించారు.

సంధ్యా సమయం దాటి....కప్పెడు, కప్పెడు చీకటి మెల్లగా ముసురుకుంటున్న వేళ....

దేవికి సంధ్యాని వేదన గావించి, హారతి యిస్తున్నాడు అర్చకుడు. ఎవరో భక్తులు మ్రోగిస్తున్న కేగంటల శబ్దంతో ఆలయ ప్రాంగణం అంతా మార్మోగుతుంది.

హారతిచ్చే సమయం కావడంచేత ప్రదక్షిణాలు ముగించి భక్తులంతా గుడిలోనికి ప్రవేశించారు. అంత వరకూ భక్తులతో కళకళలాడిన ఆలయప్రాంగణం ఒక్కసారిగా నిర్మానుష్యమయిపోయింది.

ఎవరూ తమను గమనించటంలేదని నిశ్చయించుకున్నాక, స్వామీజీ తన శిష్యులతోసహా ఆ సంపెంగ పొదలో ప్రవేశించారు. గుబురుగా వున్న ఆ సంపెంగ పొదల మాటున ఎవరో దాక్కున్నారన్న సందేహం కూడా ఎవరికీ కలుగదు.

అర్చన ముగించి, గర్భగుడికి తాళంవేశాడు పూజారి. అప్పటికే భక్తులంతా వెళ్ళిపోయారు. ఒక్కసారి ఆలయ మండపాన్ని పరికించి, ఎవరూ లేరని నిశ్చయించుకున్నాక ప్రాకార ద్వారానికి కూడా తాళం బిగించాడతడు.

గాలిగోపురం క్రింద నిలబడి, అమ్మవారికి మరోసారి అక్కడినుంచే నమస్కరించి ఇంటిదారి పట్టాడతడు.

## 2

భ్రమరాంబికా దేవి ఆలయంలో దొంగలు పడ్డారన్న వార్తతో భీమునిపట్నం అట్టుడికిపోయింది.

దేవీ విగ్రహం మెడలోని పగడాల హారం, ముప్పేట గొలుసూ, బంగారు గాజులూ, నవ్వల ముక్కెరా, హేమ హస్తాలూ, వడ్డాణం....అన్నీ కలసి పోయిన నగల విలువ

సుమారు ఏడారు లక్షల పైనే వుంటుంది.

ఆలయ ధర్మకర్త రిపోర్టు నందుకున్న వెంటనే హుటాహుటిగా ఆలయానికి బయలుదేరి వచ్చాడు సబ్ ఇన్‌స్పెక్టర్ శాంతిభూషణ్.

పూజారి చెప్పినదంతా వినేసరికి ఆశ్చర్యంతో అతడి కనుబొమ్మలు ముడిపడ్డాయి.

ఆ రోజు ఉదయం... ప్రాకార ద్వారం తాళం తెరచి లోపలికి ప్రవేశించాడు అర్చకుడు. ఆలయ ముఖ మండపం నుండే గర్భగుడి తాళాలు తెరచి వుండటం కనిపించిం దతడికి.

అంతే! భయంతో ముచ్చెమటలు పట్టాయి అతడికి. తడబడే అడుగులతో గర్భగుడిని సమీపించాడతడు. లోపల చూసేసరికి ఆభరణాలు లేని దేవీ విగ్రహం వెలవెలబోతూ కనిపించింది.

పరుగున ధర్మకర్త గారింటికి వెళ్ళి జరిగిన ఘోరం గురించి చెప్పాడు. ధర్మకర్త వచ్చి పోలీసులకు రిపోర్టు చేశాడు.

"రాత్రి గుడికి తాళాలు వేసింది మీరేనా?" అర్చకుని వంక సూటిగా చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ఔనన్నట్టు తలూపాడు అర్చకుడు.

"తాళాలు మీ దగ్గరే వున్నాయా?"

"చిత్తం! గర్భగుడి తాళం నా దగ్గరే వుందండి. ప్రాకార ద్వార తాళం మాత్రం మామూలుగా ధర్మకర్త గారికి అందజేసాను."

"అంటే రెండు తాళాలూ చెరి ఒకరి దగ్గర వుంటుంటాయన్న మాట."

"చిత్తం!"

సాలోచనగా తల పంకించాడు ఇన్‌స్పెక్టర్ కాంతి భూషణ్. అతడి మెదడులో ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి.

'గర్భగుడి తాళం పగలగొట్టబడి వుంది. కాని బయటనున్న ప్రాకార ద్వార తాళం మాత్రం చెక్కు చెదరకుండా వుంది. ప్రాకార ద్వార తాళాన్ని తెరవకుండా దొంగలు లోపలకు ఎలా ప్రవేశించారు?'

ప్రాకారం వంక చూసాడు ఇన్‌స్పెక్టర్.

పది అడుగుల ఎత్తులో యెంతో దృఢంగా వుంది ప్రాకారపు గోడ. దానిమీద నాలుగడుగుల ఎత్తున ఐరన్ ఫెన్సింగ్ వుంది. రాత్రులందు ఆ ముళ్ళతీగలలో విద్యుత్ ప్రవహిస్తుంటుందని చెప్పాడు ధర్మకర్త.

'అంటే ప్రాకారం పైనుండి ఆలయంలోనికి ప్రవేశించడం యెవరికైనా అసాధ్యమేనని చెప్పాలి.'

ప్రాకారం క్రిందుగా నేలలో సొరంగంలాంటిదేమైనా త్రవ్వబడిందేమోనని ప్రాకారం చుట్టూ .... లోపలా, బయటా సునిశితంగా పరీక్షించాడతడు.

అనుమానించదగ్గ ఆధారాలేమీ లభించలేదు. ప్రాకారం లోపల గోడ ప్రక్కన ఎక్కడా మనుష్యుల అడుగుజాడలుకూడా లేవు.

'అంటే దొంగలు గోడదూకిగానీ, గోడకు కన్నం చేసిగాని లోపలకు రాలేదు. ముఖద్వారం గుండానే వచ్చి వుండాలి. వేసిన తాళం వేసినట్లు వుండగానే దొంగలు లోపలకు ఎలా ప్రవేశించగల్గారు?'

దొంగతనం చేయడానికి ఎవరెవరికి, ఎన్ని రకాలుగా అవకాశం వుందో ఆలోచించసాగాడు అతడు.

ఈ కేసులో అతడికి లభిస్తున్న 'క్లూ' ఒక్కటే.

అది: ప్రాకార ద్వార తాళం.

నగల చోరీ జరిగాకకూడా తాళం వేసి వుందంటే.... దాని తాళం చెవి దొంగల ఆధీనంలో ఉండివుండాలి.

ఏదో ఒక ప్రక్రియతో తాళాన్ని తెరవచ్చుగాని, తాళంచెవి లేకుండా మళ్లా తాళం వేయడం యెలా సాధ్యపడుతుంది?

గుడి తాళం చెవులను హాండిల్ చేస్తున్నవారు ఇద్దరే... ఒకరు ధర్మకర్మ. రెండవవారు పూజారి.

వారిద్దరూ చోరీ జరిగిన రాత్రంతా ఒక పెళ్ళిలో వున్నారు. అంటే వారికి పటిష్టమైన ఎలిబీ వున్నట్లే.

ఒకవేళ ఈ చోరీకోసం వారు ఎవరినైనా నియమించారనుకుంటే.... వారి సహచరులు యే అర్థరాత్రో ఆ ప్రాకార ద్వారంగుండా గుడిలోనికి ప్రవేశించి వుండాలి.

అలాంటి సమయంలో వారిని ఎవరైనా గమనించే అవకాశం వుందా?

అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

హఠాత్తుగా అతడికి గుడిముందు అడుక్కునే బిక్షగాళ్ళు గుర్తుకువచ్చారు.

కొందరు బిక్షగాళ్లు రాత్రులందు గాలిగోపురం మెట్లమీద పడుకుంటూ వుంటారని అతడికి తెలుసు.

అతడు వెంటనే ఆ బిక్షగాళ్ళను రప్పించి ఎంక్వయిరీ ప్రారంభించాడు.

"రాత్రి పూజారి గుడి తలుపులు మూసేసి వెళ్ళిపోయాక. మళ్ళీ ఉదయం అతడు వచ్చి తాళాలు తెరిచినంతవరకూ ఆ ప్రాకార ద్వారం తెరుచుకొని లోపలి నుండి బయటకుగాని, బయటనుండి లోపలికిగాని ఎవరూ

రాలే...." దని వారు చాలా నమ్మకంగా చెప్పారు.

'అసలు....ఎవరైనా ఆ ప్రాకార ద్వారాన్ని సమీపించాలంటే అడ్డంగా పడుకుని వున్న తమను దాటుకునే వెళ్ళాలి. కాబట్టి తమకు తెలియకుండా ఒక్క పురుగైనా లోపలకు వెళ్ళే అవకాశంలే'దని అన్నారు వారు.

ఆ బిక్షగాళ్ళలో రాత్రంతా దగ్గుతూ, మూల్గుతూ నిద్రపట్టక అటూ, ఇటూ దొర్లే వృద్ధులూ, రోగిష్టులుకూడా వున్నారు. వారికి చిమ చిటుక్కుమంటే తెలివి వస్తుంది.

వారి మాటలు వింటుంటే పిచ్చెక్కినట్లనిపించింది ఇన్స్పెక్టర్ కు.

దొంగలు గోడ గెంతి రాలేదు. ద్వారంగుండా రాలేదు. కాని....గుడిలోని నగలు మాత్రం రాత్రికి రాత్రి మాయమైపోయాయి. ఎలా?

"ఆ దొంగల మాట దేవుడెరుగు. అసలు దొంగతనం ఎలా జరిగిందోకూడా అంతుచిక్కడంలేదే!"

అసహనంగా తల గోక్కున్నాడు ఇన్స్పెక్టర్.

ఇంతలో గుడిలోనికి వెళ్ళిన వ్రేలిముద్రల నిపుణుడు విజయకుమార్ పైకి వచ్చాడు.

"ఏం కుమార్! ఏదైనా క్లూ దొరికిందా!" ఉత్సాహంగా అడిగాడు ఇన్స్పెక్టర్.

"విగ్రహంమీద యేవో వ్రేలిముద్రలు ట్రేస్ అయ్యాయి సర్. గర్భగుడిలో ఏవో పాదాల గుర్తులు అస్పష్టంగా వున్నాయి. రాతిపలకల నేల గరుకుగా వుండటంచేత పాదాల గుర్తులు కరెక్టుగా రాకపోవచ్చు. ఫోటోలను డెవలప్ చేసి మధ్యాహ్నానికి పూర్తి రిపోర్టు నిస్తాను" వినయంగా అన్నాడు కుమార్.

పూజారి, ధర్మకర్తల వ్రేలిముద్రలూ, పాదాల గుర్తులనుకూడా తీసుకొమ్మని కుమార్‌కు చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

తరువాత గుడికి సీల్ వేయించి, ఒక కానిస్టేబిల్‌ను అక్కడ కాపలా వుంచి... జీపును ఎక్కి స్టేషన్‌కు వెళ్ళిపోయాడతడు.

# 3

సాయంత్రం నాలుగు గంటలు.

పోలీస్ స్టేషన్‌లోని తన గదిలో కూర్చుని వున్నాడు ఇన్‌స్పెక్టర్. అతడి కెదురుగానున్న కుర్చీలో కూర్చున్నాడు కుమార్. అతడిచ్చిన ఫింగర్ ప్రింట్స్ రిపోర్ట్ ఇన్‌స్పెక్టర్ చేతిలో వుంది.

రిపోర్టును చదవడం పూర్తి చేసి, కుమార్ వంక చూశాడతడు.

"విగ్రహంమీద లభించిన వ్రేలిముద్రలు పూజారివని కదూ వ్రాశారు.... మీ రిపోర్టులో...."

ఔనన్నట్లు తలాడించాడు కుమార్.

"ఆ వ్రేలిముద్రలు....నగలను అమ్మవారి విగ్రహం నుండి వలచినప్పుడు ఏర్పడినవేనని మీరు చెప్పగలరా?"

"నో....సర్! చెప్పలేము. పూజారి వ్రేలిముద్రలు అమ్మవారి విగ్రహం మీద అనేకచోట్ల లభించాయి. అవి ఎందువలన ఏర్పడ్డాయన్నది చెప్పడం కష్టం."

"పోనీ....పూజారి....అమ్మవారి విగ్రహానికి అలంకరణ చేసినప్పుడూ, అర్చన చేసినప్పుడూ అమ్మవారి విగ్రహాన్ని తాకే అవకాశం వుంది కదా. అలా అతడి వ్రేలిముద్రలు ఆ విగ్రహంపై ఏర్పడే అవకాశం వుందా?"

"అవకాశం వుంది సర్."

"అంటే, వ్రేలిముద్రల ఆధారంతో పూజారిని అను
మానించలేం!"

"అఫ్ కోర్స్ సర్."

"గర్భగుడిలో పూజారివి కాక మరో ముగ్గురి పాదాల
గుర్తులు లభించాయని వ్రాసారు. వాటిలో ధర్మకర్త
పాదాల గుర్తులు లేవా?"

"లేవు సర్."

"పాదాల గుర్తులు అస్పష్టంగా వున్నాయని, రాతి
నేల గరుకుగా వుండటంచేత ముద్రలు కరెక్టుగా రాక
పోవచ్చునని చెప్పారు కదా. మరి ఇంత ఖచ్చితంగా
ధర్మకర్త పాదాల గుర్తులు లేవని ఎలా చెప్పగల్గు
తున్నారు?"

"నిజమే సర్. పాదాల పూర్తి ముద్రలు కరెక్టుగా
లేవు. కాని కాలి మడమల గుర్తులూ, కాలివ్రేళ్ళ
గుర్తులూ కొంతవరకూ ట్రేస్ అయ్యాయి.

"వ్రేళ్ళ గుర్తులలో ఒక ప్రత్యేక లక్షణం వుంది.
సామాన్యుల భాషలో చెప్పాలంటే కొన్ని వ్రేళ్ళకు
చక్రాలూ, కొన్ని వ్రేళ్ళకు శంఖాలూ వుంటాయి.

"వాటి సంఖ్యా, ఆకారాలూ, స్థితులూ అన్నీ
ఒక్కొక్క మనిషికీ ఒక్కొక్క విధంగా వుంటాయి.
ప్రపంచంలోని ఇన్ని కోట్లమంది మనుష్యులలో ఏ ఇద్దరి
వ్రేలిముద్రలూ ఒకలా వుండవు."

కుమార్ వంక ప్రశంసాపూర్వకంగా చూసాడు ఇన్
స్పెక్టర్.

"అచ్ఛా! ప్రతిరోజూ అర్చనచేసే పూజారి అడుగు
జాడలు గర్భగుడిలో లభించాయంటే ఆశ్చర్యంలేదు. కాని
మరో ముగ్గురి పాదాల గుర్తులు కనిపించాయంటున్నారు

మీరు. అంటే.... ఎవరో ముగ్గురు ఆగంతకులు గర్భగుడిలో ప్రవేశించి వుండాలి. పూజారికి కాక ఇతరులకు ప్రవేశార్హత లేని పవిత్రమైన గర్భగుడిలోనికి ఎవరైనా ఎందుకు ప్రవేశిస్తారు? అమ్మవారి నగలను అపహరించడానికి అయి వుండాలి. అదే నిజమయితే వారి వ్రేలిముద్రలు విగ్రహం మీద లభించాలి కదా!"

"బహుశా వారు చేతులకు గ్లవ్స్ ధరించి వుంటారు సర్" కూల్ గా అన్నాడు కుమార్.

"కరెక్టు మై బాయ్" అన్నాడతడు మెచ్చుకోలుగా.

ఎవరో ముగ్గురు ఆగంతకులు హాండ్ గ్లవ్స్ ధరించి, గర్భగుడిలోనికి ప్రవేశించి నగలను కాజేసి వుంటారని తేలిపోయింది.

కాని.... వారు గుడిలోనికి ఎలా వచ్చినట్లు? కొండను త్రవ్వి ఎలుకను పట్టటం అంటే—ఇదేననుకున్నాడతడు.

ఇంతలో కానిస్టేబిల్ వచ్చి "ఎవరో కుర్రాడు మీకేదో చెప్పాలంటున్నాడు సర్" అన్నాడు.

"రమ్మను" అన్నా డతడు విసుగ్గా.

ఓ పదహారేళ్ళ కుర్రాడు బెరుకు చూపులతో ఆ గది లోనికి ప్రవేశించాడు. చూడటానికి బొద్దుగా, ముద్దుగా వున్నాడు.

"ఎవరు నీవు?"

"నా పేరు గున్నబాబండి. టెన్త్ చదువుతున్నా నండి. మరేనండి....అమ్మవారి గుడి దగ్గర కొబ్బరికాయల కొట్టు లేదండి ...అది మాదేనండి."

రెండు చేతులనూ కట్టుకుని పాఠం అప్పజెప్పినట్లు గడగడా చెప్పాడు ఆ అబ్బాయి. అతడి వంక అసహనంగా చూసాడు ఇన్ స్పెక్టర్.

"అయితే.... ఏమంటావ్?"

"మరి అమ్మవారి గుళ్లో నగలు పోయాయికదండి. మీరు ఉదయం గుడి దగ్గరికి వచ్చారు కదండి. నేనప్పుడే మీకు చెబుదామనుకున్నానండి. కాని అప్పుడు మా నాన్న వున్నాడండి. ఇట్లాంటివన్నీ నీకెందుకురా అని తంతాడండి. ఇప్పుడు మీకు చెబుదామని స్కూలునుండి వచ్చానండి."

"ఏమిటో చెప్పు!"

"నిన్న సాయంత్రం ముగ్గురు సాధూలు గుడిలోకి వెళ్ళారండి. నాకు గుడిలోకి వచ్చే, పోయే జనాలను చూడ్డం అలవాటండి. నేను చూస్తూనే వున్నానండి. గుడిలోనికి ఎళ్ళిన సాధూలు ముగ్గురూ తిరిగి బయటకు రాలేదండి.

"పూజారి తాళం వేసుకొని వెళ్ళిపోయారండి. నేనూ కొట్టు కట్టేసి ఇంటికెళ్ళిపోయానండి. గుడిలో కెళ్ళిన సాధూలు యేమయినట్లా అని రాత్రంతా ఆలోచిస్తూ పడుకున్నానండి.

"ఈ రోజు ఉదయాన్నే కొట్టు తెరిచానండి. అప్పుడే పూజారీ గుడితాళం తీసారండి. ఏం జరిగిందో యేమిటో గుడిలోనికి వెళ్ళిన పదినిమిషాలలోపలే స్ర్తున పైకి వచ్చేసారండి.

"పూజారి బయటకు వెళ్ళిన ఐదునిమిషాల్లో నిన్న నేను చూసిన ముగ్గురు సాధూలూ గబ, గబా నడుచుకుంటూ గుడిలోనుండి బయటకు వచ్చారండి.

"ఆ సాధూలు నిన్న రాత్రి గుడి మూయకముందు బయటకు రాలేదండి. ఈ రోజు ఉదయం గుడి తెరిచాక లోపలకు వెళ్ళలేదండి. కాని వాళ్ళు గుడిలోనుండి పైకి

వచ్చారండి. అంటే నిన్న రాత్రంతా వాళ్ళు గుడిలోనే వున్నట్లు కదండి."

"ఓరి నీ అసాధ్యం కూలా. చిన్నవాడివైనా గడుసు పిండానివే."

ఆ కుర్రాడివంక చూస్తూ అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్. ఆ కుర్రాడి లాజిక్‌ను వింటుంటే ముచ్చటవేసింది అతడికి.

'గర్భగుడిలో దొరికిన ముగ్గురి పాదాల గుర్తులు, ఆ కుర్రవాడు చెబుతున్న ముగ్గురు సాధువులవే అయివుండాలి. అంటే దొంగలు చాలా తెలివిగలవారన్నమాట.

ఎవరికీ అనుమానం కలుగని రీతిలో ఆలయంలోనికి ప్రవేశించి, తిరిగ్గా తమ పని ముగించుకొని, ఆ రాత్రి అక్కడే హాయిగా నిద్రపోయి మరీ చక్కా పోయారు ఆ దొంగలు.

దోచుకోండిరా బాబూ అని దొంగలను ఇంట్లో పెట్టి, ఎవరూ చూడకుండా, వారి పనికి అడ్డంకాకుండా బయట గొళ్ళెం పెట్టినట్లుంది—ఈ కేసును చూస్తుంటే' అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఆ సాధువుల చేతుల్లో ఏమైనా మూటలలాంటివి చూసావా బాబూ!" ఆ కుర్రాడి వంక సాదరంగా చూస్తూ అడిగాడు అతడు.

"వారి భుజాలకు పెద్ద కాషాయరంగు జోలెల్లాంటివి వున్నాయి కదండి" అన్నాడు కుర్రాడు.

"అచ్ఛా" అంటూ తలపంకించాడు ఇన్‌స్పెక్టర్.

"మరోసారి గుడిలోనికి వెళ్ళివద్దాం రండి కుమార్" కుర్చీలోనుండి లేస్తూ అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ మాటలను విన్న కానిస్టేబిల్ జీపును సిద్ధం చేయించడానికి బయటకు పరుగెత్తాడు.

# 4

ఆలయ ప్రాంగణంలో నలుమూలలా పరీక్షగా చూస్తున్నాడు ఇన్‌స్పెక్టర్. అతడిని వెన్నంటి వున్నాడు కుమార్.

'పూజారి గుడికి తాళంవేసేముందు, ఆ ముగ్గురు సాధువులు యెక్కడో దాక్కొని వుండి వుండాలి. ఎక్కడ....?'

ఎంత తెలివైన నేరస్తుడైనా యెక్కడో చిన్న ఆధారాన్ని వదలిపెట్టకుండా పోడు. ఆ ఆధారంకోసం నేరస్తుడు సంచరించిన స్థలాలను కనిపెట్టాల్సి వుంటుంది.

ప్రాంగణంలోని పూలమొక్కల వంక నిశితంగా చూశాడతడు. 'ఒక్కక్షణం తనే ఆ దొంగల స్థానంలో వుంటే యెక్కడ దాక్కోడానికి ప్రయత్నిస్తాడో'నని ఊహించాడు.

అతడి కళ్ళకు ఏపుగా, గుబురుగా పెరిగిన అడవి సంపెంగ చెట్టు కనిపించింది. జీబురుగా నేలకు జీరాడుతున్న కొమ్మలతో, రెమ్మలతో దట్టమైన పొదలా వుంది అది.

కొమ్మలను తొలగించుకొని ఆ పొదలో ప్రవేశించాడు అతడు. లోపల నేలమీదకు చూసిన అతడి కళ్ళు ఆనందంతో మిలమిలలాడాయి.

అక్కడ మట్టిమీద ఎవరివో పాదాల గుర్తులూ, ఎవరో మనుష్యుల కూర్చున్నట్లు చెదిరిన మట్టి కనిపించాయి. ఒకప్రక్క ఆరిపోయిన అగ్గిపుల్లలు చెల్లాచెదరుగా పడి వున్నాయి.

"కుమార్!" అంటూ ఉత్సాహంగా పిలిచాడు.

కొమ్మలను తొలగించుకొని వచ్చిన కుమార్ వంక

ఉద్వేగంతో చూసాడతడు.

“కుమార్! ఈ ఆరిపోయిన అగ్గిపుల్లలను చూసావా! ఇన్ని అగ్గిపుల్లలు వున్నా, ఒక సిగరెట్ పీకగానీ, బీడీ ముక్కగాని లేవు. అంటే.... ఇతడికి ఒక చిత్రమైన అలవాటుందన్న మాట. నా ఊహ తప్పు కాకుంటే.... చిన్న పిల్లలు మతాబులు కాల్చినట్లు, ఒక్కొక్క అగ్గిపుల్లనూ వెలిగించి, అది ఆరిపోయేంత వరకూ చూస్తూ వుండటం ఇతడికి సరదా అయివుండాలి.”

ఒక వంక ఇన్ స్పెక్టర్ మాటలను వింటువ్నా కుమార్ కళ్ళు మాత్రం నేలను పరీక్షగా చూస్తున్నాయి.

‘అగ్గిపుల్లలు అన్ని వెలిగించి పారేసారంటే.... అక్కడెక్కడో ఖాళీ అగ్గిపెట్టెకూడా ఉండితీరాలి. అగ్గిపెట్టె దొరికితే దానిమీద అతడి వ్రేలిముద్రలు లభించవచ్చు.’

అదీ—కుమార్ ఆలోచన.

రాలిన ఎండుటాకుల మధ్య పడి వున్న అగ్గిపెట్టె కనిపించింది అతడికి. చేతి రుమాలును ఆ పెట్టెమీద వేసి జాగ్రత్తగా పైకి తీసాడతడు.

మట్టిలోని పాదాల గుర్తులనూ, అగ్గిపెట్టమీద లభించిన వ్రేలిముద్రలనూ ఫోటోలుతీసి తన రిపోర్టును దానితో జతపరచి.... ఆ రోజు రాత్రి ఏడుగంటల లోపుగానే ఇన్ స్పెక్టర్‌కు అందజేసాడు కుమార్.

అంతవరకూ సేకరించిన వివరాలతో ఒక ఫైలును తయారుచేసి, ఒకసారి సర్కిల్ ఇన్ స్పెక్టర్‌కు కూడా చూపించి ఆ ఫైలును డిస్ట్రిక్ట్ హెడ్ క్వార్టర్స్‌కు పంపించాడు ఇన్ స్పెక్టర్.

ఆ రోజు ఉదయమే ఆ నగల చోరీ గురించి ... హెడ్ క్వార్టర్స్‌కు ఫోను మెసేజ్ పంపబడింది.

## 5

విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల నుండి మూడు ప్రత్యేక నేరపరిశోధక బృందాలు రంగం లోనికి దింపబడ్డాయి.

మొదటగా: దేవాలయాల దోపిడీలతోనూ, బంగారు నగల దొంగతనాలతోనూ సంబంధం వున్న పాత నేరస్థుల లిస్టు ఒకటి తయారుచేయబడింది.

ఆ లిస్టు ప్రకారం ఒక్కొక్క నేరస్థుడూ బంధించబడ్డాడు. వారి యిళ్ళూ, వారి బంధువుల యిళ్లూ పూర్తిగా సోదా చేయబడ్డాయి.

ఆలయ దోపిడీ జరిగిన రాత్రి ఆ నేరస్థులు ఎక్కడెక్కడ వున్నదీ ఆరాలు తీయబడ్డాయి.

శాంతిభూషణ్ పంపిన ఫోటోలలోని వ్రేలిముద్రలూ పాదాల గుర్తులూ పోల్చబడ్డాయి.

కాని యే నేరస్థుడి వ్రేలిముద్రలూ ఆ ఫోటోలతో సరిపోలేదు. ఇంత జల్లెడ వేసి గాలించినా ఆ నేరస్థుల నుంచి పనికివచ్చే సమాచారం ఏమీ లభించలేదు.

పోలీసు వర్గాల్లో మెల్లగా నిస్పృహా చోటు చేసుకో సాగింది.

ఓ ప్రక్క ప్రత్యేక నేరపరిశోధక బృందాలు పెద్ద పెద్ద నేరస్థులను ఉచ్చులు వేసి బంధిస్తుంటే, శాంతి భూషణ్ భీమునిపట్నంలోని చిల్లర నేరస్థులందరినీ కస్టడీలోకి తీసుకొని ఎంక్వయిరీ ప్రారంభించాడు.

అతడికెందుకో దొంగలు లోకల్ క్రిమినల్సేనని అని

పించింది.

ఆ రోజు ఉదయం...

నగల చోరీ జరిగిందని రిపోర్టు వచ్చిన వెంటనే.... కాన్‌స్టేబిల్స్‌ను పంపి అన్ని రోడ్లనూ బ్లాక్ చేయించాడు. అనుమానాస్పదంగా కనిపించిన క్రొత్త వ్యక్తులను సోదా చేయకుండా వదలిపెట్టకద్దని ఆర్డర్స్ జారీచేసాడు.

ఆ రోజు సాయంత్రం కొబ్బరికాయుల కొట్టు కుర్రవాడు ఆ ముగ్గురు సాధువుల గురించి చెప్పాక వెంటనే ఒక కాన్‌స్టేబిల్‌ను బస్టాండ్‌కు పంపించి ఎంక్వయిరీ చేయించాడు.

సాధువులు, సన్యాసులలాంటి వారెవరూ ఆ రోజు బస్టాండ్ సమీపానికి కూడా రాలేదని తెలిసింది.

వెంటనే పట్టణంలోని సాధువులనందరినీ స్టేషన్‌కు రప్పించాడు కావి గుడ్డలూ, మాసిన గడ్డాలతో వరుసగా నిలబడ్డారు ఆ సాధువులు.

కొబ్బరికాయల కొట్టు కుర్రవాడు వారినందరినీ నిశితంగా పరిశీలించి... పెదవి విరిచాడు.

తాను చూసిన ముగ్గురు సాధూలు వీరిలో లేరని చెప్పాడతడు. కాలిముద్రలు కూడా చెక్ చేశారు.

'అంటే... దొంగలు .... గుడిలోనుండి బయటపడిన వెంటనే తమ వేషాలు మార్చుకుని వుండాలి.'

"గుడి గురించీ, గుడిలోని నగల గురించీ, గుడి ప్రాకారానికున్న ఎలక్ట్రిక్ ఫెన్సింగ్ గురించి అన్ని వివరాలు వారు తెలుసుకోగలిగారంటే .... ఖచ్చితంగా ఇందులో ఎవరిదో ఒక లోకల్ వ్యక్తి పాత్ర వుండాలి.

'ఎవరు? ఎవరా కల్ప్రిట్?'

అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

# 6

గదిలో అసహనంగా అటూ, ఇటూ పచార్లు చేస్తున్నాడతడు. అతడి చూపులు మాటి, మాటికీ వీధి గుమ్మం వైపు ప్రసరిస్తున్నాయి.

కొద్దినిమిషాల తరువాత తలుపులను ఎవరో తట్టిన శబ్దం వినిపించింది. ఒక్క వుదుటున వెళ్ళి తలుపులు తెరిచాడతడు.

బయట నిలబడ్డ వ్యక్తిని చూసిన వెంటనే అతడి కళ్లు మిలమిలా మెరిసాయి.

రెండవ వ్యక్తి లోపలకు రాగానే తలుపులు గడియ వేసాడు.

"ఏం శంకర్! కాయా....? పండా....?" ఆత్రంగా అడిగాడతడు.

"లాభంలేదు నాగేంద్రా! పోలీసులు పిచ్చికుక్కల్లా తిరుగుతున్నారు."

అసహనంతో నాగేంద్ర భృకుటి ముడిపడింది.

"అన్ని జ్యూయలరీ షాపులకూ ఈ నగల చోరీ గురించి ఇన్ఫర్మేషన్ అందించబడింది. పోలీసులకు చెప్పకుండా ఒక్క పాత నగను కూడా వారు కొనడానికి వీల్లేదని డి.ఎస్.పి. ఆర్డర్స్."

"పాత నగలను కొనరా! అయితే బంగారాన్ని ముద్ద చేసి అమ్మేద్దాం శంకర్." నాగేంద్ర పెదవులపై సన్నని వక్రహాసం.

"అదీ ప్రయత్నించాను నాగేంద్రా! మొత్తం జిల్లాలోని బంగారు పనివారందరినీ కవర్ చేసేసారు ఆ స్పెషల్ స్క్వాడ్స్ చిన్న, చిన్న నగలను సైతం కరిగించడానికి భయపడిపోతున్నారు వారు."

"మన బంగారాన్ని కరిగించుకోవడానికి యెవరో ఎందుకు శంకర్?"

నాగేంద్ర వంక ఆశ్చర్యంగా చూశాడు శంకర్.

"నా పూర్తి పేరేమిటో తెలుసా శంకర్?"

తెలియదన్నట్లు తల అడ్డంగా ఆడించాడు శంకర్.

"నాగేంద్రాచారి. అచ్చమైన విశ్వబ్రాహ్మణ్ని నేను. బంగారాన్ని కరిగించడమనేది మాకు వెన్నతో పెట్టిన విద్య."

నమ్మలేనట్లు చూస్తున్నాడు శంకర్. గబ. గబా చిన్న కాగితంమీద యేవో పేర్లను వ్రాసాడు నాగేంద్ర. ఆ చీటిని శంకర్ చేతికిచ్చాడు.

"బజారుకు వెళ్ళి ఈ మెటల్ మెల్టింగ్ పరికరాలను కొని తే శంకర్ ... క్విక్."

శంకర్ ఆ చీటి పట్టుకుని బజారుకు బయలుదేరాడు. నాగేంద్ర రెండు నిమిషాలసేపు ఏదో ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు.

తరువాత రూమ్‌కు తాళంవేసి కాస్త దూరంలో వున్న పోస్టాఫీసుకు వెళ్ళాడు.

పోస్టాఫీసు కాంపౌండ్‌లో వున్న ఎర్రని వుడెన్ షెడ్ దగ్గరకు నడిచాడు. అది టెలిఫోన్ బూత్. ఆ బూత్‌లో ఒక వ్యక్తి కూర్చుని వుంటాడు. అతనికి మనకు కావాల్సిన నంబర్ చెబితే డయల్ చేసి కాల్ మెచ్యూర్ అయిన వెంటనే మనకు రిసీవర్ యిస్తాడు.

పెద్ద పెద్ద పట్టణాలలో మాత్రమే వుండే అలాంటి ఫోన్ల సౌకర్యం ఈ మధ్యనే విశాఖపట్టణంలో కూడా ప్రవేశపెట్టబడింది.

నాగేంద్ర చెప్పిన నెంబరుకు డయల్ చేసి, కాల్

మెమ్యార్ అయిన వెంటనే అతడికి రిసీవర్ నిచ్చాడు బూత్‌లోని క్లర్కు.

"హాలో సర్! నేను నాగేంద్రని మాట్లాడుతున్నాను."

"...............…"

"శంకర్, నేనూ ఆ ప్రయత్నంమీదే వున్నాం సర్. పసుపుకొమ్ములు ఎక్కడా అమ్ముడుపోవటంలేదు సర్. అందుకే పసుపును ముద్ద చేసేద్దామనుకుంటున్నాం.

నూరడానికి పాత్రం తెమ్మని ఇప్పుడే శంకర్‌ను బజారుకు పంపించాను. మీకీ విషయం చెబుదామని నేను పోస్టాఫీసుకు వచ్చి ఫోన్ చేస్తున్నాను."

"........ ........"

"అలాగే సర్! వుంటాను."

రిసీర్‌నున క్రేడిల్ మీద వుంచేసి, కాల్ ఫీజు చెల్లించి వెళ్ళిపోతున్న నాగేంద్ర వంక ఆశ్చర్యంగా చూశాడు ఆ క్లర్క్ అతడి మాటలలోని మర్మం ఏమిటో అతడికి అర్థంకాలేదు.

అదే సమయానికి ...

షాపు కౌంటర్ ముందున్న స్టీలు స్టూలుపై కూర్చున్న శంకర్ అసహనంగా మాటి, మాటికీ వాచీ వంక చూస్తున్నాడు.

"ఒక్క పది నిమిషాలు సర్. మీకు కావాల్సిన పరికరాలను తేవడానికే మా సేల్స్ బాయ్ మా గోడౌన్‌కు వెళ్ళాడు. సారీ ఫర్ ది ఇన్‌కన్వీనియన్స్" అన్నాడు కౌంటర్‌లోని వ్యక్తి.

అయితే ఆ సేల్స్ బాయ్ వెళ్ళింది గోడౌన్‌కు కాదని, ప్రక్క షాపునుండి పోలీసులకు ఫోన్ చేయ

డానికని శంకర్‌కు తెలియదు.

బంగారాన్ని అమ్మటానికిగాని, ఏ బంగారు పనివాడి దగ్గరయినా కరిగించడానికిగాని ఎప్పుడయితే నేరస్తులకు అవకాశం లేకుండా పోయిందో.... వారే బంగారాన్ని కరిగించడానికి ప్రయత్నిస్తారని పోలీసులకు తెలుసు.

అందుకే వారు ఆ దారిలో కూడా ఉచ్చును బిగించి వుంటారు. అది తెలియక శంకర మెల్టింగ్ మెషిన్ కొనడానికి వచ్చి వారి ఉచ్చులో చిక్కుకున్నాడు.

తనకు కావాల్సిన పరికరాలను కొనుక్కొని ఆటోలో తమ రూమ్‌కు బయిలుదేరా డతడు.

ఆ ఆటోను మరో టాక్సీ వెంబడిస్తున్న విషయం అతడికి తెలియదు. ఆ టాక్సీలో మఫ్టీలోనున్న నలుగురు పోలీస్ స్పెషల్ స్క్వాడ్ మనుషులు వున్నారు.

ఆటో ఆ ఇంటిముందు ఆగింది. దాని వెనుక పది గజాల దూరంలో టాక్సీకూడా ఆగింది.

"టక్ . టక్.... టక్" మంటూ తలుపుల చప్పుడు కాగానే తలుపులు తెరిచాడు నాగేంద్ర.

చేతిలో పరికరాలతో నిలబడ్డ శంకర్‌ను చూడగానే సంతోషంతో అతడి ముఖం వెలిగిపోయింది.

"కమాన్ శంకర్" అన్నాడతడు ఆనందంగా.

శంకర్ గదిలోనికి వచ్చాక, తలుపులు వేయబో తుండగా విసురుగా తలుపులు త్రోసుకుంటూ లోపలకు ప్రవేశించారు ఆ పోలీస్ అధికారులు.

జరిగిందేమిటో అర్థమయ్యే లోపుగానే ఇద్దరు అధి కారులు శంకర్, నాగేంద్రలను కదలకుండా బంధించారు. గదిని సెర్చ్ చేయడం ప్రారంభించారు మిగిలిన ఇద్దరు అధికారులు.

ఒక పాత గుడ్డసంచి అడుగున, చింకి గుడ్డల మధ్య లభించాయి వారికి కొన్ని బంగారు నగలు.

అవి .... భీమునిపట్టణం భ్రమరాంబికా దేవి ఆలయంలో దొంగలింపబడ్డ నగలలో కొన్ని.

## 7

'దేవాలయ నగల చోరీకి సంబంధించిన ఇద్దరు దొంగలు..పోయిన నగలలో కొన్నింటితో పట్టుబడ్డారని' మెసేజ్ వచ్చిన వెంటనే విశాఖపట్టణం బయలుదేరాడు శాంతిభూషణ్.

శంకర్, నాగేంద్ర అన్న పేర్లతో పిలవబడే వారిద్దరూ పోలీసుల రికార్డులలోనికి ఎక్కిన పాత నేర స్తులే. అయితే జేబు దొంగతనాలలాంటి చిల్లర నేరాలు చేస్తూ పొట్టపోసుకొనే ఆ ఇద్దరూ....ఇంత తెలివిగా, ఇంత పకడ్బందీగా ఒక దేవాలయ దోపిడీ పథకాన్ని వేసారంటే....పోలీసులకు నమ్మకం కాలేదు.

కేవలం వీరిద్దరూ తెరమీద ఆడే తోలుబొమ్మల లాంటి వారని, తెర వెనుక ఉండి వీరిని ఆడిస్తున్న అసలు దొంగ యెవరో వున్నారని పోలీసు అధికారులకు గట్టి అనుమానం.

కొట్టు వర్ర వాడు చెప్పిన ముగ్గురు సాధువులలో ఇద్దరు శంకర్, నాగేంద్రలయితే....మూడవ వ్యక్తి యెవరో ఉండాలి కదా?

అయితే పోలీసులు ఎంత ప్రయత్నించినా, ఎన్ని చిత్రహింసలు పెట్టినా వారిద్దరూ పెదవి విప్పటంలేదు.

ఆ మూడవ వ్యక్తి పేరుగాని, మిగిలిన నగల ఆచూకీని గాని వారు చెప్పటంలేరు.

వారు చెబుతున్నది ఒక్కటే!

'ఎవరో అపరిచిత వ్యక్తి తమను కలుసుకొని ఈ పనికి నియమించాడు పని పూర్తయితే వచ్చిన సొమ్ములో సగం వాటా ఇస్తానని ఆశ పెట్టాడు.'

అంతవరకు మించి, ఆ వ్యక్తి ఎవరో, ఎక్కడ వుంటాడో ఏమీ వారికి తెలియదు.

మొదటిసారి వారిని కలసినప్పుడు, ఒక ముసలి బిక్షగాని రూపంలో వున్నాడు రెండవసారి అంటే నగల చోరీ జరిగినవాడు సాధువు వేషంలో వున్నాడు. అతడి అసలు రూపంకూడా వారికి తెలియదు.'

వారు నిజం చెబుతున్నారో, అబద్ధం చెబుతున్నారో కూడా తేల్చుకోలేని సందిగ్ధంలో పడ్డారు పోలీసులు.

అయితే ...ఒక్క విషయం మాత్రం వారికి స్పష్టంగా తెలుస్తూంది.

పేరు పొందిన నేరస్థులయితే పోలీసులకు అనుమానం వస్తుందని, అనామకులైన ఈ చిల్లర దొంగలను ఎన్నుకున్నాడతడు. అంతకన్నా తెలివైన పనేమిటంటే.... తనెవరో వారికి తెలియకుండా జాగ్రత్తపడటం.

'ఎలా ఆ మూడవ వ్యక్తి ఆచూకీని తెలుసుకోవడం?' అని పోలీసు అధికారులు తీవ్రంగా ఆలోచించసాగారు.

ఆ రోజు సాయంత్రమే భీమునిపట్టణానికి తిరిగి వచ్చేశాడు ఇన్‌స్పెక్టర్ శాంతిభూషణ్.

స్టేషన్‌లో ఒక గంటసేపు కూర్చుని, రైటర్ తెచ్చిన ఫైళ్ళను చూసిన తరువాత టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌కు బయలుదేరాడతడు.

అసలు నేరస్థుడు భీమునిపట్టణంలోనే వున్నాడని అతడికెందుకో గట్టినమ్మకం.

తన అనుమానం నిజమయితే .... ఆ నేరస్థుడు ఆ

నగలను అమ్మటానికి తన అనుచరులను వైజాగ్ లాంటి పెద్ద పట్టణాలకు పంపించి వుంటాడు.

తమ ప్రయత్నం ఎంతవరకు సఫలీకృత మయ్యిందీ తమ బాస్‌కు తెలియచేయటానికి ప్రయత్నిస్తారు అతడి అనుచరులు.

ఎలా తెలియజేస్తారు?

పోలీసు నిఘా ఇలా వుంటుండగా, తన అనుచరులను ముఖాముఖీ కలుసుకోవడానికి బాస్ ఇష్టపడక పోవచ్చు.

మరి....తన అనుచరులు ఏం చేస్తున్నదీ అతడికి ఎలా తెలుస్తుంది?

బహుశా....ముఖ్యమైన సమాచారం వుంటే....తనకు ఫోన్ చేయమని చెప్పి వుంటాడు. కావంటే యెవరైనా వారి సంభాషణను విన్నా....అర్థంకాకుండా యేదో కోడ్ భాషను ఏర్పరుచుకోవచ్చు.

ఇదీ కాంతిభూషణ్ ఊహ.

అందుకే, ఎందుకయినా మంచిదని .... భీమునిపట్టణానికి వచ్చే ట్రంకాల్స్ అన్నింటిని రికార్డు చేసి వుంచమని, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌కు ఆజ్ఞను జారీచేశాడు.

ఎక్స్ఛేంజ్‌లో కూర్చుని, ఆ రోజు రికార్డు చేయబడ్డ కాల్స్‌ను వినసాగాడతడు.

అన్నీ సాధారణమైన కాల్సే. కొన్ని బిజినెస్ కాల్స్ మరికొన్ని వ్యక్తిగత విషయాలకు సంబంధించినవి.

అయితే....వాటిలో ఒకే ఒక కాల్ అతడిని ఎందుకో ఆకర్షించింది.

దానికి కారణం! నగల చోరీలో విశాఖలో అరెస్టు కాబడ్డ ఇద్దరు దొంగలలో నాగేంద్ర, శంకర్ పేర్లు ఆ కాల్‌లో ప్రస్తావించబడటం.

అతడు టేప్ ను రివైండ్ చేసి మళ్ళీ ఆ కాల్ ను శ్రద్ధగా ఆలకించాడు

"పసుపుకొమ్ములు ఎక్కడా అమ్ముడు పోవటంలేదు సర్. అందుకే పసుపును ముద్ద చేద్దామనుకుంటున్నాం. నూరడానికి పాత్రం తెమ్మని ఇప్పుడే శంకర్ ను బజారుకు పంపించాను...."

అంతే! మంచు తెరలు విడినట్లు అనిపించసాగింది అతడికి.

'పసుపుకొమ్ములంటే నగలు అయివుంటాయి. నగలను అమ్మటానికి అవకాశం చిక్కలేదు గాబట్టి, వాటిని కరిగించి ముద్ద చేద్దామనుకున్నారు.

పాత్రం అంటే మెల్టింగ్ మెషీన్ అయివుంటుంది.

బహుశా....అది కొనడానికి బజారుకు వెళ్ళిన శంకర్ పోలీసుల వలలో చిక్కాడు.'

తన ఆలోచనలో ఎక్కడా లోపం లేనట్లు అనిపించింది అతడికి.

ఆ కాల్ ఎక్కడకు చేయబడిందో కనుక్కున్నాడతడు. రికార్డుతీసి చెప్పాడు ఎక్స్ఛేంజ్ క్లర్క్.

ఆ కాల్ హోటల్ శాంతి భవన్ కు చేయబడింది.

అయితే... ఆ కాల్ బుక్ చేయబడ్డది ఆ హోటల్ ప్రొప్రయిటర్ షణ్ముగం పేరకాదు. ఎవరో అప్పలస్వామి పేర.

"ఎవరీ అప్పలస్వామి?" అనుకున్నాడతడు.

"ఎనీ హౌ తీగ దొరికింది. ఇక దొంగను లాగొచ్చు" అనుకుంటూ ఉత్సాహంగా శాంతి భవన్ కు బయలుదేరాడు.

భీమునిపట్టణంలో మంచి పేరుపొందిన శాఖాహార

బ్రాహ్మణ భోజనహోటల్ శాంతి భవన్. వచ్చే, పోయే కస్టమర్లతో ఎప్పుడూ కిక్కిరిసి వుంటుంది.

కౌంటర్ లో కూర్చున్న హోటల్ యజమాని షణ్ముగం, ఇన్ స్పెక్టర్‌ను చూడగానే కంగారుగా లేచి నిలబడ్డాడు.

"ఏమి కావాలి సర్" అన్నాడు వినయంగా.

తను వచ్చిన పని టూకీగా చెప్పి, 'ఆ కాల్‌ను రిసీవ్ చేసుకున్న అప్పలస్వామి ఎవరని' అడిగాడు ఇన్ స్పెక్టర్.

తనకు తెలియదన్నాడు షణ్ముగం.

"మీరు అతడిని చూడలేదా?"

"చూ స్తిని సర్."

"ఎలా వున్నాడు?"

"ఒట్టి పల్లెటూరి రైతు తీరున వుండె సర్. ముఖం నిండా గడ్డం, మీసం వుంది. మా తిరుమాళ్ మాదిరి నిండా నామం వుంది. తలమీద కొప్పు వుంది. ఆఁ.... కళ్ళజోడు కూడా వుంది"

గుర్తు చేసుకుంటూ చెప్పాడు షణ్ముగం.

"అంతకు క్రితం మీ రెప్పుడైనా అతడిని చూశారా?"

"అబ్బే.... ఇల్లెసామీ.... (లేదు)"

"అంటే.... అతడిని చూడటం ఇదే మొదటిసారా?"

"అవును!"

"మరి.... అతడి రూపం.... ఆకారం అంత స్పష్టంగా ఎలా చెప్పగలుగుతున్నారు మీరు?"

"ముందు హోటల్‌కు రాగానే నేరుగా ఈ కౌంటర్ దగ్గరకే వస్తాడు. 'నా పేరు అప్పలస్వామి.... వైజాగ్ నుండి ఒక ఫోన్ కాల్ వస్తదని' చెప్పి ఆ

టేబిల్ దగ్గరే కూసున్నాడు. నిండా సాపాటు సేసిండు. దానికి అపరం.... జేబునుండి నిప్పుపెట్టె పైకి తీసుడు. నే జూస్తును కదా. ఒక నిప్పుపుల్ల ఎలిగించి, దానినే అట్టా సూస్తుడు. మళ్ళీ ఇంకోటి ఎలిగిస్త.... సూస్త. అంద మాదిరి ఊరికినే నిప్పుపుల్లలన్నీ ఎలిగిస్తుడు. ఏందప్పా! అదొకమాదిరిగున్నాడని... ఆ మనిషిని తేరి సూస్తును."

షణ్ముగం మాటలు వింటుంటే గుడిలో, ఆటు సంపెంగ పొద క్రింద దొరికిన అగ్గిపుల్లలు గుర్తుకు వచ్చాయి ఇన్స్పెక్టర్ కు.

"సందేహంలేదు. వాడే వీడు" అనుకున్నాడతడు.

బహుశా ఇదీ మారువేషమే అయివుంటుంది. రోజూ కోర్టు పనిమీద, వ్యాపార నిమిత్తం, యింకా యితర వ్యాపకాల మీద ఎందరో పల్లెటూరివాళ్ళు రోజూ భీమునిపట్నం వస్తుంటారు. ఎవరినని అనుమానిస్తాడు? ఎక్కడని వెతుకుతాడు?

దొంగ చేతికందినట్లే అంది తెలివిగా తప్పించుకుంటున్నాడు.

అతడికి ఒక్క విషయం మాత్రం సంతోషంగా వుంది అది: దొంగ తను ఊహించినట్లుగా భీమునిపట్నంలోనే వున్నాడు.

"దొంగను పట్టడానికి మరో క్రొత్త ఉచ్చును పన్నాలి" అనుకుంటూ అతడు హోటల్ బయటకు నడిచాడు.

# 8

డిస్ట్రిక్ట్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ ఆఫీసు....

డి.ఎస్.పి. ముందు ఎటెన్షన్లో నిలబడి వున్నాడు ఇన్స్పెక్టర్ శాంతిభూషణ్.

'భీమిలీ ఎక్స్ఛేంజ్ వారు ముందురోజు రికార్డు చేసిన 'పసుపు కొమ్ముల' ట్రంకాల్ గురించీ, ఆ తరువాత శాంతి భవన్‌లో తను అప్పలస్వామి గురించి చేసిన విచారణ గురించి' వివరంగా డి.ఎస్.పి.కి చెప్పాడతడు.

"సర్! ఆ ట్రంకాల్ చేసింది నాగేంద్రేనని దేవపట్నంలో ఏ సందేహమూ లేదు. ఎందుకయినా మంచిదని ఈ రోజు ఉదయం నాగేంద్ర వాయిస్ రికార్డు చేసి పెట్టు చేశాను. ఎక్స్ఛేంజ్ వారు రికార్డు చేసిన వాయిస్‌తో కరెక్టుగా సరిపోయింది అతడి గొంతు.

"అయితే తమ బాస్ భీమునిపట్నంలోనే వున్నాడని గాని, అతడికి తను ఫోన్ చేసినట్లు గాని నాగేంద్ర మనకు చెప్పలేదు. అంటే.... అతడికి నిజం తెలిసికూడా మన దగ్గర దాస్తున్నాడన్నమాట. మనం ఎంత అడిగినా ఆ మూడవ వ్యక్తి ఎవరో తమకు తెలియదంటున్నారు వారు. ఒకవేళ అదీ అబద్ధమే నేమో! వారికి తెలిసీ మన దగ్గర దాస్తున్నారేమో!"

శాంతిభూషణ్ వంక ప్రశంసాపూర్వకంగా చూసాడు డి.ఎస్.పి.

"గుడ్ వర్క్ మై బాయ్! దెన్, వాట్ ఆర్ యువర్ ఫర్దర్ ప్లాన్స్?" కుతూహలంగా అడిగాడు డి.ఎస్.పి.

"సర్! నగల చోరీలో ఈ ఇద్దరు దొంగలూ పట్టుబడిన విషయం మనం యింకా రహస్యంగానే వుంచాం. కాబట్టి, తన అనుచరులు పట్టుబడినట్లు ఆ మూడవ వ్యక్తికి తెలిసి వుండదు.

"బహుశా.... ప్రతిరోజూ ఒక నిర్ణీత సమయంలో ఒక సంకేత స్థలంలో తనకు ఫోన్ చేస్తూండమని అతడు

తన అనుచరులకు చెప్పి వుంటాడు. కాని, గత రెండు రోజులుగా అతడి అనుచరులిద్దరూ మన కస్టడీలో వున్నారు.

"నా అంచనా తప్పుకాకుంటే తన అనుచరుల దగ్గర నుండి ఏ సమాచారమూ లేక అతడు ఈసరికి ఆందోళన పడుతుంటాడు. ఆ ఆత్రంలో అతడు తను గీచుకున్న గిరిని దాటి కొద్దిగా బయటకు వచ్చే అవకాశం వుంది. అతడు రాకుంటే మనమే రప్పించాలి.

"సరిగ్గా... ఆ అవకాశాన్ని మనం వినియోగించుకో గల్గితే.... అతడిని ట్రాప్ చేయవచ్చని నా నమ్మకం సర్."

మరోసారి శాంతిభూషణ్ వంక మెచ్చుకోలుగా చూశాడు డి.ఎస్.పి.

సరిగ్గా వీరు యిక్కడ మాట్లాడుకుంటున్న సమయం లోనే .. అక్కడ భీమునిపట్నంలో....

నవతా ట్రాన్స్‌పోర్టు ఆఫీసు గదిలో కూర్చుని వున్నా డొక ముస్లిమ్ వృద్ధుడు.

గళ్ళ లుంగీమీద, మోకాళ్ళు దాటిన తెల్లని లాల్చీ ధరించాడు. తలపై రూమీ టోపీ, మెడలోనూ, జబ్బ మీద తాయెత్తులు. తెల్లని నిడుపాటి గడ్డం. నెరసిన జుట్టూ ముసలితనాన్ని సూచిస్తున్నా, మనిషి మాత్రం దృఢంగా, బలంగా వున్నాడు.

మూడు బేళ్ళ గొర్రె తోళ్ళను విజయవాడ పంప టానికి కిరాయి యెంత అవుతుందో కనుక్కోవడానికి నవతా ట్రాన్స్‌పోర్టుకు వచ్చాడతడు.

'తన పేరు సయ్యద్ అలీ అని.... తన పేర ఆ ట్రాన్స్‌పోర్టు ఆఫీసుకు విశాఖపట్టణంనుండి ఒక ఫోన్ కాల్ వస్తుందని, ఆ కాల్ వచ్చేంతవరకూ ఆఫీసులో

ఒక మూల కూర్చుంటానని' ఎంతో వినయంగా ట్రాన్స్ పోర్టాఫీసు క్లర్కుతో చెప్పాడతడు.

కాని, సుమారు మూడు గంటలు గడిచినా, ఆ ముస్లిమ్ వృద్ధుడు ఎదురుచూస్తున్న ఫోన్ కాల్ రాలేదు. అతని ముఖంలో అసహనం తొంగిచూస్తుంది.

"ఇది మూడవరోజు ఈ రకం వరుసగా ఫోన్ రాక పోవటం. ఏమయినట్లు వీ డ్దరూ?" విసుగ్గా తనలో తాను గొణుక్కున్నాడతడు.

అతడి ముందు ఆరిపోయిన అగ్గిపుల్లలు కుప్పలా పడి వున్నాయి. ఒక్కొక్క అగ్గిపుల్లనూ వెలిగించి, అది ఆరి పోయేటంతవరకూ దానినే చూస్తూ కూర్చున్న ఆ వృద్ధుని వంక ఆశ్చర్యంగా చూడసాగాడు ఆ క్లర్కు.

మరో అరగంట సేపు వెయిట్ చేసాక, నిరాశగా కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయాడా వృద్ధుడు.

# 9

ఉదయం పది గంటల వేళ....

సెల్ లోని నేలమీద వెల్లకిలా పడుకొని వున్నారు నాగేంద్ర, శంకర్. వారి చూపులు నిస్తేజంగా వున్నాయి.

వారిని సెల్ లో పెట్టి సరిగ్గా అది నాల్గవరోజు. పోలీసులు కొట్టిన లాఠీ దెబ్బలతో వాళ్ళ శరీరాలు హూనమై, పచ్చిపుళ్ళలా వున్నాయి.

శరీరంలోని శక్తినంతా ఎవరో తోడేసినట్లు, నరాలు చచ్చుబడినట్లు....ఎంతో నిస్త్రాణంగా వుంది వారికి. మగతలో కన్నులు మూతలుపడుతున్నాయి.

నేరస్తుల నోటినుండి రహస్యాలను కక్కించడానికి పోలీసులిచ్చే ట్రీట్ మెంట్ పవర్ అలాంటిది.

ఇన్ని రోజులూ ఎలాగో సహించగల్గారు వారు. కాని క్షణ క్షణానికీ వారి మనస్సులు వారి స్వాధీనం తప్పి పోతున్నాయి. దే ఆర్ లూజింగ్ దైర్ మెంటల్ పవర్.

'పోలీసుల లాఠీలు మరోసారి తమ శరీరాలను తాకితే యిక తాము నిజాన్ని దాచలేమని' వారికి భయంగా వుంది.

'పోలీసులు వస్తారేమో! మళ్ళీ తమపై ట్రీట్ మెంట్ ప్రారంభిస్తారేమో!'నని ఆందోళనతో తల్లడిల్లిపోతున్నారు వారు.

అంతలో....టక్....టక్....మంటూ బూట్ల శబ్దం వినిపించింది వారికి. సరిగ్గా ఆ బూట్ల చప్పుడు వారున్న సెల్ ముందుకే వచ్చి ఆగింది.

కిర్రుమని చప్పుడు చేస్తూ సెల్ తలుపులు తెరుచుకున్నాయి.

"వచ్చేసారు యమకింకరులు" అనుకున్నారు వారు. ఏదో తెలియని భయంతో వారు గట్టిగా కళ్ళు మూసుకున్నారు.

అయితే వారు ఊహించినట్లుగా ఆ పోలీసులు వచ్చింది వారిని తీసుకువెళ్ళడానికి కాదు. మరో క్రొత్త నేరస్థుడిని ఆ సెల్ లో వేయడానికి.

సెల్ కు తాళం వేసి, పోలీసులు దూరంగా వెళ్ళిపోయినంతవరకూ వారు కళ్ళు తెరవలేదు.

తరువాత మెల్లగా కళ్ళు తెరిచి చూసారు వారు.

ఇనుపచువ్వలకు ఆనుకుని నిలబడి వున్నాడు క్రొత్తగా వచ్చిన ఆ ఖైదీ. ఆ నిలబడటంలో ఒకవిధమైన ఠీవి, దర్జా, నిర్భీతి కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి.

సుమారు ముప్పయి సంవత్సరాల వయసుంటుంది అతడికి. నీట్ గా ట్రిమ్ చేయబడ్డ అందమైన గడ్డం. పైకి దువ్విన నల్లని వత్తయిన జుట్టు. తీక్షణమైన కళ్ళు. హిందీ హీరో కబీర్ బేడీలా వున్నాడు అనుకున్నారు వారు అతడిని చూస్తూ.

వారిని చూసి పలకరింపుగా నవ్వాడతడు.

చుట్టూ ఒక్కసారి చూసి, దగ్గరలో సెంట్రీలెవరూ లేరని ధృవపరచుకున్నాక జేబులోనుండి, అగ్గిపెట్టెను పైకి తీసాడు.

అతడు చేస్తున్న పనిని చూసి వారు ఆశ్చర్య పోయారు.

జైలులోనికి ఏ ఖైదీనైనా పంపేముందు, అతడి దగ్గరున్న వస్తువులనన్నింటినీ పోలీసులు స్వాధీనపరచుకుంటారు. మరి అతడి దగ్గరకు అగ్గిపెట్టె ఎలా వచ్చింది?

అతడు పోలీసు వర్గాల్లో పలుకుబడిగల వ్యక్తా?

అయితే వారి ఆశ్చర్యానికి కారణం అది కాదు.

అతడు ఒక్కొక్క అగ్గిపుల్లను వెలిగించి, అది ఆరిపోయేటంతవరకూ చూస్తూ.... ఆరిపోయిన అగ్గిపుల్లలను ఒక మూలకు గిరవాటు వేస్తున్నాడు.

"అలా అగ్గిపుల్లలను వెలిగించేది తమ బాస్. మరి ఇతడు..? అదీ తమ ఎదురుగా ఎందుకు వెలిగిస్తున్నాడు?"

వారు అతని వంక సందేహంగా చూడసాగారు.

ఆ వ్యక్తి మరోసారి చిన్నగా నవ్వాడు. వారి కళ్ళలోకి సూటిగా చూస్తూ.........లో గొంతుతో ఇలా అన్నాడు.

"పసుపు కొమ్ములు అమ్ముడు పోవటంలేదు. అందుకే

పశుపును ముద్ద చేసేద్దామనుకుంటున్నాం."

వారి మనసులు సందేహంతో ఊగిసలాడుతున్నాయి.

"ఎవరు నీవు?" అనుమానంగా అడిగాడు నాగేంద్ర.

"భ్రమరాంబికా దేవి భక్తుణ్ని. సంపెంగ పొదలో నాగేంద్రుడు చిక్కుపడ్డాడని, శంకరుడు చీకాకు పడుతున్నాడని తెలిసి .... వచ్చాను."

అతడి మాటలలోని అంతరార్థం అర్థమయిన వెంటనే చిరునవ్వులో వారి ముఖాలు వెలిగిపోయాయి.

'భ్రమరాంబికా దేవి ఆలయం, ఆ రోజు తాము దాక్కున్న సంపెంగ పొద, తమ పేర్లు.... ఫోనులో బాస్‌తో నాగేంద్ర మాట్లాడిన మాటలూ.... అన్నింటినీ మించి, అగ్గి పుల్లలను వెలిగించడం ... సందేహం లేదు. అతడు బాస్ పంపిన మనిషే' అనుకున్నారు వారు.

అతడిని చూస్తూంటే .... ప్రవాహంలో కొట్టుకు పోతున్న వాడికి గడ్డిపోచంత ఆసరా దొరికినట్లుంది వారికి.

అతడి పేరు నారాయణ.

అతడిపట్ల వారూహించినది నిజమే. వారిద్దరినీ జైలు నుండి తప్పించడానికే వచ్చాడతడు.

తమని రక్షించడానికి దివినుండి దిగివచ్చిన శ్రీమన్నారాయణుడిలా కనిపించాడతడు వారికి ఆ క్షణంలో.

"ఎప్పుడు?" ఆత్రంగా అడిగాడు నాగేంద్ర.

"ఈ రాత్రికే....!"

"ఎలా?"

నారాయణ లోగొంతుతో తన పథకాన్ని వారికి వివరించాడు.

ఆ క్షణాన టెన్షన్‌తో వారికి కాళ్ళు నిలువ లేదు. అసహనంగా ఆ సెల్‌లో పచార్లు చేయసాగారు

వారు. సిమెంట్ చప్టామీద ప్రశాంతంగా నిద్రపోతున్నాడు నారాయణ.

ఎప్పుడు చీకటిపడుతుందా అని ఆత్రంగా యెదురు చూస్తున్నారు వారు.

## 10

సాయంత్రం ఆరుగంటలు కావస్తూంది.

శీతాకాలం కావటంతో అప్పుడే మసకచీకట్లు ముసురుకోసాగాయి.

అంతవరకూ తోటపని చేసిన ఖైదీలు చేతులకూ, కాళ్ళకూ అంటిన మట్టిని శుభ్రంగా కడుక్కొని, మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ తిరిగి జైలులోనికి మరలిపోతున్నారు.

సెంట్రల్ జైలు గోడకానుకొని కొంత ప్రభుత్వ స్థలం వుంది. దాని చుట్టూ ఆరడుగుల గోడను కట్టించి, ఆ స్థలంలో ఖైదీలతో తోటపని చేయిస్తుంటారు జైలు అధికారులు.

ఖైదీలు తోటలో పనిచేస్తున్నంతసేపూ, ఆ ప్రహరీ చుట్టూ సెంట్రీలు కాపలా కాస్తుంటారు.

ఖైదీలందరూ తోటలోనుండి జైలు ఆవరణలోనికి వచ్చేసాక, ప్రహరీగోడకున్న తలుపును మూసేస్తాడు సెంట్రీ.

ఆ రోజు తోటపనికి పంపబడ్డ ఖైదీలలో నాగేంద్ర, శంకర్, నారాయణ్‌లు కూడా వున్నారు.

కాళ్ళూ, చేతులు కడుక్కోవడానికి, ఖైదీలంతా సిమ్మెంట్ కాలువ దగ్గరకు చేరిన సమయంలో ఆ ముగ్గురూ నేర్పుగా మూడు పొదలలో దాక్కున్నారు.

ప్రహరీ గేటు దగ్గరున్న సెంట్రీ....ఒక్కొక్కరి పేరు పిలుస్తుంటే, ఆ ఖైదీ జైలులోనికి ప్రవేశిస్తు

న్నాడు. మిగిలిన వారి వెనుక ఆరుగురు సెంట్రీలు గోడలా నిలబడి వున్నారు.

ఖైదీలు తప్పించుకోకుండానూ, తోటపనికి పంపబడ్డ ఖైదీలంతా తిరిగి జైలులోనికి వచ్చారో, లేదో తెలుసుకోడానికీ పోలీసులు తీసుకునే జాగ్రత్త అది.

హాజరు పలికి, లోపలికి పోయిన ఖైదీలు కాక, ఇంకా పది, పన్నెండుమంది బయట వున్నారు. మరొక పేరు పిలిచాడు హాజరు వేస్తున్న సెంట్రీ. ఒక ఖైదీ చేయి పైకెత్తి ముందుకు నడిచాడు.

అంతలో....

"ధన్"మంటూ యేదో బాంబు ప్రేలిన శబ్దం వినిపించింది.

మరోసారి బాంబు ప్రేలిన శబ్దం. ఈసారి వారికి దగ్గరగా....

తెల్లని దట్టమైన పొగ మెల్లగా ఆ పరిసరాలను ముంచెత్తసాగింది. ఇంతలో మరో బాంబు ప్రేలుడు.

సెంట్రీలు ఎలర్టు అయ్యారు. తమ ముందున్న ఖైదీలను లాఠీలతో కవర్ చేస్తూ....బలంగా జైలు లోపలకు నెట్టి తలుపు మూసారు.

గేటు దగ్గరున్న సెంట్రీకి....మిగిలిన ఖైదీల హాజరు తీసే అవకాశం లేకపోయింది. ఒక్కసారిగా....మూక ఉమ్మడిగా లోపలకు చొచ్చుకొని వచ్చారు వారంతా.

అయితే వారికి సంతృప్తికరమైన విషయం ఏమిటంటే గేటుముందు నిలబడ్డ ఖైదీలెవరూ తప్పించుకుపోలేదు.

వారికి తెలిసింది: ఎవరో ఖైదీలు చేతి బాంబులను ఉపయోగించి, తప్పించుకోవడానికి ప్రయత్నించారు.

వారికి తెలియనిది: అవి నాటు బాంబులు కావని,

దీపావళి బాంబులన్న నిజం.

జైలులోని సైరన్ ప్రయోగించబడింది. సెంట్రీలందరూ ఎలర్టు చేయబడ్డారు.

అయితే.... బాంబులనుండి తెల్లని పొగ పైకివచ్చిన వెంటనే నారాయణ చివుక్కున పైకి లేచి పరుగెత్తడం ప్రారంభించాడు. అతడిని అనుసరించారు మిగిలిన ఇద్దరూ.

దక్షిణ దిక్కున గోడ ప్రక్క కాపలా వుండదని నారాయణకు తెలుసు. అక్కడ పదిహేను అడుగుల లోతున్న పెద్ద గోయి వుంది. కార్పొరేషన్ వారు టౌన్ లోని చెత్తనంతా తెచ్చి ఆ గోతిలో వేస్తున్నారు.

వారు ముగ్గురూ సూటిగా ఆ దిక్కుకే పోయారు. ఆరడుగుల ఎత్తున్న ఆ గోడను దూకడం వారికో సమస్య కాలేదు. ముందు, వెనుకలు ఆలోచించకుండా ఆ చెత్తకుప్పలో గెంతేసారు వారు.

వారి అదృష్టం. అందులో గాజు పెంకులు లేవు. పేరుకున్న చెత్త కుషన్‌లా వుండటంచేత, అంత ఎత్తునుండి దూకినా వారికేం బాధ అనిపించలేదు.

క్రిందపడ్డ మరుక్షణం.... తమ ఒంటిమీదున్న జైలు యూనిఫారాలను తీసిపారేశారు వారు. ఇప్పుడు కేవలం వారి ఒంటిమీద అండర్ వేర్లు మాత్రం వున్నాయి.

ఆ గోతిలోనుండి పరుగెత్తుకుంటూ రోడ్డును సమీపించారు వారు. రోడ్డు ప్రక్కగా ఆగి వుంది ఒక టాక్సీ. దాని బాక్ డోర్ తెరచివుంది. ఆ ముగ్గురునీ చూసిన టాక్సీ డ్రయివర్ టాక్సీని స్టార్టుచేసి సిద్ధంగా వుంచాడు.

మూడుసార్లు హెడ్‌లైట్స్‌ను ఆపి, వెలిగించాడు. అది నారాయణ ఏర్పరచిన సంకేతం.

వారు కారును సమీపించారు. ఆ ముగ్గురూ యొక్క

కూర్చున్న వెంటనే బాణంలా అక్కడినుండి దూసుకు పోయింది ఆ టాక్సీ.

చీకటిలో ఎవరూ వారిని గమనించలేదు. అదాటుగా చూసిన ఒకరిద్దరూ వారిని పట్టించుకోలేదు.

కేవలం అండర్ వేర్లు వేసుకున్న ముగ్గురు వ్యక్తులు చెత్తకుప్పల మధ్యనుండి పరుగెత్తుకువచ్చి ఆ టాక్సీలో ఎక్కడం.... నిజానికి ఎవరికైనా వింత గొలిపే దృశ్యమే.

కాని.... ప్రక్కింటిలో హత్య జరుగుతున్నా, తమ కళ్ళ ఎదురుగానే దోపిడీ జరుగుతున్నా, నడిరోడ్డుమీద స్త్రీలపై అత్యాచారాలు జరుగుతున్నా, తమకెందుకని పట్టించుకోకుండా వెళ్ళిపోయే పట్నవాసం ప్రజలు వారు.

ఆ ఒకరిద్దరు చూసినవారూ, ఆ విషయాన్ని అక్కడే మరచిపోయారు.

ఆ టాక్సీ వాల్తేరు అప్లాండ్స్ మీదుగా భీమిలీ బీచ్ రోడ్ వైపు దూసుకుపోతుంది.

టాక్సీలో సిద్ధంగా వుంచబడ్డ దుస్తులను వారు ముగ్గురూ ధరించారు. ఇప్పుడు వారు జైలునుండి తప్పించు కున్న వారిలా లేరు. డబ్బున్న దొరబాబుల్లా వున్నారు.

సరిగ్గా వారు తప్పించుకున్న అరగంట తరువాత.... ఆ ముగ్గురు పారిపోయారన్న నిజాన్ని గ్రహించ గల్గారు జైలు అధికారులు.

# 11

భీమునిపట్టణం పొలిమేరల్లో ఆగింది ఆ టాక్సీ. నాగేంద్ర, శంకర్ క్రిందకు దిగారు. నారాయణ మాత్రం ఆ టాక్సీలోనే వున్నాడు.

"మరి .... మీరు?" నారాయణ వంక సందిగ్ధంగా చూశాడు నాగేంద్ర.

"బాస్ నా కింకో పనిని అప్పగించాడు నాగేంద్రా! అది పూర్తి చేసుకొని వస్తాను నేను. మీరు వెళ్ళి ముందు బాస్‌ను కలవండి" అన్నాడు నారాయణ.

టాక్సీలో వెనక్కి వెళ్ళిపోతున్న నారాయణ వంక ఒక్క క్షణంపాటు చూసి ఊరిలోనికి నడిచారు వారు.

అయితే, వారు ఊహించినట్లుగా నారాయణ వెనక్కి వెళ్ళిపోలేదు. కొన్ని గజాల దూరం వెళ్ళాక, ఒక పొద చాటున టాక్సీని ఆపించాడు అతడు.

టాక్సీ దిగి, డాష్ బోర్డులోని వాకీ-టాకీని పైకితీసాడు.

"హాలో....హాలో....నారాయణ రిపోర్టింగ్...."

"... .... .... ...."

"ఆపరేషన్ వన్ సక్సెస్ సర్. నాగేంద్ర, శంకర్ ఊరిలోనికి ప్రవేశించారు. ఓవర్."

".... .... .... ...."

"అలాగే సర్. వుంటాను."

అతడు వాకీ టాకీని టాక్సీ డ్రయివర్ చేతికిచ్చి, చక, చకా తన వేషం మార్చుకోవడం ప్రారంభించాడు. ఐదు నిమిషాల్లో అతని స్థానంలో ఒక బెస్తవాడు ప్రత్యక్షమయ్యాడు

అతడుకూడా నాగేంద్ర, శంకర్లు వెళ్ళిన దిక్కు వంక వేగంగా నడవసాగాడు.

నూరు గజాల దూరం నడిచాక, రోడ్డు ప్రక్కనున్న మైలు రాయిపై కూర్చున్న మరో బెస్తవాడు కనిపించాడతడికి.

అక్కడ రోడ్డు రెండుగా చీలి వుంది. ఒకటి ఊరిలోనికి వెళ్తుంది. రెండవది... చిట్టివల్స అనే మరో ఊరికి పోయే రోడ్డు. ఆ వైపున ఎక్కువగా కొబ్బరి తోటలు

వున్నాయి.

"ఏం నీ నేస్తం వేట వెళ్ళలేదా?" అన్నాడు నారాయణ ఆ బెస్తవాణ్ణి చూస్తూ.

"ఎందుకూ చేపలే మనల్ని వెదుక్కుంటూ వస్తాం లే" అన్నాడు ఆ బెస్తవాడు.

"ఏం చేపలు....? బంగారు చేపలేనా?"

"ఆఁ....అమ్మోరి చేపలే!"

వారిద్దరూ ఒకరి నొకరు చూసి నవ్వుకున్నారు. తరువాత ఇద్దరూ కలిసి నడవటం ప్రారంభించారు.

"వారు వెళ్ళింది ఊరిలోనికి కాదు నేస్తం. కొబ్బరి తోటలవేపు" చిన్నగా అన్నాడతడు.

దారిలో ప్రతి నూరుగజాలకొక బెస్తవాడు వచ్చి వారితో కలుస్తున్నాడు.

నాగేంద్ర, శంకర్ వెళ్ళిన కొబ్బరి తోటను చేరేసరికి వారు ఆరుగురయ్యారు.

నాగేంద్ర, శరకర్ సూటిగా వెళ్ళి ఒక ఇంటిముందు ఆగారు. నాగేంద్ర వెళ్ళి తలుపు తట్టాడు.

తలుపులు తెరుచుకుని బయటకు వచ్చిన వ్యక్తి వీరిని చూసి ఆశ్చర్యపోయాడు.

"మీరా! మీరు .... మీరిక్కడికెందుకొచ్చారు?" అన్నాడతడు కంగారుగా.

"అదేమిటి సర్ .... సెంట్రల్ జైలులో చిక్కుకున్న మమ్మల్ని విడిపించి, యిక్కడికి రప్పించింది మీరేగా!" ఆశ్చర్యంగా అన్నాడు నాగేంద్ర.

"నేనా!"

ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాడతడు.

"అదే సర్ .... మీరు పంపిన నారాయణ...."

"నారాయణెవరు? నేను పంపడమేమిటి?" మరింత కంగారుపడుతూ అన్నాడతడు.

వారికి ఒకరి మాటలు ఒకరికి అర్థంగాక, కన్‌ఫ్యూజ్ అవుతున్న సమయంలో వారిని సమీపించారు ఆ ఆరుగురు బెస్తవాళ్ళు.

"వారిని జైలునుండి విడిపించింది నేనే గోవిందయ్యా" అన్నాడు నారాయణ.

"ఎ....ఎందుకు?" తడి ఆరి పోతు న్న గొంతుతో అన్నాడు గోవిందయ్య.

"తెర వెనుక దాక్కున్న నిన్ను బయటకు రప్పించడానికి మాకింకో మార్గం లేకపోయింది. వారిని జైలు నుండి తప్పిస్తే....అదీ నీవే తప్పించమన్నావని వారిని నమ్మించగలిగితే జైలునుండి తప్పించుకున్న మరుక్షణం వారు తిన్నగా నీ దగ్గరకే వస్తారు. అందుకే మీకోసం మాటువేసి చూస్తున్నాం."

"అంటే....మీరు...."

నారాయణ తన వేషం, పెట్టుడు గడ్డం తీసేశాడు. అతడ్ని చూసిన గోవిందయ్య కుప్పకూలిపోయాడు.

అతడు ఇన్‌స్పెక్టర్ శాంతిభూషణ్.

బెస్తవాళ్ళ రూపాలలో వున్న పోలీసులు ఆ ముగ్గురు దొంగలను కష్టడీలోనికి తీసుకున్నారు.

ఆ యింటిని సోదా చేయగా....ఒక గోతాంలో మిగిలిన నగలు లభించాయి.

ఇక . గోవిందయ్య ఎవర నేదేగా మీ సందేహం?

మన కొబ్బరికాయల కొట్టు వర్రవాడు లేడూ.... అతడి తండ్రే....ఈ గోవిందయ్య.

పూర్వాశ్రమంలో నాటకాల కంపెనీలో మేకప్

మాన్‌గా పని చేసేవాడితడు. అందుకే ఎవరికీ అనుమానం రాకుండా మారువేషాల్లో సంచరించగలిగేవాడు.

గుడి ముందే తను కొట్టు కాబట్టి. గుడిని మూసే వేళలూ తెరిచే వేళలూ అన్నీ తెలుసు కాబట్టి. ఎవ్వరికీ అనుమానం రాని విధంగా....ఆ దోపిడీని ప్లాన్ చేసాడు.

కాని....అతనికంటే అద్భుతమైన తెలివితేటలతో.... ఒక వ్యూహాన్ని పన్ని అతడిని పట్టుకోగలిగాడు కాంతిభూషణ్.

—: అయిపోయింది :—

# మహా పతివ్రత

## వసుంధర

రాత్రి తొమ్మిదయింది.

అశోకా పార్కులో జనంలేరు—ఒక్క జగదాంబ తప్ప!

ఒంటరిగా పార్కులో కూర్చుని వున్న ఆమె ముఖంలో భయంలేదు, బెదురులేదు. ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లుగా కూర్చుందామె.

ఆమె అందంగా వుంది. వయసు బింకంలో వుంది.

సరిగ్గా అప్పుడు పార్కులో ప్రవేశించాడో వ్యక్తి.

అతడు నల్లగా లేడు కానీ తెల్లగానూ లేడు.

గళ్ళ లుంగీ, గుబురు మీసాలతో అతడొక గూండా లాగున్నాడు.

జగదాంబ ఎక్కడుంటుందో తెలిసినవాడిలా అతడామెవైపే వెళుతున్నాడు. అతడికామెను సమీపించడానికెంతోసేపు పట్టలేదు.

ఆలోచనలో వున్న జగదాంబ అడుగుల చప్పుడు

ఉలిక్కిపడి తలెత్తి చూసింది. గూండావంటి వ్యక్తిని చూసి ఆశ్చర్యపడి—"ఎవరున్నువ్వు?" అంది.

"మొగాణ్ణి!" అన్నాడతడు.

అతడి గొంతు బొంగురుగా వుంది. అయితే కావాలని గొంతు మార్చినట్లు తెలిసిపోతోంది.

జగదాంబ అతడివైపునుంచి దృష్టిమరల్చుకుని మరెటో చూడసాగింది.

"నువ్విక్కడెందుకున్నావు?" అన్నాడతడు.

ఆమె మాట్లాడలేదు.

"నాకోసం ఎదురుచూస్తున్నావా?"

"నా భర్తకోసం ఎదురుచూస్తున్నాను!"

"భర్తకోసం—ఈ సమయంలో—ఇక్కడా...." అని నవ్వి—"ఏం—నీకిల్లు లేదా?" అన్నాడతడు.

"ఇల్లుంది, కానీ నా భర్త నాతో యిక్కడేదో మాట్లాడాలన్నాడు—"

అతడు నవ్వి—"నీలాంటివాళ్ళిక్కడ ఎందుకొస్తుంటారో నాకు తెలుసు. నిన్న అనసూయ కూడా యిలాగే అంది—" అన్నాడు.

"అనసూయెవరు?" అందామె.

"నిన్నటిదాకా ఆదెవరో నాకూ తెలియదు. రాత్రి ఈ సమయానికి వచ్చి ఇక్కడ కాసేపు పడుకోవడం నా అలవాటు. అలాగే వచ్చేసరికి నా స్థలంలో అనసూయ వుంది. యాభై రూపాయలిచ్చాను. చిల్లర లేదంది. అయితే రేపు మళ్ళీ రా అన్నాను. ఇద్దరం కలిసేపడుకున్నాం. రేపు తనకు రావడం వీలుకాకపోతే మరెవరినైనా పంపుతానంది వెళ్ళిపోయేటప్పుడది. ఇప్పుడు నేను వచ్చేసరికి నువ్వున్నావు. ఎవరైనా ఒకటే నాకు. నువ్వు అనసూయ

కంటే బాగున్నావు...."

జగదాంబ అతడివంక కోపంగా చూసి-"గెటౌట్"-అంది.

"నీ కోపం చూస్తే నిజం కోపంలాగే వుంది. కొంప దీసి అనసూయ నీ డబ్బు నీకివ్వలేదా? పోనీలే—నీకు మళ్ళీ డబ్బిస్తాను. ఎందుకైనా మంచిదని ఈ రోజు చిల్లర—అంటే అన్నీ అయిదు రూపాయలనోట్లు తీసుకొచ్చాను—" అన్నాడతడు.

"గెటౌట్—" అంది జగదాంబ మళ్ళీ.

"ఓహ్—అనసూయకు ఎక్కువిచ్చి నీకు తక్కువిస్తానని కోపమా? పోనీలే నీకూ అంతే యిస్తాను. సరేనా?" అంటూ అతడామెకు మరింత దగ్గరగా వెళ్ళాడు.

"అడుగు ముందుకు వెయ్యకు. దవడ పగుల్తుంది—" అంది జగదాంబ.

"సరే—నువ్వనసూయకంటె ఎక్కువ అందంగా వున్నావు. నిన్ను దాంతో సమానం చేయను. ఇంకాస్త ఎక్కువిస్తాను. డబ్బైఅయిదు....సరేనా?"

జగదాంబ లేచి నిలబడి—"నువ్వు మనిషివా, పశువ్వా? పెళ్ళైన ఆడదాన్ని తల్లిలా, చెల్లిలా చూడాలని తెలియదూ?" అంది.

"నీకు పెళ్ళయిందో లేదో నాకెలా తెలుస్తుంది?"

ఆమె తన మంగళసూత్రాలు చూపించింది.

"నాకు తెలిసిన కంపెనీ ఆడాళ్ళందరూ రెయిడింగు సమయాల్లో ఇవే చూపిస్తారు. నువ్వు పెళ్ళయినదానివే అయితే ఈ సమయంలో ఇక్కడ ఒంటరిగా కూర్చోవు."

"ఏదేమైనా నీతో నాకు వాదన అనవసరం. నేన లాంటిదాన్ని కాదు. పొమ్మని చెబుతున్నాను. ఫో!"

అంది జగదాంబ.

"చూడు పాతికలో మొదలెట్టి దశ్శైయిదుదాకా చేసేసరికి నీకు డబ్బాశ పెరిగిపోయినట్లుంది. ఇకమీదట ఒక్క పైసా పెంచను. మర్యాదగా ఒప్పుకోకపోతే అసలు డబ్బే యివ్వను. ఇక్కణ్నించి పోను—" అన్నాడతడు.

"అయితే నేనే పోతాను—" అంటూ అక్కణ్నించి కదిలింది జగదాంబ.

"నువ్వు పోతానంటే నిన్ను పోనిస్తానా?" అంటూ అతడామెను చేతో పట్టుకుని ఆపాడు.

"నేను మహా పతివ్రతను. నన్ను తాకితే భస్మమై పోతావు—" అందామె.

"భస్మం కావడానికి నాకభ్యంతరంలేదు. ఆద్యంతం వరకూ నా ప్రయత్నంలో నేనుంటాను—" అన్నాడతడు.

"భగవంతుడా! ఒక మహా పతివ్రతకు మాన సంరక్షణ చేయలేవా?" అంటూ దేవుణ్ని ప్రార్థించుకుంది జగదాంబ.

అతడామెను కదలకుండా ఒడిసి పట్టుకున్నాడు.

## 2

"చెత్త సినిమా!" అన్నాడు శాస్త్రి.

"సినిమాను తిట్టొద్దు—" అన్నాడు శర్మ.

"ఎందుకట?"

"అది కిరణ్మయి నవల ఆధారంగా వచ్చింది—"

"అయితే?"

"కిరణ్మయి అంటే నాకెంతో యిష్టం!"

శాస్త్రి నవ్వి—"కిరణ్మయి మగాడని నీకు తెలుసా?"

అన్నాడు.

"కిరణ్మయి మగరేలా అవుతుంది?"

"ఓ మగాడు తన కలం పేరు కిరణ్మయి అని పెట్టుకున్నాడు."

"కానీ—నాకు తెలిసిన కిరణ్మయి ఆడదే మరి!"

"ఓహో—మన ఎదురింటి కిరణ్మయి గురించా నువ్వు మాట్లాడుతున్నది! ఆ అమ్మాయి రచయిత్రికాదు—"

"అవని — కాకపోనీ — నువ్వీ సినిమాను తిడితే కిరణ్మయిని తిట్టినట్లే అనిపిస్తుంది నాకు—" అన్నాడు శర్మ.

"పోనీ—డైరెక్టర్ని తిడదాం—"

"వద్దు కిరణ్మయి నవలను యే డైరెక్టరూ పాడు చేయలేదు...."

"అయితే ప్రాడ్యూసర్ని తిట్టనా?"

"కిరణ్మయి నవలను సినిమాతీయాలనుకోగానే ఆ ప్రొడ్యూసరుకే పాపాలున్నా అవి పోయాయి. అతణ్ని తిట్టవద్దు—"

"మరెవర్ని తిట్టను?"

"అసలెవర్నైనా యెందుకు తిట్టాలిట?" అన్నాడు శర్మ.

"కసి...." అని—"పోనీ—నిన్ను తిడతాను...." అన్నాడు.

"నన్నెందుకూ తిట్టడం—ఈ సినిమాకు నేనేం వస్తానన లేదు. నువ్వే బలవంతిపెట్టావు—" అన్నాడు శర్మ.

"అవునూ-ఈ సినిమా చూస్తే నీకు కోపంరాలేదా?"

"కోపం రావడానికి సినిమా చూసేగదా!"

"సినిమా చూడకుంటా ఏం చేశావు?"

"చిన్న బ్యాటరీ లైటు సాయంతో పెర్రీమాసన్ నవల చదివాను—"

"హాల్లో నువ్వు నవల చదివేవా? నేను గమనించ లేదే!"

"ఎక్కడ గమనిస్తావు? ఎంత తిట్టినా నువ్వు సిని మాలో ఐక్యమైపోయావు. మధ్య మధ్య నవలలో రస వత్తర ఘట్టాలు వస్తే నీతో పంచుకోవాలనుకున్నాను. కానీ నువ్వు అమిత శ్రద్ధగా సినిమా చూస్తున్నావు-"

"అవును — నేను సినిమాలు శ్రద్ధగా చూస్తాను. అందుకే ఇప్పుడింత కోపంగా వుంది—" అని "నువ్వు సినిమాకొచ్చేటపుడే కూడా పెన్ టార్చి తెచ్చుకున్నా వంటే సినిమాచూసే ఉద్దేశ్యం లేదన్నమాట. అసలు కాస్త కూడా చూడలేదా నువ్వు....?"

"లేదు—"

"ఎందుకని?"

"కిరణ్మయిని తిట్టడం ఇష్టంలేక!"

"శర్మా! నువ్వు నాకంటే వెయ్యిరెట్లు తెలివైన వాడివి. ఇకనించి నేనుకూడా సినిమాకు వెళ్ళే టప్పుడు పుస్తకం, పెన్ టార్చి తెచ్చుకుంటాను...." అన్నాడు శాస్త్రి.

"ఇద్దరిలో ఒకరు సినిమా చూడాలనుకుంటే కంపెనీ కోసం తప్పదు కానీ—ఇద్దరికీ అక్కర్లేదనుకుంటే— చదువుకుందుకు సినిమాహాలెందుకు? ఇంట్లోనే చదువుకో వచ్చుగా!" అన్నాడు శర్మ.

"అవునవును. ఈ రోజు నా బుర్రెందుకో సరిగ్గా పనిచేయడంలేదు. అందుక్కారణం ఆ వెధవ సినిమాయే!"

"సినిమానేమీ అనొద్దు—" అన్నాడు శర్మ గంభీ

రంగా.

"పోనీ నన్ను కసికసి తిట్టుకుంటూనే ... నేనొక చవటని ఫూల్ ని _ ఇడియట్ ని...." అని ఇంకా ఏవేవో అన బోతుండగా.

"ఇలా బాగుండదు ఇంకా ఎంత సేపు తిట్టుకుంటావు?" అన్నాడు శర్మ.

"చాలా సేపు తిట్టుకుంటాను...."

"రూంకెళ్ళే దాకా ఆగలేవా?"

"ఆగలేను...."

"అయితే పద .... ఈ పార్కులో కూర్చుందాం. నువ్వు తిట్టుకుంటూండు. నేను నవలను చదువుకుంటాను...."

"బాగుంది నీ అయిడియా! ఈమాత్రం నాకు తట్టలేదు. నేను ఫూల్ ని .... ఇడియట్ ని .... రాస్కెల్ని ...."

ఇద్దరూ పార్కు గేటు సమీపించారు.

అక్కడో మనిషి వారిద్దర్నీ ఆపాడు.

"లోపలకు వెళ్ళడానికి వీల్లేదు సార్!"

"ఇది పబ్లిక్ పార్కు .." అన్నాడు శర్మ.

"అవునండి. కానీ రాత్రి తొమ్మిది దాటేక కాదండి...."

శాస్త్రి టైము చూసుకుని వాచీ వెనక్కి తిప్పి—

"నా టైము ఎనిమిదిన్నరయింది—" అన్నాడు.

"మీ టైముతో నాకు నిమిత్తంలేదు సార్! నా టైము ప్రకారం నేను డ్యూటీ చేస్తాను...."

"పబ్లిక్ పార్కులో టైముకి విలువ లేకుండా పోయిందా?"

"టైముకి విలువిచ్చేవాళ్ళు పబ్లిక్ పార్కుల్లోకి రారు

సార్ !"

శాస్త్రి దెబ్బ తిని—"ఓరా ఎంతమాటన్నావ్? ఈ రోజు నా బుర్ర పనిచేయడంలేదు. నేను ఫూల్ని, ఇడియట్ ని, స్కౌండ్రల్ని ...." అని శర్మ కాలు నొక్కడంతో ఆగిపోయాడు.

"సార్—మీరు నన్ను తిట్టారా? మిమ్మల్ని తిట్టుకున్నారా?" అవమానంగా అడిగాడా గేటు దగ్గరి వ్యక్తి.

"నిన్నూ తిట్టాలనే వుంది. తిడితే ఊరుకుంటావా?" అన్నాడు శాస్త్రి.

"ఊరుకోను సార్! నాకు కరాటేలో ట్రయినింగుంది—"

శర్మ గంభీరంగా—"అవన్నీ ఎందుకు? పబ్లిక్ పార్కు దగ్గర నువ్వింత పకడ్బందీగా డ్యూటీ చేస్తున్నావంటే ఇందులో ఏదో తిరకాసుంది. లోపల ఎవరో వున్నారని నా అనుమానం. ఓసారి లోపలకు వెళ్ళి చూడాల్సిందే" అన్నాడు.

"అరే—ఈ పాయింటు నాకు తట్టనేలేదు. నేను...."

శర్మ శాస్త్రి కాలు మరోసారి నొక్కాడు.

"ప్లీజ్ సార్ !"

"చూడు. ఇది పబ్లిక్ పార్కు. ఇది సక్రమంగా ఉపయోగించబడుతోందా లేదా అన్నది తెలుసుకోవడం పబ్లిక్ డ్యూటీ. మేము లోపలకు వెళ్ళి చూడాల్సిందే."

"అయితే నన్ను కాదని లోపలకు వెడతారా?" అంటూ అడ్డంగా నిలబడ్డాడు కాపలా అతడు.

"అడ్డు తప్పుకోవడానికే మంచిది. ఎందుకంటే—నీ సంగతి నాకు తెలియదు కానీ నాకు నిజంగానే కరాటే

వచ్చు—" అంటూ శర్మ కరాటే ఫోజు పెట్టేలోగా కాపలావాడు అతడి కాళ్ళమీదపడి—"నిజంగా కరాటే వచ్చిన వాళ్ళంటే నాకు భయం సార్! నన్నేమీ చేయకండి సార్! లోపల ఓ జంట వున్నారు సార్....నాకు పదిరూపాయలు ముట్టాయి సార్....మీరు లోపలకు వెళ్ళకండి సార్!" అన్నాడు.

"నీ పదిరూపాయలకూ డోకాలేదు. మమ్మల్నాపకు" అంటూ శర్మ ముందడుగు వేశాడు. శాస్త్రి అతడినను సరిస్తూ—"నేను ఫూల్ని....ఇడియట్ను...." అనుకుంటున్నాడు.

అంతలోనే—"రక్షించండి...." అన్న గొంతు వినిపించింది.

మిత్రులిద్దరూ వెంటనే అటువైపు పరుగెత్తారు.

అక్కడ....

ఓ యువతి....

ఆమె వంటిమీద చీర లేదు. లంగా, రవిక వున్నాయి.

ఆమె రెండు చేతులూ బలంగా పట్టుకున్నాడో గూండా....

"ఒరేయ్...." అన్నాడు శర్మ.

గూండా దూరంగా వున్న మిత్రులిద్దర్నీ చూసి జగదాంబను వదిలిపెట్టి పరుగులంకించుకున్నాడు.

"నేను వాణ్ని తరుముతాను....నువ్వా అమ్మాయి సంగతి చూడు...." అంటూ శర్మ గూండా వెంట పడ్డాడు.

శాస్త్రి ఆమెను సమీపించాడు.

జగదాంబ నిలువెల్లా వణికిపోతోంది. శాస్త్ర పక్కగా పడివున్న చీరనుతీసి శాస్త్రి ఆమె కందించాడు.

జగదాంబ పాదల వెనక్కి వెళ్ళి చీర కట్టుకొని వచ్చింది.

"నీకేం భయంలేదు. ఏం జరిగిందో చెప్పు—...." అన్నాడు శాస్త్రి.

"నాకు భయమెప్పుడూ లేదు. నన్ను భగవంతుడే రక్షిస్తాడు. నేను మహా పతివ్రతను—...." అంది జగదాంబ.

శాస్త్రి ఆశ్చర్యంగా—"పతివ్రత విషయం తెలియదు కానీ నువ్వు మహా ధైర్యవంతురాలివి—" అన్నాడు.

"నా పాతివ్రత్యమే నా ధైర్యం—" అందామె.

"అసలేం జరిగింది" అడిగాడు శాస్త్రి.

"ఈ రోజు రాత్రి తొమ్మిది గంటలకు నన్నిక్కడ కలుసుకుంటానని నా భర్త నాకు ఆఫీసునుంచి కబురెట్టాడు. వచ్చి కూర్చుంటే గూండా వచ్చాడు. దేవుణ్ని ప్రార్థించాను. ఆ దేవుడు నిన్ను, నీ స్నేహితుణ్ని పంపాడు...." అంది జగదాంబ.

"దేవుణ్ని నమ్ముకుని మరోసారి నువ్విలాంటి చోట్లకు రాకు. ప్రమాదం...." అన్నాడు శాస్త్రి.

"నా అంతట నేనెప్పుడూ యిలా రాను. కానీ నా భర్త రమ్మంటే మాత్రం రాకతప్పదు. ఆయన అగ్నిలో దూకమన్నా కాదనలేను...." అంది జగదాంబ.

ఆమె అమాయకురాలో, అతి తెలివిగా మాట్లాడుతోందో శాస్త్రికి తెలియలేదు. అతడామెను దగ్గరుండి ఇంటికద్ద దిగవిడిచి గదికి వెళ్ళాడు. అప్పటికక్కడ శర్మ ఉన్నాడు.

"గూండాను పోలీసుల కప్పగించేవా?" అన్నాడు శాస్త్రి.

"లేదు. వాడు నిజంగా గూండా కాదు. మనిషిని పట్టి కుదిపితే ముందు మీసాలు వచ్చాయి—...."
అన్నాడు శర్మ.

"అయితే ఎవడో దొంగ వెధవై వుండాలి. పోలీసుల కప్పగించాల్సింది...." అన్నాడు శాస్త్రి.

"అసలు సంగతి చెబుతాను విను." అన్నాడు శర్మ.

అతడామె ప్రియుడు. పెళ్ళికి ముందే జగదాంబ అతణ్ని ప్రేమించింది. పెద్దలు వాళ్ళ పెళ్ళికి అంగీకరించ లేదు. జగదాంబను మనసునిండా నింపుకున్న ఆ యువకుడు వేరే వివాహం చేసుకోలేదు. పెళ్ళయిన జగదాంబ అతడిని మరిచిపోలేకపోయింది. వీలున్నప్పుడల్లా ఇద్దరూ రహస్యంగా కలుసుకుంటున్నారు. ఇప్పుడూ జగదాంబ కోరికమీదనే అతడక్కడకు వచ్చాడు. ఆమె అతడి నుంచి సినిమాల్లో "రేప్ సీను" అనుభవం కోరింది. అతడు సరేనని పార్కు కాపలావాడికి డబ్బిచ్చి అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. ఈ రాత్రి ఆమె భర్తక్కూడా యేదో పార్టీలో ఎంగేజ్ మెంటుంది. అందుకని వాళ్ళిద్దరికీ అన్నీ కలిసొచ్చాయి. అయినా దురదృష్టంకొద్దీ శాస్త్రి, శర్మ తారసపడ్డారు.

"వాడు నిజమే చెప్పాడంటావా?"

"చెప్పే వుండాలి. లేకుంటే ఓ సంసార స్త్రీ ఆ సమయంలో పార్కులో ఎందుకుంటుంది?" అన్నాడు శర్మ.

"అవును. నాకామె అన్నీ అబద్ధాలు చెప్పింది. నేను నిజంగానే ఆమె పతివ్రతని నమ్మాను. నేను చవటని, ఫూల్ ని, ఇడియట్ ని...."

"మైడియర్ ఫ్రెండ్! రేపుదయం మనిద్దరం మరో

సారి ఆమె యింటికి వెడదాం. అబద్ధం చెప్పిందనుకో తేల్చుకుందాం. నిజంగానే ఆమె భర్త పార్కుకి రమ్మని వుంటే ఊరంతా వెతికి ఆ గూండాని పట్టుకుందాం. అబద్ధం చెప్పింది ఆమే అయితే—మళ్ళీ మళ్ళీ తప్పులు చేయకుండా ఆమెను హెచ్చరిద్దాం. ప్రస్తుతానికి నేను పడుకుంటాను. నా గుర్రు వినిపించేదాకా ఆగి అప్పుడు నన్ను నీ యిష్టం వచ్చినట్టు తిట్టుకో...." అంటూ మేను వాల్చాడు శర్మ.

కానీ శర్మకు ఓ పట్టాన నిద్ర రాలేదు. శాస్త్రి ఎంత సేపు నిద్రపోకుండా వుండి తన్ను తాను తిట్టుకుంటాడోనని అతడు యెదురుచూశాడు.

అప్పుడతడికి శాస్త్రి గుర్రు వినిపించింది.

## 3

ఉదయం లేచి ముఖాలు కడుక్కుని స్నానాలు చేసి వీధిలోకి వచ్చేక—"ముందేదైనా హోటలుకు వెడదాం" అన్నాడు శర్మ.

"ఛ ఛ—కోడా హోటలు తిండేనా?" అన్నాడు శాస్త్రి.

"హోటలు తిండి కాకపోతే మన ఆకలి తీరడానికి వేరే మార్గమేముంది?"

"పతివ్రత ఇంటికి వెడుతున్నాంగా!" అన్నాడు శాస్త్రి.

"అయితే?"

"పతివ్రతల వంటలు బాగుంటాయి—"

"అంటే ఆమె మనకు టిఫిన్ పెడుతుందంటావా?" అన్నాడు శర్మ.

"ఆమె నిజంగా పతివ్రతే అయితే — మనం తన్ను

రక్షించినందుకు కృతజ్ఞతతో మనకు కడుపారా విందు భోజనం పెడుతుంది—" అన్నాడు శాస్త్రి.

"అవునూ—ఆమెను నువ్వింటి దగ్గర దిగబెట్టావుకదా నిన్న మర్నాడు రమ్మనిగానీ చెప్పిందా ఆమె!" అన్నాడు శర్మ అనుమానంగా.

"ఇలాంటి అనుమానాలు మొహమాటాన్ని పెంచుతాయి. మాట్లాడకుండా నాతో పద—" అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ జగదాంబ ఇంటికి వెళ్ళారు. ఇంటిముందు నేమ్ ప్లేటుంది. పి. లక్ష్మీనరసయ్య, ఇన్ కాంటాక్స్ కన్సల్టెంట్ అని రాసి వుంది.

"గురుడు బాగా సంపాదిస్తూండి వుండాలి—" అన్నాడు శర్మ.

"అందుకే అతడి భార్య పతివ్రత...." అని తలుపు తట్టాడు శాస్త్రి.

క్షణాలమీద తలుపు తెరుచుకుంది.

తలుపు తీసింది జగదాంబ.

ఆమె అప్పుడే స్నానం చేసినట్టుంది. నుదుట రూపాయి కాసంత బొట్టు. విరబోసిన జుట్టు.

"నమస్తే—గుర్తున్నానా!" అన్నాడు శాస్త్రి.

"అయ్యో—దేవుడు పంపిన మనుషులు మీరు.... మీరుకాక ఇంకెవరు గుర్తుంటారు?" అంది జగదాంబ.

"రాత్రి మేము దేవుడు పంపిన మనుషులం. ఇప్పుడు దేవుడు పంపిన అతిథులం....లోపలకు రావచ్చా?" అన్నాడు శాస్త్రి.

"రండి....రండి...." అంటూ వారిని లోపలకాహ్వానించింది జగదాంబ.

అంతా లోపల కుర్చీల్లో కూర్చున్నారు.

"భార్యను రాత్రిళ్ళు పొద్దుపోక రమ్మనే ఆచారం మంచిది కాదు. మీవారిని స్వయంగా హెచ్చరించాలని వచ్చాను. ఎందుకంటే నామిత్రుడు గూండాని వెంటా డాడు కదా—వాడు పారిపోతూ తను మరో ప్రయత్నం చేసి నెగ్గుతానని దంబాలు పలికాడట...."

జగదాంబ భయపడలేదు కానీ—"మీరు స్వయంగా హెచ్చరించడం మంచిదే—రాత్రి వారిని హెచ్చరించా లనుకున్నాను. కానీ రాత్రి చాలా ఆలస్యంగా వచ్చారు. వచ్చీరాగానే పడుకున్నారు—" అంది.

"మీరు పెద్దగా భయపడుతున్నట్లులేదు-" అన్నాడు శాస్త్రి.

"నాకు పెద్దలు పెట్టిన పేరు జగదాంబ—" అని నవ్వి లోపలకు వెళ్ళిందామె.

శాస్త్రి శర్మ ముఖముఖాలు చూసుకున్నారు.

కాసేపట్లో ఆమె ఇద్దరికీ ప్లేట్లలో పెసరట్, ఉప్మా తెచ్చిచ్చింది.

"వారింకా నిద్రలేవలేదు—" అందామె.

మిత్రులిద్దరూ తృప్తిగా టిఫిన్ తిన్నారు అప్పుడామె వారికోసం స్టీరియోలో త్యాగరాజకృతులు కాసెట్టే పెట్టింది.

వారవి వింటూండగా ఆమె భర్త వచ్చాడు.

అతణ్ని చూసి శర్మ ఉలిక్కిపడ్డాడు. రాత్రి తను చూసిన గూండా అతడే!

లక్ష్మీనరసయ్య శర్మను చూసి తనూ ఉలిక్కిపడ్డాడు.

జగదాంబ భర్తకు మిత్రులకు పరిచయం చేసి అందరికీ కాఫీలు తెచ్చిచ్చింది.

"మీరు టిఫిన్ తీసుకోరా?" అన్నాడు శాస్త్రి.

"నేను లోపల తీసుకున్నాను. నలుగురి ఎదుటా తాగటమే కానీ తినడం నావల్లకాదు. మొహమాటంగా వుంటుంది—" అన్నాడు లక్ష్మీనరసయ్య.

శాస్త్రి, శర్మ ఒకరివంక ఒకరు ఇబ్బందిగా చూసు కున్నారు.

"మీ రెవరో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు లక్ష్మీనరసయ్య.

శాస్త్రి జగదాంబ వంక చూశాడు. ఆమె వెంటనే-

"నేను మీ గురించి మావారికేమీ చెప్పలేదు. మీరు వారితో ఏం చెప్పాలనుకుంటున్నారో చెప్పండి" అంది.

శర్మ తను లేచి నిలబడి—"లక్ష్మీనరసయ్యగారూ! నేను మీతో ఒక్కనిముషం ప్రైవేట్‌గా మాట్లాడాలి" అన్నాడు.

ఇద్దరూ పక్కగదిలోకి వెళ్ళారు.

"నిన్న నువ్వు నాకబద్ధం చెప్పావు. ఆమె భర్తనన్న నిజం అప్పుడే యెందుకు చెప్పలేదు—" అన్నాడు శర్మ కోపంగా.

లక్ష్మీనరసయ్య తడబడుతూ — "అందుకు రెండు కారణాలున్నాయి" అన్నాడు.

అతడికి తన భార్యను రేప్ చేయాలన్న కోరిక వుంది. తానెవరో భార్యకు తెలిసిపోతే ఆ కోరిక తీరదు. తర్వాత భార్యను రేప్ చేయాలన్న కోరిక ఇతరులకు చెప్పడం కూడా హాస్యాస్పదంగా వుంటుంది.

"నువ్వు నిజమే చెబుతున్నావా?"

"ఊఁ"

"అంటే ఆమెను రాత్రి తొమ్మిది గంటలకు పార్కు కు

రమ్మన్నావన్నమాట! మేమూ ఆమె మాటలు నిజమని నమ్మలేను. నీ అందం కారణంగా జగదాంబవంటి శీలవతిని శంకించాను. ఇంకెప్పుడూ ఇలాంటబద్ధాలు చెప్పకు...." అని— "అయినా హాయిగా పెళ్ళయినా ఇంకా ఈ వెధవ బుద్ధులేమిటి నీకు?" అన్నాడు శర్మ.

"ఒక్కొక్కరికి ఒకో రకం సరదా వుంటుంది. నాకిది సరదా. ఈవిధంగా నేను తప్పుచేసినట్లూ అవుతుంది. అందులో తప్పూ వుండదు-" అన్నాడు లక్ష్మీనరసయ్య.

"సరేకానీ— నీ సరదాలు పబ్లిక్ పార్కుల్లో తీర్చుకోకు. మావంటివాళ్ళ సమయం వృథా అవుతుంది—" అన్నాడు శర్మ.

ఇద్దరూ మళ్ళీ శాస్త్రి, జగదాంబల దగ్గరకు వచ్చారు.

"ఇంకెప్పుడూ నిన్ను కాని సమయాల్లో పార్కులకు రమ్మనను. అయాం సారీ—" అన్నాడు లక్ష్మీనరసయ్య భార్యతో.

"ఛీ—మీరు నాకు సారీ చెప్పడమేమిటి?" అంది జగదాంబ.

శాస్త్రి, శర్మ ఆ యింట్లోంచి బయటపడ్డారు కానీ ఆ యింటిని తమ దృష్టిలోనే వుంచుకున్నారు. లక్ష్మీనరసయ్య ఇల్లు వదిలి వెళ్ళేంతవరకూ వాళ్ళా చుట్టుపక్కలే వున్నారు. తర్వాత మరోసారి ఆ యింటితలుపు తట్టారు.

"మీరా?" అంది జగదాంబ తలుపుతీసి ఆశ్చర్యంగా.

"మీకో ముఖ్య విశేషం చెప్పాలి—" అన్నాడు శాస్త్రి.

"లోపలకు రండి—" అందామె.

ముగ్గురూ లోపల కూర్చున్నారు.

"నిన్న గూండా వేషంలో వచ్చినది నీ భర్త...."

అన్నాడు శర్మ.

జగదాంబ ఆశ్చర్యంగా—"మీకెలా తెలుసు?" అంది.

"గూండానూ చూశాను. నీ భర్తనూ చూశాను. ఇద్దరూ ఒక్కరే!"

"గూండాను నేనూ చూశాను. నా భర్తతో కాపురం చేస్తున్న నేనే గుర్తుపట్టలేనిది మీరెలా గుర్తుపట్టారు?" అంది జగదాంబ చిరాగ్గా.

"నిజం. నీ భర్తే ఒప్పుకున్నాడు...." అంటూ శర్మ విషయం చెప్పాడు.

జగదాంబ చెవులు మూసుకొని—"అంతా అబద్ధం! నా భర్తను నేను గుర్తుపట్టలేనా?" అంది.

"పాతివ్రత్య ప్రభావంతో నీ భర్త మారువేషాన్ని తెలుసుకోలేవు. అందుకు మాబోటి గూఢచారి కళ్ళుండాలి—" అన్నాడు శాస్త్రి.

జగదాంబ ముఖం గంభీరంగా అయిపోయింది—"మీరు నా పాతివ్రత్య ప్రభావాన్ని శంకిస్తున్నారు—" అంది.

"లేదు. నీ భర్త వ్యవహారంలో యేవో తిరకాసుంది. అతడు నిన్న గూండా వేషంలో రావడానికేదో కారణముంది. అదేమిటో తెలుసుకో...." అన్నాడు శాస్త్రి.

"ఒక విధంగా మీరు నాకుపకారమే చేశారు. మీ కారణంగానే నాకు నా భర్త మనసులోని కోరిక తెలిసింది. ఈ రోజు పార్కుకు మళ్ళీ వెడతాను—" అంది జగదాంబ.

"నీకు నిజం తెలిసాక పార్కుకు వెళ్ళి ఏం లాభం?"

"నిజం తెలిసినట్లు వారికి తెలియనివ్వను. నిన్న

పార్కుకి రమ్మన్నారుగదా—తను నన్నక్కడ కలుసుకో లేకపోయారు. ఈ రోజు వస్తానని చెబుతాను...."

"మీ వారివల్ల నీకు ప్రమాదముంది...."

"వుంటే వుందికానీ—ఈ రోజు మీరు పార్కు దరి దాపులక్కూడా రాకండి. లేకుంటే మీమీద నేను పోలీసు రిపోర్టిస్తాను...."

"బాగుంది—పుణ్యానికి పోతే పాపమెదురయిందం టారు. ఇదే కాబోలు—" అన్నాడు శర్మ కోపంగా.

"పుణ్యమెక్కడ? మీ కారణంగా నిన్న నా భర్త ఆశయం నెరవేరలేదు...." అంది జగదాంబ. ఆమె ముఖం చూస్తుంటే నిన్న జరిగినదానికామె నొచ్చు కున్నట్లు కనబడింది.

శాస్త్రి నిట్టూర్చి-"పద శర్మా! పోదాం!" అన్నాడు.

## 4

రాత్రి తొమ్మిదయింది.

అశోకా పార్కులో యథాస్థానంలో కూర్చుని వుంది జగదాంబ.

అక్కడ తానొక్కతె మాత్రమే వున్నదని భావి స్తోందామె. కానీ శాస్త్రి, శర్మ పొదల్లో దాగుని తననే కనబడుతున్నారని ఆమెకు తెలియదు.

అప్పుడే పార్కులో ఓ వ్యక్తి ప్రవేశించాడు.

అతడు లావుగా, ఎత్తుగా వున్నాడు.

నున్నగా గీసిన గుండు. ముఖానికి మీసాలు లేవు.

గళ్ళలుంగీ—అడ్డచారల బనియన్.

అతణ్ని చూడగానే గూండా అని తెలిసిపోతుంది.

ఆ గూండా జగదాంబని సమీపించాడు. అతణ్ని చూస్తూనే జగదాంబ లేచి నిలబడింది.

"ఎవరున్నవ్?" అందామె.

"నీకోసం వచ్చాను—" అన్నాడతడు.

"నాతో నీకేం పని!" అందామె.

అతడామె చేయిపట్టుకున్నాడు. ఆమె విడిలించుకోకుండా—"వదులు—" అంది.

గూండా ఆమెను వదలకుండా దగ్గరగా హత్తుకుని వళ్ళంతా నిమురుతున్నాడు.

జగదాంబ ప్రతిఘటించడంలేదు.

శాస్త్రికీ, శర్మకూ ఏం చేయాలో తెలియడంలేదు.

కొంపదీసి ఆ గూండా జగదాంబకు ప్రియుడుకాదు కదా!

కథలో ఎక్కడో ఏదో తిరకాసుంది.

జగదాంబ, ఆమె భర్త—ఇద్దరిలో యెవరో నాటకమాడుతున్నారు.

శాస్త్రి ఆలోచిస్తున్నాడు.

జగదాంబ తెలివైనది. ప్రస్తుతం ఆమె భర్త ఊళ్ళోలేదు. ఆమెకు చాలామందితో సంబంధముండి వుండాలి. రోజుకొకరి చొప్పున అశోకా పార్కులో కలుసుకుంటోంది. నిన్న తమ మూలంగా రసాభాస అయింది. ఈ రోజు తాము—ఆమె యింటికి రాగలమని ఊహించి నిన్నటి గూండానే తన భర్తగా ఇంట్లో వుంచింది. తమను మళ్ళీ పార్కుకి గానవద్దని వారించి ఈరోజు మరో వ్యక్తినిక్కడ కలుసుకుంటోంది.

తన అనుమానాన్ని శర్మకు చెప్పాడు శాస్త్రి.

శర్మ వెంటనే—"నీ కథలో లోపాలున్నాయి—" అన్నాడు.

లక్ష్మీనరసయ్యను పట్టపగలు ఇంట్లో ఉంచుకోగల

జగదాంబ తన ప్రియులను రహస్యంగా పార్కులో కలుసుకోవడ మెందుకు?

మిత్రులిద్దరూ గుసగుసలాడుకుంటున్నారు.

అవతల గూండా ఎడ్వాన్సవుతున్నాడు.

"ఏదియేమైనా ఇందులో మనం కలుగజేసుకోవాలి" అన్నాడు శాస్త్రి.

అంతే — ఇద్దరూ పొదల చాటునుంచి బయటకు వచ్చారు.

"ఒరేయ్—" అన్నాడు శర్మ.

గూండా వెనక్కు తిరిగాడు.

జగదాంబ చటుక్కున గూండాను విడిపించుకుంది.

"ఎవర్నువ్వు?" అన్నాడు గూండా.

"ముందు నువ్వెవరో చెప్పు—...." అన్నాడు శర్మ.

జగదాంబ తన బట్టలు సరిచేసుకుంటూ—"భార్యాభర్తల వ్యవహారంలో మిమ్మల్ని జోక్యం చేసుకోవద్దన్నానా?" అంది.

"నిజమే—కానీ ఇక్కడ భార్య వుంది. భర్త లేడుగా!" అన్నాడు శాస్త్రి.

"ఇతడే నా భర్త!" అంది జగదాంబ.

ఈలోగా గూండా ఉద్రేకంగా శర్మమీదకు వెళ్ళి అతడి దెబ్బకు బోర్లగిలబడి లేవలేక అవస్థపడుతున్నాడు.

"ఒక్కసారి నీవంటి వాళ్ళు పదిమందికి సమాధానం చెప్పగలను. నీ వేషాలు నా దగ్గర సాగవు. నువ్వెవరో చెప్పు ముందు...." అన్నాడు శర్మ.

"ఇతడా—నీ భర్త?" శాస్త్రి జగదాంబను అడిగాడు.

"నా భర్త మారువేషంలో వచ్చాడని మీరు చెప్పారు. ఈ వేళకూడా అలాగే జరిగిందని అను

కున్నాను....” అంది జగదాంబ.

“మారువేషం వేస్తే మాత్రం నీ భర్తను గుర్తుపట్ట లేవా?”

“ఏమో—నిన్న నాకు గుర్తు తెలియలేదు. అందుకని ఈ వేళకూడా మారువేషమే అయియుంటుందనుకున్నాను” అంది జగదాంబ.

ఆమె సన్నగా వణుకుతున్నట్లు శాస్త్రి గమనించాడు. ఆమె ముఖంలోని అమాయకత్వాన్నికూడా అతడు చదివాడు.

“ఈమె గొప్ప నటి అయినా అయియుండాలి. లేదా నిజంగా అమాయకురాలయియుండాలి—” అనుకున్నాడు శాస్త్రి.

“చెప్పు....నువ్వెవరో?” కఠినంగా అన్నాడు శర్మ గూండాతో.

గూండా మరోసారి ప్రతిఘటించాడు. చావు దెబ్బలు తిన్నాడు చివరికి శర్మకు దణ్ణంపెట్టి—“నన్నిక్కడకు లక్ష్మీనరసయ్యగారు పంపారు. రెండు వేలిచ్చారు. ఇక్కడున్న అమ్మాయిని రేప్ చేయమన్నారు—” అన్నాడు.

“ఎందుకు?”

“నాకు తెలియదు ...”

“ఆ అమ్మాయిని చంపేయమనికూడా అన్నారా?”

“లేదు....కానీ అవమానంతో ఆమె ఆత్మహత్య చేసు కుంటుందన్నారు....” అన్నాడు గూండా.

“మరి నువ్విప్పుడేం చేస్తావు?” అన్నాడు శర్మ.

“మీరు వదిలిపెడితే పారిపోతాను—”

“వదలకపోతే?”

“వదలడానికి మీరేం చేయమంటే అది చేస్తాను—”

"అయితే ముందీమె కాళ్ళు పట్టుకొని 'నువ్వు నా చెల్లాయివి. నేను మహాపాపిని'— అను" అన్నాడు శర్మ.

గూండా అలాగే చేశాడు.

"లక్ష్మీనరసయ్యగారిచ్చిన రెండు వేలూ నీ దగ్గరే వున్నాయా?"

"ఊఁ."

"అది మాకిచ్చేసేయ్...."

గూండా జేబులోంచి డబ్బుతీసి వాళ్ళకిచ్చేశాడు.

"ఇంకెప్పుడైనా ఇలాంటి వెధవ పనులు చేస్తూ కన బడ్డావంటే అయిదేసి వేలు ఫైను కట్టిస్తాం. తెలిసిందా?"

"తెలిసిందండి—"

"ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చెయ్యవుగా...."

"చేసినా ఏడు వేలకు తక్కువ తీసుకోనండి. అయిదు మీకు. రెండు నాకు—" అనేసిగూండా అక్కణ్ణించి పారిపోయాడు.

"అంటే వీడు నిజంగా గూండాయే!" అంది జగదాంబ.

"కాక మరేమనుకున్నావు?"

"నా భర్తే మారువేషంలో వచ్చేడనుకున్నాను. ఈ రోజాయన్ను నిరుత్సాహ పర్చకూడదనుకున్నాను...."

"నీ సంగతి నీ భర్తకు బాగా తెలుసు. అందుకే నిన్న తను గూండా వేషంలో వచ్చాడు. ఈ రోజు నిజం గూండాను పంపాడు..." అన్నాడు శాస్త్రి.

"ఏమిటిదంతా?" అంది జగదాంబ.

"నీ భర్త నిన్ను చంపాలనుకుంటున్నాడు—...."

"ఎందుకు?"

"ఏమో — యే విషయంలోనో నువ్వతడికడ్డుగా

వున్నావు....”

“నేను పతివ్రతను. ఏ విషయంలోనూ ఆయనకడ్డు చెప్పను....”

“మరిదంతా యెందుకు చేస్తున్నాడు?”

“ఆయనేం చేయడంలేదు. ఆ గూండా వెధవకేదో దుర్బుద్ధి పుట్టింది. నిన్నటి గూండాగాడు నా భర్త కాడు. వాడు నిన్న ఫెయిలై ఈ రోజు తనకంటే పెద్ద గూండాని పంపివుంటాడు....” అంది జగదాంబ.

“నిన్నటి గూండాను తనేనని నీ భర్తే ఒప్పుకున్నాడు....”

“ఎందుకొప్పుకోరు? అంత పెద్ద మొనగాడే మీ ధాటికి తట్టుకోలేక నా కాళ్ళు పట్టుకుని వెళ్ళాడు. మా ఆయనకూడా అంతే!” అంది జగదాంబ.

“నీ ప్రాణాలు ప్రమాదంలో వున్నాయి. మేము రెండుసార్లు రక్షించాం. ఏ మూర్ఖత్వం నువ్వు వదలక పోతే మేము రక్షించలేము....” అన్నాడు శాస్త్రి.

“నన్ను మీరు రక్షించామనుకుంటే అది మీ భ్రమ. ఒక మహాపతివ్రతను రక్షించమని దేవుడు మిమ్మల్ని శాసించాడు....”

“మేము దేవుడు పంపిన మనుషులం కదా—మరి నీ భర్త గురించి చెప్పేది నమ్మవేం?” అన్నాడు శాస్త్రి.

“నా భర్తకు నన్ను చంపాల్సిన అవసరంలేదు. అందుకని మీ మాటలు నమ్మను—” అంది జగదాంబ.

“కానీ దైవదూతలు చెప్పినపుడు నమ్మాలి!”

“మహా పతివ్రతలు భర్తకు వ్యతిరేకంగా ఇతరులు చెప్పేవి నమ్మరు. నమ్మకూడదు....” అందామె,

"నీ భర్త నిన్నెందుకు చంపాలనుకుంటున్నాడో ఆరాతీస్తాం. అప్పుడైనా నా విషయం నమ్ముతావా?"

జగదాంబ కళ్ళు మెరిశాయి — "మీరు చెప్పేదే నిజమైతే అందుకు కారణం తెలుసుకోవాలి నేను. అయితే మీరు నోటిమాటలు చెబితే నేను నమ్మను. కారణాలు ససాక్ష్యంగా నిరూపించాలి!" అందామె.

"ఈమె ప్రాణాలు రక్షిస్తామంటూంటే అందుకే వగలు పెడుతోందీమె! మనకేం పట్టింది—పద, పోదాం!" అన్నాడు శర్మ.

"తప్పదు శర్మా! ఈమె మహాపతివ్రత. ఈమెను రక్షించే బాధ్యత దేవుడు మనపై పెట్టాడు. అటుపైన మనకు రెండువేల రూపాయలు ఫీజుకూడా ముట్టింది...."

శర్మ నిట్టూర్చి—"సరే!" అని—"ఇప్పుడు మీ వారెక్కడుంటారో చెప్పగలవా?" అనడిగాడు జగదాంబను.

"ఇంటికి రావడం ఆలస్యమైనప్పుడు అవసరమైతే ఫోన్ చేయమని ఆయనో నెంబరిచ్చారు నాకు...." అంది జగదాంబ.

"ఏమిటది?"

జగదాంబ నెంబరు చెప్పింది.

మిత్రులిద్దరూ ఆమెనింటి దగ్గర దిగవిడిచేక—"ఈ నంబరులో అడ్రసెలా పడతాం?" అన్నాడు శర్మ.

ఫోన్ చేద్దాం!

"ఫోన్ చేసి అడ్రసడిగితే చెబుతారా ఎవరైనా?"

"సరే—ఏ సినిమా చూడకున్నా ఈ రోజు నీ బుర్ర పనిచేస్తున్నట్లు లేదు. నేనేం చేస్తానో చూడు...." అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ ఓ హోటలుకి వెళ్ళారు.

శాస్త్రి అక్కడ ఫోన్‌లో ఆ నంబరు తిప్పాడు.

"హలో! శర్మగారున్నారా?" అనడిగాడు.

"రాంగ్ నంబర్ ... " అందవతలి గొంతు.

శాస్త్రి తను తిప్పిన నంబరు మరోసారి చెప్పి—"ఇది డాక్టర్ వీరప్రతాపశర్మగారిది కామా!" అన్నాడు.

"కాదు. సినీతార సుందరమాలది!" అని ఫోన్ పెట్టేశాడవతలి వ్యక్తి.

మిత్రులిద్దరూ బయటకు వచ్చేక—"ఆ నంబరెవరిదో తెలిసిపోయింది. కానీ మనూళ్ళో సినీతార ఎవరున్నారూ అని ఆలోచిస్తున్నాను—...." అన్నాడు.

"ఆలోచించడమెందుకూ — వెళ్ళి చూస్తే సరిపోతుందిగా...."

"ఎక్కడికని వెడతాం? అడ్రసు తెలీదు కదా!" అన్నాడు శాస్త్రి.

"అంటే నిన్నటి సినిమా హాంగోవర్ నీకింకా పోలేదన్నమాట....మనిషి పేరు తెలిసేక డైరెక్టరీ చూస్తే తెలియదూ!" అన్నాడు శర్మ.

శాస్త్రి అతడి భుజం తట్టి మెచ్చుకున్నాడు.

డైరెక్టరీలో సుందరమాల పేరుంది.

ఇద్దరూ పది నిమిషాల్లో ఆమె యిల్లు చేరుకున్నారు.

ఇల్లు మరీ పెద్దదికాదు. కానీ గేటు పెద్దది.

గేటుదగ్గరో కాపలావాడున్నాడు. వాడు వీళ్ళని లోపలకు వెళ్ళనివ్వలేదు.

"చాలా అర్జంటు పని...." అన్నాడు శర్మ.

"ప్రళయం వచ్చినా సరే ఇప్పుడమ్మగారెవర్నీ కలుసుకోరు...."

"మర్యాదగా అడిగితే ఇలాగే వుంటుంది. ఏ గూడో

దూకి వెడితే ఏం చేస్తావు?" అన్నాడు శర్మ.

"గోడ దూకితే పక్క వుంది. నాకు తెలిసిన మర్యాద దానికి తెలియదు...." అన్నాడు కాపలావాడు.

"కలియుగంలో కాపలా వాళ్ళందరూ జయవిజయుల్ని మించిపోయారు. వాళ్ళయితే ఒక్క మహర్షులనే అడ్డగించారు. వీళ్ళు అడ్డమైన వాళ్ళనీ ఆపేస్తున్నారు నిన్న పార్కులోనూ యింతే.... ఈ వేళిక్కడా యింతే!"

"నువ్వు చెప్పింది బాగానే వుంది కానీ మనం అడ్డమైనవాళ్ళక్రింద రాము. గుర్తుంచుకో—...." అన్నాడు శాస్త్రి.

"అయాం సారీ...." అన్నాడు శర్మ.

"మీరిక వెళ్ళొచ్చు...." అన్నాడు కాపలావాడు.

"లోపలికా?" అన్నాడు శాస్త్రి ఆశగా.

"కాదు...."

"పోనీ లోపలెలాగూ పక్క వుంది కాబట్టి—దాని సంగతి మేము చూసుకుంటాం. గోడ దూకి వెళ్ళడానికి నీకే అభ్యంతరమూ లేదు కదా!" అన్నాడు శాస్త్రి.

"నేను చూస్తూండగా మిమ్మల్ని గోడ దూకనివ్వను."

"అయితే పోనీ కళ్ళు మూసుకో—"

"నేను కళ్ళు మూసుకోను...."

"అది నేను చూసుకుంటానులే" అంటూ శర్మ చటుక్కున కాపలావాడి భుజంమీద ఓ దెబ్బవేశాడు. అంతే వాడి కళ్ళు మూతలుపడ్డాయి. అతడు వాణ్ని అక్కడే స్టూలుమీద కూర్చోబెట్టి గేటుకు జారగిలబడేలా చేశాడు. అప్పుడెవరైనా కాపలావాణ్ని చూస్తే గేటుకుజారగిలబడి నిద్రపోతున్నాడనుకుంటారు.

"పద—మనమిక పోయి గోడదూకొచ్చు. వాడిక మనని

చూడదు...." అన్నాడు శర్మ ఉత్సాహంగా.

శాస్త్రి నవ్వి—"వాడు చూడనపుడు గోడ దూకడ మెందుకు? నేరుగా గేటులోంచే పోవచ్చుగా—" అన్నాడు.

శర్మ నాలిక్కరుచుకున్నాడు.

ఇద్దరూ లోపలికి వెడుతూండగా సింహంలాంటి కుక్క ఒకటి పక్కనించీ వచ్చింది.

"కుక్క నిజంగానే వుంది. ఇప్పుడు మనమేం చేయాలి?" అన్నాడు శాస్త్రి.

"గోడదూకి పారిపోదాం!" అన్నాడు శర్మ.

"నీ దృష్టంతా గోడ దూకడంమీదే వుంది. కుక్క మీద మన కరాటే విహాపులు పనిచేయవా?" అన్నాడు శాస్త్రి.

ఈలోగా కుక్క వారిని సమీపించింది. వారేదో చేసేలోగానే అదోసారి వాళ్ళిద్దరి పాదాలు నాకి ముందుకు వెళ్ళిపోయింది.

"మనం గోడ దూకకపోవడం మంచిదే అయింది—" అన్నాడు శాస్త్రి.

"ఏం?"

"ఇది గోడ దూకే వాళ్ళను ఎటాక్ చేస్తుంది. గేట్లోంచి వచ్చేవాళ్ళనేమీ చేయదు...."

"ఎందుకంటావ్?"

"ఏమో —సినీతారల ఇంటికి వెళ్ళడం ఇదేగా మనకు ప్రథమం...."

"ఓహో- గేట్లోంచి ఏ సమయంలోనైనా అపరిచితులు రావచ్చు, అందుకని కుక్కకలా శిక్షణ యిచ్చివుంటారు. అవునులే—తారల యిబ్బందులు తారలవి...." అన్నాడు

శర్మ.

ఇద్దరూ దర్జాగా పోర్టికోలోకి వెళ్ళారు. అక్కడెవరూ లేరు. తలుపులు మాత్రం తీసి వున్నట్లు కనబడుతున్నాయి.

మెల్లిక్కా లోపలకు ప్రవేశించారు.

విశాలమైన హాలు.... పెద్ద పెద్ద సోఫాలు....గోడలకు పోస్టర్లు.... నేలమీద ఖరీదైన కార్పెట్....

సినీతార యిల్లులాగే వుందది.

"ఏం చేద్దాం?" అన్నాడు శాస్త్రి.

"ఎక్కడా పిట్టలేదు....కాసేపు సోఫాల్లో విశ్రాంతి తీసుకొందామా?"

"మనం వచ్చిన పని విశ్రాంతి కాదు...." అన్నాడు శాస్త్రి.

హాలు చుట్టూ గదులున్నాయి. ప్రతి గది తలుపూ వేసి వుంది.

ఒకే ఒక్క గది తలుపులు వేసిలేవు. గుమ్మానికి అడ్డంగా అందమైన తెర వ్రేలాడుతోంది.

శాస్త్రి చటుక్కున గదిలో అడుగుపెట్టాడు.

గదిలో ఒక సుంద్రటి మంచం. దానిమీద ఇద్దరు స్త్రీ పురుషులు.

"యూ ఫూల్ .... గెటౌట్ " అందా స్త్రీ.

"త్వరగా బట్టలు వేసుకోండి. ఒక్క నిమిషంలో మళ్ళీ లోపలకు వస్తాను.." అంటూ శాస్త్రి బయటకు వచ్చాడు.

"లోపల ఏం చూశావు?" అన్నాడు శర్మ.

"ఏం చూశావని అడక్కు—ఎవర్ని చూశానను!"

"పోనీ—ఎవర్ని చూశావో చెప్పు..."

శాస్త్రి చెప్పబోతూండగా వారిని మొత్తం పదిమంది మెరికల్లాంటి మనుషులు చుట్టుముట్టారు. ప్రతీ ఒక్కరూ కండలు తిరిగి వున్నారు.

"ఎవరు మీరు?" అన్నాడు శర్మ.

"ఆ ప్రశ్న మేము మిమ్మల్నడగాలి...." అన్నాడు వాళ్ళలో ఒకడు.

"మే మెందుకడక్కూడదు?"

"ఎందుకంటే — ఈ హాలు చుట్టూ వున్న గదుల్లో ఒక దానికి మాత్రమే తలుపులు తెరిచుంటాయి. మిగతా వన్నీ మూసుకొని వుంటాయి. ఆ గదుల్లోపల మేముంటాం అమ్మగారి గదిలో ఆమె పిలవందే ఎవరూ అడుగు పెట్టరు. పిలవకుండా అడుగు పెట్టారూ ఆమె తన మంచం మీదనున్న మీట నొక్కితే మేము వస్తాం..."

"హమ్మయ్య — మీ రెవరో తెలిసింది!" అన్నాడు శాస్త్రి.

"ఏం తెలిసింది?" కోపంగా అన్నాడు వాళ్ళలో ఒకడు.

"ఇంటిగేటుకో కాపలా వాడు, ఇంటిగోడకో కుక్క, ఇంటి లోపల మీరు..అంతే కదా!" అన్నాడు శాస్త్రి.

"అఁయ్...." అన్నాడు వాళ్ళలో ఒకడు.

"అరుపులు తర్వాత — ఇంట్లో మీరేనా ఇంకా ఎవరైనా వున్నారా?"

"ఎందుకు?"

"కనీసం వందమందైనా వుంటే తప్ప మా సరదా తీరదు. మీరు చూస్తే పదిమందే వున్నారు..."

"ఓహ్ — అంతటి మొనగాళ్ళా మీరు!" అంటూ వాళ్ళు శాస్త్రి, శర్మలమీదకు వచ్చారు.

శాస్త్రి చిన్నగా తూళాడు. అతడి కాలు నేలమీంచీ అరడుగులా లేచింది.

శర్మ మాట్లాడలేదు. ఒంటికాలిమీద బొంగరంలా తిరిగాడు.

సుమారు అయిదు నిమిషాలు...

అంతే!

పదిమంది మెరికలూ నేలమీద గడ్డిపరకల్లా పడి వున్నారు.

శాస్త్రి ఇందాకటి తలుపు దగ్గరకు వెళ్ళాడు.

ఈసారి తలుపులు వేసి వున్నాయి.

అతడు తలుపు తట్టాడు.

లోపల చలనంలేదు.

"బయట ఇంత గొడవ జరుగుతూంటే చలనంలేదంటే అది సౌండ్ ప్రూఫ్ గదై వుండాలి. కాలింగ్ బెల్లుందేమో చూడు.." అన్నాడు శర్మ.

కాలింగ్ బెల్ వుంది.

శాస్త్రి బెల్ మ్రోగించాడు. తలుపు తెరుచుకుందుకు అయిదు నిమిషాలు పట్టింది.

ఆమె బయటకు వచ్చింది—విసుగ్గా!

ఆమె నైట్ గౌన్లో వుంది. నైట్ గౌను పల్చగా వుంది.

శాస్త్రిని చూసి ఆమె తడబడి అదోలా చూసింది.

"నేను నిన్ను చూస్తూంటాను. నువ్వు హాలు చూసుకో—" అన్నాడు శాస్త్రి.

తన మనుషులు పడివుండడం చూసి ఆమె కంగారుపడి "ఎవరు నువ్వు?" అంది.

"తర్వాత చెబుతాను. సినీతార సుందరమాలవు

నువ్వేనా?"

"కాదు—నేనామె చెల్లెలు కర్పూరమాలను...."
అందామె.

"సుందరమాల ఎక్కడుంది?"

"హైదరాబాదులో..."

"ఆమె పేరు నేనెక్కడా వినలేదే!" అన్నాడు శాస్త్రి.

"సుందరమాల అసలు పేరు. ఆ పేరుతో ఆమె సినీ జీవితం ఎక్స్‌ట్రాగా ప్రారంభమయింది. హీరోయిన్ ఛాన్స్ రాగానే పేరు మార్చుకుందామె."

"ఏమిటా పేరు?"

చెప్పింది కర్పూరమాల...

"వ్వాట్!" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

అంటే సుందరమాల ఇప్పుడు బిగ్ స్టార్!

"ఆమె యిల్లిక్కడుందని ఈ ఊళ్ళో యెవ్వరికీ తెలీదు.."

"తెలియడం ఇష్టంలేదక్కకు. తన అసలు పేరుతో ఇక్కడ ఆస్తిని పెర్చుతోంది. నేను ట్రస్టీని" అందామె.

"అలా ఎందుకు చేయడం?"

"సినీ జీవితం అశాశ్వతం. ఈనాడున్నవారు రేపుండరు. పేరున్నంత కాలం ఆమె చుట్టూ జనం, వంది మాగధులు. అదో నిషా! ఆ నిషాలో తనేమైపోతుందో ఆమెకు తెలీదు. అందుకే డబ్బునిలా ఇక్కడ జాగ్రత్త చేసుకొంటోంది. సినిమా ఫీల్డులో తన శకం అయిపోగానే తాను తిరిగి సుందరమాలగా ఇక్కడ స్థిరపడుతుంది..."

"బాగుంది కథ..అంటే నువ్వామె చెల్లెలివి. కర్పూరమాలవు. ఏం చేస్తూంటావిక్కడ!"

కర్పూరమాల మాట్లాడలేదు.

"నువ్వు డబ్బును మరోవిధంగా సంపాదిస్తున్నావని నేనంటాను. కాదంటావా?"

"లేదు. ఇందాకా మీరు చూసింది కాబోయే నా భర్త.."

శాస్త్రి నవ్వి — "అతడి పేరు లక్ష్మీనరసయ్యనీ, జగదాంబ అనే భార్య అతడికున్నదనీ నీకు తెలియదా?" అన్నాడు.

కర్పూరమాల ఆశ్చర్యంగా-"ఎవరు మీరు?" అంది.

"వివరాలు మాట్లాడుకుందాం—నువ్వు ముందు శాస్త్ర మంచి బట్టలు కట్టుకునిరా—..." అన్నాడు శాస్త్రి. ఆమె లోపలకు వెళ్ళబోగా—"ఈలోగా నీకాబోయే భర్తను పంపించు. అతడితోకూడా మాట్లాడాలి!" అన్నాడు శాస్త్రి.

## 5

శాస్త్రికి. శర్మకు అక్కడ ఆశ్చర్యకరమైన విశేషాలు చాలా తెలిశాయి.

సుందరమాలకు లక్ష్మీనరసయ్య ఇన్‌కంటాక్స్ కన్స ల్టెంటుగా రెండు సంవత్సరాలనుంచి ఉంటున్నాడు. అతడి సహాయంవల్ల అమిత ప్రయోజనం పొందడంవల్ల ఆమె తన చెల్లెలు కర్పూరమాలతో అతణ్ని ఆకట్టుకో మని చెప్పింది ఆ విధంగా లక్ష్మీనరసయ్య కర్పూరమాల ప్రేమలో పడ్డాడు. ఆ ప్రేమ ఎంతగా మారిందంటే ఆమెది వేశ్యాకులమని తెలిసీ అతడామెను వివాహం చేసుకుందుకు సిద్ధంగా ఉన్నాడు.

జగదాంబ భర్త నెంతో ప్రేమిస్తూ అతను గీచిన గీటు దాటదు. ఆమె నేమీ చేయలేకపోతున్నాడు లక్ష్మీనర

సయ్యి. స్వయంగా యేమీ చేయలేక అడ్డదారి పట్టాడతడు. ఓ గూండా వేషంలో భార్య శీలం దోచుకుంటే — ఆమె ఆత్మహత్య చేసుకుంటుందని అతడు భావించాడు. అది తెలిసికొట్టేక నిజం గూండానే పంపాడు. అదీ తెలిసికొట్టినట్లతడికిప్పుడే శాస్త్రి. శర్మల ద్వారా తెలిసింది.

"నన్ను కామించేవారే కానీ ప్రేమించేవారు లేరు. అందుకే వివాహితుడని తెలిసీ — లక్ష్మీనరసయ్యతో పెళ్ళికి సిద్ధపడ్డాను నేను. మా పెళ్ళికి జగదాంబ అడ్డం. ఆ అడ్డాన్నతడు తొలగిస్తానంటే నేనూ సహకరించాను. ఇందులో తప్పు చేస్తున్నానన్న భావం నాకులేదు. అందరి లాంటి ఆడదాన్నే నేను. కానీ సమాజం నన్నందరినుంచీ వేరుచేసి యెవరూ తప్పు పట్టడంలేదు. ఆ తప్పును సరిదిద్దడంకోసం మరో తప్పు నేనూ చేయవచ్చుననిపించింది. అందుకే నేను లక్ష్మీనరసయ్యకు సహకరిస్తున్నాను—" అంది కర్పూరమాల.

"నా భార్య మంచిది. కానీ కర్పూరమాలతో జీవితం మహాద్భుతంగా ఉంది. ఆ జీవితంకోసం యేమైనా చేయగలను...." అన్నాడు లక్ష్మీనరసయ్య.

ఆ యింట్లో ఫోటో ఆల్బంలో వాళ్ళిద్దరూ కలిసి సరదాగా బయట తిరిగినప్పుడు తీసుకున్న ఫోటోలున్నాయి.

శాస్త్రి. శర్మలు ఆ ఫోటోలు తీసుకున్నారు. వాళ్ళ మాటలు అక్కడున్న టేపురికార్డర్లోనే రికార్డు చేసి కాసెట్ తీసుకున్నారు.

"మిస్ మాలా! సమాజం నీకన్యాయం చేసినమాట నిజం. అయితే అందుకు ప్రతిఫలంగా నువ్వు జగదాం

బను చంపాలనుకుంటే సమాజం నీ కులాన్ని కాపాడించిన కళంకం మరింతగా ధృఢపడి — మరికొందరు కర్పూర మాలలు నిరాశ చెందుతారు. నువ్వు యెన్నుకున్న పద్ధతి సరైనది కాదు. నీ డబ్బు కాశపడి యెందరో మామూలు యువకులు నిన్ను పెళ్ళాడ్డానికి ముందుకొస్తారు. లక్ష్మీ నరసయ్య నీ డబ్బు కాశపడలేదన్న గ్యారంటీ లేదు—" అని కర్పూరమాలకు చెప్పాడు.

"నీ భార్య మహాపతివ్రత. ఆమె కన్యాయం చేస్తే జైలుపాలవడం తప్ప నీ కితర ప్రయోజనా లుండవు...." అంటూ శర్మ లక్ష్మీనరసయ్యను హెచ్చరించాడు.

# 6

ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలు....

శాస్త్రికి నిద్ర పట్టడం లేదు. శర్మకూ పట్టడం లేదు. వరుసగా రెండురోజులు లా సమయంలో అశోకా పార్కు దగ్గరున్నారు తామిద్దరూ. ఈ రోజక్కడేం జరుగుతుందో!

"అక్కడింకేమీ జరుగదు. మనం కర్పూరమాలను, లక్ష్మీనరసయ్యను హెచ్చరించాం. జగదాంబకు సాక్ష్యాలు చూపి మరీ హెచ్చరించాం—" అన్నాడు శర్మ.

"నా భయం జగదాంబ గురించే! ఆమె కలియుగంలో వెలసిన మహాపతివ్రత కదా! ఆమె ఏమి చేయబోతోందో మన ఊహాకందదు...."

"తనే భర్తను కర్పూరమాల ఇంటికి తీసుకువెళుతుందంటావా?"

"ఏమో—అలాగే చేయొచ్చు.... లేదా!" అని శాస్త్రి ఉలిక్కిపడి లేచికూర్చున్నాడు.

"ఏమయింది?"

"ఈ రకం మరో అవకాశం ఇవ్వడాని కామె మళ్ళీ అశోకా పార్కులో ఉండవచ్చు—...." అన్నాడు శాస్త్రి.

మరుక్షణం మిత్రులిద్దరూ అశోకా పార్కు దగ్గరున్నారు. కాపలావాడు వీళ్ళిద్దర్నీ చూసి గుర్తుపట్టి సలాం చేసి—"లోపలెవ్వరూ లేరండి. మీరు వెళ్ళి చెక్ చేసుకోవచ్చు—" అన్నాడు వినయంగా.

"అతివినయం ధూర్తలక్షణం. వీడి మాటలు నమ్మడానికి లేదు—...." అంటూ శాస్త్రి—పార్కు లోపలకు వెళ్ళాడు. శర్మ అతనివనుసరించాడు.

పార్కులో ఎవ్వరూ లేరు.

"పాపం—అనవసరంగా వాడి ననుమానించాం—" అన్నాడు శర్మ.

"సరే—ఇప్పుడు లక్ష్మీనరసయ్య ననుమానిద్దాం—" అన్నాడు శాస్త్రి.

"అంటే?"

"కర్పూరమాల ఇంటికి వెడదాం—...."

"వెళ్ళి...."

"పద—తర్వాత చెబుతాను—...." అన్నాడు శాస్త్రి.

కర్పూరమాల ఇంటి కాపలావాడు శాస్త్రి, శర్మలకు సెల్యూట్ చేశాడు.

"ఈ రోజు కాపలావాళ్ళంతా బాగుపడ్డారు...." అన్నాడు శర్మ.

వాళ్ళు లోపలకు వెళ్ళగానే ఠక్కు వారి పాదాలు నాకి వెళ్ళింది.

లోపల అంతా మామూలే!

తలుపులు వేసివున్న గదిలో కర్పూరమాల, లక్ష్మీ నరసయ్య ఉన్నారు. అయితే వారి రోజా ముందు జాగ్రత్తలో ఉన్నారు. ఇద్దరూ మంచి దుస్తుల్లో ఉన్నారు.

"నీది తక్కువ బుద్ధిలాగుందే!" అన్నాడు శాస్త్రి.

"ఎవరిది—నాదా, లక్ష్మీనరసయ్యదా—?" అంది కర్పూరమాల.

"పోనీ—ఇద్దరిదీ అనుకోండి...."

"నాది తక్కువబుద్ధి కాదు. వచ్చేడు గదా అని రానిచ్చాను "

శాస్త్రి లక్ష్మీనరసయ్యవంక గుడ్లురిమి చూశాడు.

"తప్పు నాదికాదు.... నా భార్యది...."

"నీ భార్యదా?" ఆశ్చర్యపోయాడు శర్మ.

"అవును. సంగతంతా తెలిసి ఈ రోజు కర్పూరమాల యింటికి వెళ్ళితీరాలని బలవంతపెట్టింది. నేను వద్దంటున్నా వినలేదు. లేకపోతే చచ్చిపోతానని బెదిరించింది. భయపడి యిక్కడకు వచ్చాను. కానీ బుద్ధిగానే ఉన్నాను. మీరిక్కడికి వస్తారని నాకు తెలుసు—" అన్నాడు లక్ష్మీనరసయ్య వినయంగా.

"అయితే బుద్ధిరాలేదింకా మీ యిద్దరికీ!" అన్నాడు శర్మ.

"ఎందుకని?"

"అంతమంచి జగదాంబ కింకా అన్యాయం చేయాలని నీకనిపిస్తోందంటే నువ్వు చాలా దుర్మార్గురాలివి—" అన్నాడు శాస్త్రి.

కర్పూరమాల తడబడలేదు—"నిజంగా చెబుతున్నాను. లక్ష్మీనరసయ్య వస్తే పొమ్మనలేకపోయాను

కానీ అతనికి దగ్గరగా కూడా వెళ్ళలేదు—"

"నా భార్య నిజంగా చనిపోతుందేమోనని వచ్చా నిక్కడికి. నిజం చెబుతున్నాను. నాకు బుద్ధి వచ్చింది" అన్నాడు లక్ష్మీనరసయ్య.

"నీకు బుద్ధి వచ్చినా రాకున్నా—నీ భార్యకేమైనా సరే అందుకు నువ్వే కారకుడవని పోలీసులకు పట్టించగలం మేము. ముందు నీ యింటికి పద—" అన్నాడు శాస్త్రి.

లక్ష్మీనరసయ్య వెంటనే లేచాడు.

కర్పూరమాల తనూ లేచి నిలబడి—"నేనూ వస్తా—" అంది.

"నువ్వెందుకు?"

"ఈ రోజుల్లో కూడా మహాపతివ్రత లున్నారంటే నమ్మలేకపోతున్నాను. ఆమె యిప్పుడేం చేస్తుందో చూడాలనుంది నాకు—" అంది కర్పూరమాల.

"మంచిది. మాతో రా!" అన్నాడు శర్మ.

"నా కార్లో వెడదాం—" అందామె.

"కానీ నీ డ్రైవరు వద్దు. ఈ కథ యొక్కువ మందికి తెలియడం నా కిష్టంలేదు—" అన్నాడు శాస్త్రి.

"నేను డ్రైవ్ చేయగలను—" అంది కర్పూరమాల.

అందరూ ఆమె కార్లో లక్ష్మీనరసయ్య ఇల్లు చేరుకునేసరికి సమయం పదకొండు గంటలు కావస్తోంది.

ఆ వీధి నిర్మానుష్యంగా ఉంది.

ముందు కార్లోంచి శాస్త్రి, శర్మ, దిగారు.

తర్వాత లక్ష్మీనరసయ్య....

అట్నించి దిగి డోర్ లాక్ చేసి వచ్చింది కర్పూరమాల.

ఇద్దరూ ఇంట్లో అడుగుపెట్టబోతూండగా చటుక్కున

లక్ష్మీనరసయ్య ఇంటి తలుపులు తెరుచుకున్నాయి.

లోపల్నుంచి జగదాంబ బయటకు వచ్చింది.

ఆమె నడకలో స్థిరంలేదు. మనిషి బాగా తూలుతోంది.

శాస్త్రి, శర్మ ఆశ్చర్యపోయారు. లక్ష్మీనరసయ్య తెల్లబోయాడు.

కర్పూరమాల కుతూహలంగా జగదాంబను చూస్తోంది.

జగదాంబ రోడ్డుమీదకు వచ్చింది.

ఆమె పైట జారి నేలమీద వేలాడుతోంది.

అంత రాత్రిలో చల్లని వాతావరణంలో ఆమె ముఖం నిండా చెమటలు.

"ఎవర్రా మీరు.... దేవదూతలా....యమభటులా...." అందామె వాళ్ళను చూసి. మాట బాగా ముద్దగా వచ్చింది.

శాస్త్రి ఆమెను సమీపించాడు.

గుప్పున వాసన కొట్టింది.

మహాపతివ్రత తాగింది. బాగా తాగింది.

లక్ష్మీనరసయ్య ఆమెను సమీపించి పైట సర్దబోయాడు. ఆమె అతణ్ణి విసిరికొట్టింది. ఊహించని లక్ష్మీనరసయ్య రోడ్డుమీద పడ్డాడు.

"నన్నెవ్వరూ ఆపలేరు...." అంటూ ఆమె ముందుకు నడిచింది.

శాస్త్రి, శర్మ ఆమెను చెరో రెక్కా పట్టుకుని ఆపేరు.

ఆమె గింజుకుంటోంది.

"నీ భార్యకు తాగే అలవాటుందా?" అన్నాడు శర్మ.

"లేదు...."

"పోనీ నీ యింట్లో తాగడానికి సదుపాయముందా?"

"ఇంట్లో యెప్పుడూ ఒక బ్రాందీ బాటిలు, విస్కీ బాటిలు వుంటాయి—"

"సరే—ఇంకేం! ఆమె మనసు గాయపడింది. వేరే మార్గంలేక తనూ తాగింది...." అన్నాడు శాస్త్రి బాధగా. అయితే జగదాంబ ఇలా చేయడం అతడికెంతో బాధగా వుంది.

అంతా ఆమెను బలవంతంగా లోపలకు తీసుకొని వెళ్ళారు. ఆమెను మామూలు మనిషిని చేయడానికి ప్రయత్నించారు.

వీలుకాలేదు. ఆమె నిద్రపోయింది.

"బరితెగించినదాన్నని నా గురించి అనుకుంటారు, కానీ నేనెప్పుడూ సారా రుచికూడా ఎరుగను—" అంది కర్పూరమాల.

"సమయానికి మనం రాకపోతే చాలా అభాసై వుండేది. నా భార్య తాగి రోడ్డెక్కి తందనాలాడిందంటే ఎంత అప్రతిష్ట!" అన్నాడు లక్ష్మీనరసయ్య.

"అంటే — నువ్వింకేమీ అప్రతిష్ట పనులు చేయలేదా!" అన్నాడు శాస్త్రి కోపంగా అతడి వంక చూసి.

లక్ష్మీనరసయ్య మాట్లాడలేదు.

"ఆమె తాగిందంటే అందుకేదో బలమైన కారణం వుండాలి. నువ్వే ఆమెను తాగేలా చేశావని నా నమ్మకం. ఆమెను నీవు వదిలి వెళ్ళలేము. మెలకువవచ్చేవరకూ ఇక్కడే వుండి విషయం తెలుసుకుని మరీ వెడతాం—" అన్నాడు శర్మ.

మర్నాడుదయం పది గంటలకుగానీ జగదాంబకు

మెలకువ రాలేదు.

అప్పటికి కర్పూరమాల స్నానంతోపాటు వంటకూడా చేసింది. ఇలాంటి ట్లో ఒకరోజు వంట చేయాలన్నది ఆమె కోరిక.

మిగతా వారందరూకూడా స్నానాలు చేశారు.

ఎప్పుడూ అందరికంటే ముందుగా స్నానంచేసే జగదాంబ—ఒక్క రాత్రి తాగేసరికి ఆ మేరకు పతన మయింది.

ఆమె కళ్ళు విప్పే సమయానికి పక్కన శాస్త్రి, శర్మ, భర్త వున్నారు. శర్మ కేక పెట్టి కర్పూరమాలను పిలిచాడు.

“నేనెక్కడున్నాను?” అంది జగదాంబ నీరసంగా.

“నీ యింట్లో—మా ఎదుట....” అన్నాడు శాస్త్రి.

జగదాంబ చటుక్కున లేచి కూర్చుని—“నేను చావ లేదా?” అంది.

“చావలేదు కానీ—రాత్రి నువ్వు చేసినపని అంతకన్న ఘోరమైనది....”

“నిజం చేశాను. నా భర్త నన్ను చంపాలనుకుం టున్నారు. చంపితే ఆయన జైలుపాలవుతారు. నాకై నేనే చనిపోతే ఆయనకాబాధుండదుకదా అని విషం మింగాను. అది తప్పా?” అంది జగదాంబ.

ఆమె యేదో అనబోతూండగా—“రాత్రి నాకు గుర్తులేదు. ఆ బాటిల్సులో యేముందని నా భార్యడిగితే విషముందని చెప్పాను. విషమెందుకూ అంటే యింట్లో వుంచుకోవడం అవసరమనీ—తనెప్పుడూ నా బీరువా ఓపెన్ చేయవద్దనీ చెప్పాను. ఆమె నా మాటలు నమ్మింది. నిన్న నాకోసం తన జీవితం త్యాగం చేయాలనుకొని ఆ

విషమే పుచ్చుకుంది. అంతా ఎలా జరిగిందో నాకిప్పుడర్థమయింది...." అన్నాడు లక్ష్మీనరసయ్య.

శాస్త్రి, శర్మ తెల్లబోయారు.

కర్పూరమాల జగదాంబ కాళ్ళు పట్టుకొని తన తప్పును మన్నించమనీ—జగదాంబకు తనవల్ల ఏ యిబ్బందీ రాకుండా చూసే భారం తనదనీ చెప్పింది.

లక్ష్మీనరసయ్య ఆమెతో—"ఇప్పుడు నా ఆలోచనల నిండా నువ్వే వున్నావు. నేను నిన్ను మోసం చేయను. నా జీవితాన్ని నీకే అంకితం చేస్తాను. నన్ను మన్నించు" అంటున్నాడు.

శాస్త్రి, శర్మ అక్కణ్ణించి బయటపడ్డారు.

"ఇప్పుడేం జరుగుతుంది? జగదాంబ వాళ్ళను మన్నిస్తుందా?" అన్నాడు శర్మ.

"మహాపతివ్రతలున్నదే భర్త తప్పులు మన్నించడానికి!" అన్నాడు శాస్త్రి.

"కానీ నాకో విషయం తెలుస్తోంది. జగదాంబ నమ్మినట్లు యేదో శక్తి ఆమెను కాపాడుతూనే వుంది. ఆలోచించి చూడు...." అన్నాడు శర్మ.

"ఆమె గురించి నే నాలోచించను. ఆలోచనాశక్తి వున్న యే ఆడదీ జగదాంబలా మహాపతివ్రత కాలేదు. ఆమె నేదో శక్తి రక్షిస్తోందన్న సందేశంతో ఈ కథ ముగించి మరి కొందరు మహాపతివ్రతలను తయారుచేసే పాపం నేను చేయలేను. ఇకమీదట మరో పతివ్రత లెవరైనా తటస్థపడితే వాళ్ళను వాళ్ళనమ్మకానికే వదులు పాయపడొద్దు—" అన్నాడు శాస్త్రి.

—:అ యి పో యిం ది:—

# దెయ్యాల బండి

## అపర్ణా నైటింగేల్

(గత సంచిక తరువాయి)

**6** "కూ...." అంటూ ఎక్కడో దూరాన కూత వినిపించింది.

"చుక్ .... చుక్ .... చుక్ .... చుక్" దయ్యాల బండి వస్తోన్న చప్పుడు వినిపించింది.

"టంగ్ .... టంగ్ .... టంగ్" గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

కవిత బెడ్ మీద కదిలింది.

లేచి బెడ్ దిగింది.

బెడ్ రూమ్ తలుపు తెరుచుకొని నడువాలోకి వచ్చింది.

నిద్రమత్తులో జోగుతూనే అడుగులు వేస్తూ బెడ్ రూమ్ వైపు వెళ్ళింది.

అక్కడ బాత్ రూమ్ తలుపు పక్కన రాజా నిలబడి వున్నాడు.

"ఏం బాబూ! బాత్ రూమ్‌కి వచ్చావా?" అడిగిం దామె.

"అవును మమ్మీ!" అంటూ నవ్వాడు రాజు.

ఆ నవ్వు వికృతంగా వుంది.

కవితకు ఎందుకో గుండె ఝల్లుమంది.

ఆమె అదేమీ పట్టించుకుండా "పద బాబూ!" అంటూ రాజు చెయ్యిని పట్టుకోబోయింది, బాత్ రూమ్ లోపలికి తీసుకువెళ్దామని.

కాని—

ఆమె రాజు చెయ్యి పట్టుకోబోయేంతలో "హీ.... హీ....హీ" అంటూ నవ్వసాగాడు రాజు.

పళ్ళలో నాలుగువైపులా కోరలు మొలుచుకొచ్చాయి.

కనుగుడ్లు బయటికి వెళ్ళుకొచ్చి ఎర్రగా గోళాల్లా మండుతున్నాయి.

చెయ్యి పొడవుగా సాగుతూ కవిత ముఖంమీదికి రాసాగింది.

కవిత భయంతో "కెవ్వు"మనబోయింది.

అలా అని అరవాలనుకుంది. కాని, అరుపు నోటినుండి బయటకి వెలువడలేదు.

కాళ్ళు గజగజా వణకసాగాయి.

నరాలు తెగిపోతున్నట్లనిపించింది.

రక్తం మంచులా గడ్డకట్టుకుపోతోంది.

కళ్ళలో భయం....

గుండెలో భయం....

తనువుమీద భయం....

అణువణువునా ఆమెలో భయం....

ఆ ప్రదేశం నుంచి వెనక్కి తిరిగి పోవాలనుకున్నా

పారిపోలేక పోతోందామె.

పాదాలు గచ్చుకి గట్టిగా అతుక్కుపోయాయి.

రాజా చెయ్యి సాగుతూ వచ్చి కవిత ముఖాన్ని తాకింది.

అంతే!

"కెవ్వు"మంటూ బంగళా ప్రతిధ్వనించేలా కేక వేసిందామె.

ఎక్కడలేని శక్తి కూడదీసుకొని వెనక్కు తిరిగి ఒక్క పరుగున బెడ్ రూమ్‌లోకి వచ్చి పడింది.

దామోదర్ మీద పడిపోయి అతన్ని గట్టిగా వాటేసుకుని వణికిపోసాగింది.

దామోదర్ వులిక్కిపడి లేచాడు.

కవిత చిగురుటాకులా వణికిపోతోంది భయంతో.

"ఏమైంది కవితా?" ఆతృతగా అడిగాడతను.

"ద.... దె . దెయ్యం" అందామె వణుకుతూ.

"ఏదీ? ఎక్కడ?" కంగారుగా చుట్టూ చూస్తూ అడిగాడు.

"బాత్ రూమ్ దగ్గర రాజా అలా కనిపించాడు" అంటూ వివరించి చెప్పింది కవిత.

"ఆ" అంటూ అతను చాలా సేపటిదాకా నోరు తెరుచుకొని వుండిపోయాడు.

అతని ముఖంలో కూడా భయం స్పష్టంగా తొంగి చూసింది.

"దామోదర్! ఆ రోజు రాజా నీకిలా కనిపిస్తే బహుశా నువ్వారోజు చూసిన 'ఈవిల్ డెడ్' సినిమా ప్రభావం వలన నువ్వలా భ్రమపడ్డావని అనుకున్నాను. కాని నేను యే భయంకరమైన సినిమా కూడా ఈ మధ్య చూడ

లేదు. అసలు నేను లేచి బాత్‌రూమ్‌కి వెళుతున్నప్పుడు నాలో భయంగొలిపే ఎలాంటి ఆలోచనా కలగలేదు. అలాంటిది మనబ్బాయి అలా కనిపించాడంటే నాకు నిజంగా చాలా భయం వేస్తోంది" అంది కవిత.

ఆమె తనవు ఇంకా కంపిస్తోంది.

అధరాలు వణుకుతున్నాయి.

"అంటే....అంటే....రాజాకి యేమయిందని నీ వుద్దేశం?" దామోదర్ కంఠంలో అనుమానం, ఆయోమయం తొంగిచూశాయి.

"రాజాకి దయ్యం పట్టి వుందని నా అభిప్రాయం. లేకపోతే మనబ్బాయేమిటి? అలా దెయ్యంలా కనిపించడమేమిటి?" అని అంది కవిత.

"అవును. నీవన్నది నిజం. ఆ రోజు నాకూ అలాగే కనిపించాడు. కాని, నేను హారర్ సినిమా చూడటం వలన, నువ్వు చెప్పినమీదట నా భ్రమేమోనని అనుకున్నాను" అన్నాడు దామోదర్.

"అయితే ఇప్పుడేం చేద్దాం దామూ!?" అంది కవిత. ఆమె ముఖంలో కంగారు కనిపిస్తోంది.

"పద. ఇద్దరం బాత్‌రూమ్ దగ్గిరికి వెళ్ళి చూద్దాం. తరువాత యేం సంగతీ ఆలోచిద్దాం" అని అంటూ దామోదర్ ముందుకు అడుగులు వేశాడు.

వెనుకనే కవిత బిక్కు బిక్కుమంటూ అతనిని అనుసరించింది.

బాత్‌రూమ్ తలుపులు తెరుచుకొని రాజా బయటకు వస్తున్నాడు.

రాజాని పలకరించడానికే భయం వేసింది కవితకు.

"ఏం బాబూ! బాత్‌రూమ్‌కొచ్చావా?" అడిగాడు

దామోదర్.

"అవును డాడీ!" అన్నాడు రాజు.

ఆ బాలుని ముఖం ప్రశాంతంగా వుంది.

కళ్ళు అమాయకంగా వున్నాయి.

ఇందాకటి భయంకరత రాజులో యెక్కడా కూడ కానరాలేదు కవితకు.

"పద. పోయి పడుకుందాం" అంటూ దామోదర్ రాజు చెయ్యి పట్టుకొని బెడ్‌రూమ్‌లోకి తీసుకొచ్చాడు. కవిత కూడా లోపలికొచ్చింది.

"చూడు రాజూ! నువ్వు బాత్‌రూమ్‌కి వెళ్ళినప్పుడు అక్కడ నిన్నెవరన్నా గట్టిగా పట్టుకున్నట్టుగాని, జడిపించినట్టుగాని అనిపించిందా?" అని అడిగాడు దామోదర్.

"అలాంటిదేం జరగలేదు డాడీ! అయినా మా టీచర్ చెప్పిన సాహస కధలవల్ల భయం అంటే యేమిటో నాకు తెలీదు. నాలో వున్నది అంతా సాహసమే" అన్నాడు గర్వంగా నవ్వుతూ.

"సరే! పడుకో" అని రాజుని బెడ్‌మీద పడుకో బెట్టాడు దామోదర్.

రాజు నిద్రలోకి జారుకున్నాక, అప్పటివరకు భయం భయంగా చూస్తున్న కవితతో—

"బాబుకి ఏదో దెయ్యం పట్టింది. ఇది నిస్సందేహంగా నిజం. బహుశా అది ఆవహించినట్టు రాజుకి తెలియక పోయివుండవచ్చు. అందుకే రేపు నేను చింతపల్లి అడవులకు బయలుదేరుతున్నాను. ఆ అడవులలో శివనాథ్ అనే స్వామీజీ వున్నారట! ఆయన ఇలాంటి దెయ్యాలని భూతాలని దెబ్బకి వదలగొట్టగలడు! ఆ మధ్య యెవరో

ఇలా అనుకుంటుంటే నే నాయన వివరాలు అడిగి తెలుసుకున్నాను. రేపు ఉదయమే నా ప్రయాణం. మళ్ళీ రాత్రికి ఆయనతో తిరిగి వస్తాను. నేను వచ్చేదాకా రాణిని జాగ్రత్తగా చూసుకో. ధైర్యంగా వుండు" అని చెప్పి నిద్రలోకి జారిపోయాడు దామోదర్.

కవితకు మాత్రం భయాందోళనలవల్ల ఆ రాత్రి మళ్ళీ నిద్రపట్టలేదు.

## 7

మర్నాడు జీపులో చింతపల్లి అడవులకు బయలు దేరాడు దామోదర్.

జీప్ అడవిని సమీపించింది.

ఘాట్ రోడ్ మీద చాలా దూరం వెళ్ళి పక్కనే వున్న మట్టిరోడ్డు వైపుకు మలుపు తిరిగింది.

ఆ మట్టిరోడ్డు కొంతదూరం వెళ్ళి ఆగిపోయింది. అక్కడినుండి సన్నని కాలిబాట ఎదురయింది.

దామోదర్ జీపు ఆపి కాలినడకన ఆ బాటలో చాలాదూరం సాగిపోయాడు.

చుట్టు చెట్లు..పొదలు దట్టంగా అలముకుని వున్నాయి. రకరకాల పశుపక్ష్యాదుల అరుపులతో ఆ అడవి వాతావరణం గుండెలకు గుబులు పుట్టిస్తోంది.

ఆ కాలిబాట వెంబడి సుమారు ఓ రెండు ఫర్లాంగుల దూరం నడిచాక, పక్కనే చదునైన ప్రాంతం కనిపించింది. ఆ ప్రదేశంలో అందమైన ఓ పూరిగుడిసె నిర్మితమై వుంది.

గుడిసె బయట ఎత్తైయిన రెండు కర్ర స్తంభాలమీద పావురాలగూళ్ళు కట్టబడి వున్నాయి.

ఆ గూళ్ళలో పావురాలు "కువ కువ"మని కూస్తు

స్తున్నాయి.

గుడిసె ఆవరణలో అందమైన పూల మొక్కలు సౌరభాలను గుబాళిస్తూ అందమైన కోమలాంగిలను గుర్తుకు తెస్తున్నాయి.

ఆవరణలో ఆకర్షణీయమైన రంగురంగుల రంగవల్లులు తీర్చిదిద్ది వున్నాయి.

ఇంటి ఆవరణ చుట్టూ నేపాలీ మొక్కలు ఫెన్సింగ్‌లా పెంచబడి వున్నాయి.

ఫెన్సింగ్ దాటి లోపలికి అడుగు పెట్టాడు దామోదర్.

గుడిసె బయట నిలబడి—

"స్వామీజీ!" అని పిలిచాడు.

"ఎవరది?" అంటూ స్వామీ జీవనాథ్ తలుపులు తోసుకొని బయటకు వచ్చాడు.

ఆరడుగుల విగ్రహం తెల్లగా పుష్టిగా వున్నాడాయన. అందరి స్వామీజీలకు విరుద్ధంగా ఆయనకు గడ్డాలు, మీసాలు లేవు.

స్వామీ జీవనాథ్ మెడలో రుద్రాక్షమాల వేలాడుతోంది. నుదుటన పొడవుగా మూడు విభూది రేఖలు నిలువుగా వున్నాయి. తెల్లటి లాల్చీ, తెల్లటి పంచె ధరించి వున్నాడాయన.

ముఖంలో ఎనలేని తేజస్సు వుట్టిపడుతోంది.

ఆయనని చూడగానే దామోదర్ వినయంగా నమస్కరించాడు.

"శివోహం" అంటూ చెయ్యెత్తి దీవించి, "ఎవరు బాబూ మీరు?" అని అడిగారాయన.

"స్వామీ! నా పేరు దామోదర్! మా అబ్బాయికి

దెయ్యం పట్టింది" అంటూ రాజు తనకి, కవితకి యే విధంగా కనిపించి భయపెట్టిందీ వివరించి చెప్పాడు దామోదర్.

"అరెరె! అలా కనిపించాడా?!" అంటూ ఆశ్చర్య పోయాడు స్వామి శివనాథ్.

"అవును స్వామీ! ఈ సమయంలో మీరే మాకు శరణమని మీ దగ్గరకు వచ్చాను" అంటూ వినయంగా విన్నవించుకున్నాడు దామోదర్.

"శివోహం! దుష్టశిక్షణ, శిష్టరక్షణ మా కర్తవ్యం. ఆ దుష్టశక్తిని పారద్రోలి మీ అబ్బాయిని కాపాడుతాను. తక్షణమే బయలుదేరుదాం నడు" అన్నారాయన.

ఇరువురూ కాలిబాట వెంబడి నడుచుకుంటూ మట్టి రోడ్డు ఎక్కి జీపును అధిరోహించారు.

దామోదర్ జీపుని ముందుకు దూకించాడు.

శివనాథ్ గొప్ప జ్ఞాని. అంతకుమించిన దైవభక్తుడు. ఆయన మంత్రాలు తంత్రాలు నేర్చుకోవడానికి క్షుద్ర శక్తులని యెప్పుడూ ఆరాధించలేదు. వాటిని కైవసం చేసుకున్న యే గురువునీకూడ ఆయన ఆశ్రయించలేదు.

ఆయనకి చిన్నతనంలోనే భగవంతుడంటే యెంతో భక్తి కలిగింది. శివపురాణాన్ని, రామాయణ, భాగవత, భగవద్గీతలని పన్నెండేళ్ళ ప్రాయంలోనే ఆపోసన పట్టారు. వాటి సారాన్ని వంటపట్టించుకోవడానికి సామాన్య మానవ జీవితం పనికిరాదనుకున్నారాయన. అందుకే ఆయన ఆ ప్రాయంలోనే వంటరిగా చింతపల్లి అడవులకు వచ్చేశారు. అక్కడ చాలా ఏళ్ళు భగవంతుని మీద ఏకాగ్రత నిలిపి తపస్సు చేశారు. ఆత్మశోధనతో భగవంతుడిని తెలుసుకున్నారాయన. త్రికాల జ్ఞానం

కలిగింది స్వామీజీకి. దేవునిమీద యేకాగ్రత నిలపడం వలన ఆయన మహిమ మహిమాన్వితుడయాడు.

స్వామీ జీవనాథ్‌ని చూడటానికి భక్తులు ఎవరైనా వస్తే, ఆయన వాళ్ళనుండి యే కానుకలూ స్వీకరించరు. పైగా ఆయనే వాళ్ళకు యే పండో కాయో కానుకగా సమర్పిస్తారు. శివోపదేశం చేసి పంపిస్తారు.

"దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఆ పరమశివుని పరమావధి" అని బోధస్తూంటారాయన.

"చేసేడివాడు వాడే! చేయించెడివాడు వాడే! మనం కేవలం నిమిత్తమాత్రులం" అంటూ శివుని గురించి తెలియ జెబుతూంటారాయన. శివుడినే నిత్యం ధ్యానిస్తూంటారు జీవనాథ్.

మంచికోసం తన ప్రాణాలైనా ఒడ్డే మనస్తత్వం ఆయనది.

చెడుకు చాలా దూరంగా వుంటారాయన. దుర్మార్గులు దుష్టులు అంటే స్వామీజీకి చెప్పలేని అసహ్యం. అలాంటి వాళ్ళ నీడ చూడటానికికూడా ఇష్టపడరు స్వామీ జీవనాథ్.

జీపు చింతపల్లి అడవులుదాటి ఘాట్ రోడ్‌గుండా ప్రయాణం సాగించింది.

వాళ్లు దామోదర్ బంగళా చేరుకునేసరికి అర్ధరాత్రి సమీపించింది.

స్వామీజీని కవితకు పరిచయం చేశాడు దామోదర్. కవిత పక్క నిలబడ్డ రాజుని చూపించాడు దామోదర్.

"ఫిదేనండీ! మా కొడుకు" అని చెప్పాడు.

"ఇలారా బాబు" దగ్గరగా పిలిచారు రాజుని స్వామీ

జీవనాథ్.

రాజా దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు.

"నీ పేరేంటమ్మా!?" అడిగారు.

"రాజా" చెప్పాడు రాజా.

"శభాష్! మంచి పేరు" అంటూ మెచ్చుకున్నారాయన. "నాతోరా బాబూ!" అంటూ రాజాని పక్క గదిలోకి వెంటబెట్టుకు వెళ్ళారు జీవనాథ్.

అప్పుడే—

"చుక్ .... చుక్ .... చుక్ .... చుక్"మంటూ దయ్యాల బండి వస్తున్న శబ్దం వినిపించింది దూరాన.

"టంగ్ .... టంగ్ .... టంగ్" గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

గదిలో వున్న రాజా నిలువునా వుద్రేకంతో వూగి పోసాగాడు.

కాని—

స్వామీ జీవనాథ్ యెదురుగా ఆ బాలుని శరీరంలో యెలాంటి వికృతి వికారాలు కలగలేదు.

రాజాలోని ఉద్రిక్తతని గమనించారు జీవనాథ్.

కళ్ళు మూసుకొని త్రికాలజ్ఞానాన్ని అవలోకించారు.

ఆయన మనసు పొరలో సినీ రీలులా—

భూత ....

భవిష్యత్ ....

వర్తమాన కాలాలు గిర్రున కదలాడాయి.

అంతే!

ఆయన వదనం వుద్రిక్తమయింది.

"దుర్మార్గులు .... దుష్టులు ... నికృష్టులు" అని ఎవరినో

ఆయన మనసులోనే అసహ్యించుకున్నారు.

కళ్ళు తెరిచి రాజుని చూశారు.

"ఇలారా బాబూ!" అంటూ రాజుని దగ్గరగా తీసుకున్నారు.

"చేసెడివాడు ఆ శివుడే! చేయించెడివాడూ ఆ శివుడే! దుష్టశిక్షణ తప్పదు. అది జరిగితీరవలసిందే!" అని స్వగతంగా అనుకున్నారు.

రాజు అప్రయత్నంగా రెండు చేతులూ యెత్తి ఆయనకు నమస్కరించాడు.

కొంచెంసేపు తరువాత గదిలోంచి ఇద్దరూ బయటకు వచ్చారు.

"మీ బాబుకి పట్టిన దయ్యాన్ని వదలగొట్టాను. ఇంకేం ఫరవాలేదు" అని దామోదర్‌తో చెప్పారు స్వామీ జీవనాథ్.

ఆ తరువాత వెనక్కి తిరిగి చూడకుండా—

"శివోహం."

"శివోహం."

"శివోహం."

—అని తనలో తాను ఉచ్చరించుకుంటూ వడివడిగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయా రాయన.

## 8

"టంగ్ ....టంగ్ ....టంగ్ ...." గోడ గడియారం పదకొండు గంటలు కొట్టింది.

నిద్రలో వున్న కవిత బెడ్ మీద కదిలింది.

లేచి నిలబడి బాత్‌రూమ్ వైపు అడుగులు వేసింది.

అప్పుడే బాత్‌రూమ్ తలుపులు తోసుకొని రాజా బయటకు వచ్చాడు.

"ఏం బాబూ! బాత్ రూమ్‌కి వచ్చావా?" అడిగింది కవిత.

"అవును" అంటూ అదోలా నవ్వాడు రాజా.

అలా నవ్వుతూనే నోరు బాగా వెడల్పుగా తెరిచాడు.

నోట్లో నాలుగు పైపులా కోరలు మొలుచుకొచ్చాయి.

కనుగుడ్లు బయటికి వెళ్ళుకొచ్చాయి. అవి ఎర్రగా గోళాల్లా మండుతున్నాయి.

అంతే!

కవిత గుండె ఝల్లుమంది.

నరాలు వణకసాగాయి.

తనువు కంపించసాగింది.

రక్తప్రసరణ చల్లగా అయిపోతోంది.

రాజా "హీ....హీ....హీ" అని నవ్వుతూ కుడిచెయ్యి ముందుకు జాపాడు.

ఆ చెయ్యి పొడవుగా సాగుతూ కవిత ముఖంమీదికి రాసాగింది.

ఆమె వెనక్కి పారిపోవాలని కూడా పారిపోలేక పోతోంది. పాదాలు బలంగా నేలకు అతుక్కుపోయాయి.

రాజా చెయ్యి పొడవుగా సాగి కవిత ముఖాన్ని తాకింది.

"కెవ్వు"మని గావుకేక పెట్టింది కవిత.

ఒంట్లో సత్తువనంతా కూడదీసుకొని ఒక్క అంగలో వెనక్కి తిరిగి పరిగెత్తుకుంటూ బెడ్ రూమ్‌లోకొచ్చి పడింది.

ఆమె వేసిన గావుకేకకు ఉలిక్కిపడి నిద్రలేచాడు దామోదర్.

"ఏమయింది కవితా? ఎందుకా ఖంగారు? ఏమిటా

వణుకుడు?" ఆతృతగా అడిగాడు దామోదర్.

"దెయ్యం. రాజుని ఆ దయ్యం వదల్లేదు. మళ్ళీ అలాగే కనిపించాడు" అంటూ భయంగా చెప్పింది కవిత.

"వాట్?" ఆశ్చర్యపోయాడు దామోదర్.

"అవును దామోదర్! రాజు మళ్ళీ అదే రూపంతో కనిపించి నన్ను భయపెట్టాడు" వణుకుతూ అంది కవిత.

"స్వామీ జీవనాథ్ మరి ఆ దయ్యాన్ని వదలగొట్టానని చెప్పాడే!" ఇప్పుడు మళ్ళీ అలా కనిపించడం యెలా సాధ్యమౌతుంది?" ఆశ్చర్యంగా అన్నాడు.

"బహుశా—అతని శక్తికూడా పనికిరాలేదేమో!" అంది కవిత.

"జీవనాథ్ సామాన్యమైన మహిమగలవాడు కాదు. అతను అసాధారణమైన మహిమావంతుడు. అతడు పిలిస్తే భగవంతుడే పలుకుతాడని అనుకుంటారంతా! అలాంటి వాడి మహిమ రాజుమీద పనిచేయకపోవడమంటూ వుండదు. బహుశా నువ్వు భ్రమపడి వుంటావు. ఏదీ నేను చూసి వస్తాను" అంటూ దామోదరర్ బాత్‌రూమ్‌వైపు అడుగులు వేశాడు.

బాత్‌రూమ్ దగ్గర రాజు ఇంకా నిలబడి వున్నాడు.

దామోదర్‌ని చూడగానే క్రూరంగా నవ్వాడు.

నోట్లో కోరలు మొలుచుకొచ్చాయి.

కనుగుడ్లు బయటకు వెళ్ళుకొచ్చాయి. అవి ఎర్రగా గోళాల్లా మండుతున్నాయి.

కుడిచెయ్యి ముందుకు చాపాడు రాజు.

ఆ చెయ్యి పొడవుగా సాగుతూ దామోదర్ ముఖం మీదికి రాసాగింది.

దగ్గరకు వచ్చి అతని ముఖాన్ని తాకింది.

దామోదర్ గజగజ వణికిపోతూ ఒక్క గావుకేక పెట్టి పరుగున బెడ్ రూమ్‌లోకొచ్చి పడ్డాడు.

"కవితా! నువ్వన్నది నిజం! జీవనాథ్ మహిమ రాజా మీద పనిచేయలేదు. రాజాని ఇంకా ఆ దయ్యం పట్టుకుని వదల్లేదు" వగరుస్తూ అన్నాడు దామోదర్.

"అయితే, ఇప్పుడేం చేద్దాం?" అయోమయంగా అంది కవిత.

"ఇక వాడొక్కటే మార్గం తోస్తోంది రాజాని చంపేయాలి. లేకపోతే వాడిని ఆవహించిన దెయ్యం మనల్ని బలిగొంటుంది" అన్నాడు దామోదర్.

"ఏమిటీ? రాజాని చంపేయాలా?" ఆశ్చర్యంగా అడిగింది కవిత.

"అవును, వాడిని చంపేయాలి. రాజాని యేదో పెద్ద భూతమే ఆవహించి వుంటుంది. స్వామి జీవనాథ్‌లాంటి వాడి శక్తికూడ దానిముందు చాలేదంటే ఇప్పుడు రాజాని హతమారిస్తేగాని వాడిని పట్టిన దెయ్యం మనని వదిలి పెట్టదని నా అభిప్రాయం" అని చెప్పి "నువ్వేమంటావ్?" అని అడిగాడు దామోదర్.

కవిత ఆలోచనలో పడింది.

ఎంతైనా రాజా తన కొడుకు.

ఇలాంటి భయంకర విపత్తులో కన్న తండ్రిగా దామోదర్‌కు ప్రేమ చచ్చిపోవచ్చు!

కాని—

తను వాడిని తొమ్మిది మాసాలు మోసి కంది.

రాజాని చంపేయడమా?

ఒప్పుకోవాలా? వద్దా?

"ఏమంటావ్ కవితా?" మళ్ళీ అడిగాడు దామోదర్.

కవిత యేదో అనబోయేలోగా—

ఇంతలో బెడ్‌రూం గుమ్మం ముందు ప్రత్యక్షమయ్యాడు రాజా.

"హీ....హీ....హీ" అంటూ నవ్వాడు.

ఇద్దరూ వెనుదిరిగి చూశారు.

రాజా పళ్ళలో కోరలు అలాగే వున్నాయి. కనుగుడ్లు బయటికి వెళ్లుకొచ్చి ఎర్రగా సూర్యగోళాల్లా అలాగే మండుతున్నాయి.

చెయ్యి పొడవుగా ముందుకు చాపి నిలబడి వున్నాడు.

దామోదర్, కవితలకు వణుకు పుట్టుకురాసాగింది.

గజ గజా వణికిపోసాగారు.

ఈసారి రాజాని చూడగానే కవితకు ఇలా అనిపించింది.

వాడు బహుశా దెయ్యంపిల్లవాడయ్యుంటాడు! ఇలాంటి వాడిని కొడుకుగా కళ్ళముందు జీవితమంతా పెట్టుకొని భరించేకంటే చంపేయడమే మేలు....అని అనుకుంది.

"దామూ! ఐ కాంట్ సీ హిమ్ లైక్ దిస్! కమాన్! కిల్ హిమ్! కిల్ హిమ్! షూట్ హిమ్! ఐ సే!" అంటూ కళ్ళు మూసుకొని గట్టిగా అరిచింది.

దామోదర్ ధైర్యం తెచ్చుకొని పక్కనే వున్న డ్రస్సింగ్ టేబుల్ సొరుగు తెరచి, రివాల్వర్ బయటికి తీశాడు.

రాజాకి గురిపెట్టి కాల్చాడు.

"ఢిష్యూ" అంటూ బులెట్ రాజా గుండెల్లోనుంచి దూసుకుని అవతలికి వెళ్ళిపోయింది.

కాని—

రాజుకి యేమీ అర్థం కాలేదు.

చెక్కు చెదరకుండా అలాగే నిలబడి వున్నాడు.

"హ్హా...హ్హా...హ్హా...హ్హా" అంటూ పగలబడి నవ్వాడు.

ఈసారి ఆ నవ్వు బాలుని గొంతులా లేదు.

బొంగురుగా కంఠస్వరం మారింది.

"కన్న కొడుకని కూడా మమకారం లేకుండా నన్ను చంపాలని చూశారు కదూ!?....హ్హా....హ్హా....హ్హా....హ్హా" అంటూ మళ్ళీ పగలబడి నవ్వాడు రాజు.

దామోదర్ కవితలు వణికిపోతూ రాజునే చూడసాగారు.

వాళ్ళకి నోట మాట రావటంలేదు.

వణుకుతూ నిలువుగుడ్లు వేసుకొని అలాగే ఉండిపోయారు.

"నేటికి మీ పాపం పండింది. ఈరోజుతో మీ పని సరి. హీ..హీ..హీ..హీ" అంటూ మరింత వికృతంగా నవ్వాడు రాజు.

"రాజా" భయంగా ఇద్దరూ ఒకేసారి పిలిచారు.

"ఇంకా మీరు నేను రాజుననే అనుకుంటున్నారా? నేను ఎవరినో నా కంఠం మీరు ఇంకా గుర్తించలేదా?" అంటూ మళ్ళీ బొంగురుగా అన్నాడు రాజు.

అవును.

ఆ కంఠస్వరం వాళ్ళిద్దరికి యెక్కడో విన్నట్టుగా అనిపించింది.

ఆ స్వరం పదే పదే వాళ్ళ గుండెల్లో ప్రతిధ్వనించింది. వాళ్ళ నరనరాన్ని ఆ కంఠస్వరం బొంగురుగా అరుస్తూ కంపింపజేస్తోంది.

ఆ కంఠస్వరం...

ఆ కంఠస్వరం...

ఆ ఇద్దరి కళ్ళముందు గతం వీడియోలా గిర్రున తిరిగింది.

## 9

ఆ రోజు మార్కెట్టు బయట స్కూటరు పార్క్ చేసి లోపలికి వెళ్ళబోతుంటే —

"ఏరా సుధీర్ బాగున్నావా?" అన్న పలకరింపు విని పక్కకు తిరిగి చూశాడు సుధీర్.

ఎదురుగా తన చిన్ననాటి మిత్రుడు దామోదర్.

"అరేయ్ దామూ! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు" అంటూ మిత్రుడిని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు సుధీర్.

"ఇప్పుడేం చేస్తున్నావు నువ్వు?" అడిగాడు దామోదర్.

"'సుధీర్ టెక్స్‌టైల్స్' అని నా పేరుమీద దుకాణం నడుపుతున్నాను" అని చెప్పి "నువ్వేం చేస్తున్నావురా?" అడిగాడు సుధీర్.

దామోదర్ ముఖం విచారంగా మారిపోయింది.

"ఏం చెప్పమంటావు బ్రదర్? నాకు డిగ్రీ చేతికొచ్చాక ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. అమ్మ నాన్న మొన్ననే పోయారు. ఏ ఆస్తిపాస్తీ లేని నన్ను బంధువు లెవరూ చేరదీయలేదు. ఇలా బికారిగా వూళ్ళు పట్టుకు తిరుగుతున్నాను. ప్రస్తుతం నేను భోజనం చేసి మూడు రోజులైంది" బాధగా చెప్పాడు దామోదర్.

మిత్రుని కష్టానికి చలించిపోయాడు సుధీర్.

"అరెరే! ఎంత పనయింది!" అని నొచ్చుకొన్నాడు.

దామోదర్‌ని వెంటబెట్టుకుని సమీపంలోనే వున్న హోటల్‌కి తీసుకువెళ్ళాడు. కడుపునిండా టిఫిన్ పెట్టిం

చాడు.

"ఒరే దామూ! నాకు కావలసినంత ఆస్తి వుంది. నేను, నా భార్య తప్ప మాకు వెనకా ముందూ ఎవరూ లేరు. నీకు ఉద్యోగం వచ్చేదాకా మా బంగళాలో వుండు. నీకు యే లోటూ రాకుండా చూసుకుంటాను" అని చెప్పాడు దామోదర్ తో.

దామోదర్ కృతజ్ఞతగా చూశాడు మిత్రునివంక.

"నిజంగా నువ్వెంత మంచి స్నేహితుడివిరా!" అంటూ ఆరాధనగా అన్నాడు.

తరువాత సుధీర్ మార్కెట్ బయట పార్కు చేసి వున్న తన స్కూటర్ మీద దామోదర్ ని తన బంగళాకి తీసుకు వెళ్ళాడు.

అతనికి తన భార్య కవితని పరిచయం చేశాడు సుధీర్.

కవిత అందాన్ని చూసిన దామోదర్ దృష్టి మరల్చుకోలేకపోయాడు. అతని కన్ను కవిత మీద పడింది.

సుధీర్ కి బోలెడు ఆస్తిపాస్తులున్నాయి. తల్లిదండ్రులకు ఒకే ఒక్క సంతానం అతను. తల్లితండ్రి నాలుగు నెలల క్రితం కొద్ది రోజుల తేడాలో హఠాత్తుగా గుండె పోటుతో మరణించారు.

తల్లిదండ్రుల మరణం సుధీర్ ని క్రుంగదీసింది. చాలా రోజులు పిచ్చివాడిలా తిరిగాడు. తరువాత బంధువుల సలహాపై పెళ్ళి చేసుకోవాలనుకొన్నాడు. దూరపు బంధువులలో ఓ పేదింటి బంధువుల పిల్ల అయిన కవితని పెళ్ళి చేసుకొన్నాడు.

వాళ్ళ కాపురం అన్యోన్యంగానే సాగుతోంది.

సుధీర్ కవితలో తన తల్లిని చూసుకునేవాడు.

ఆమెని ఎప్పుడూ పేరు పెట్టి పిలిచేవాడు కాదు. "అమ్మా!" అని సంబోధించేవాడు.

చక్రాల్లాంటి కళ్ళు....కోటేరు ముక్కు .... పాము లాంటి జడ....నిశ్చలమైన నీటిమీద చిన్నరాయి వేస్తే చెలరేగే చిన్నచిన్న అలలు లాంటి నొక్కు నొక్కుల కురులు....బంగారు మేనిచ్ఛాయ....ఎక్కడ వుండవలసిన సొంపుసొంపులు అక్కడవుండి ఆమె అందం చూపరుల దృష్టిని చెదరగొడుతుంది.

ఆమె అంటే సుధీర్ కి ఎంతో యిష్టం ఆమె ఎదమీది ఎత్తైన ఆమె పిరమిడ్లంటే అతనికి మరీ యిష్టం. యెప్పు డైనా అతను అలసిపోయి యింటికి వచ్చినప్పుడు వాటి మధ్య తల పెట్టుకుని ఆమెమీద సేదతీరేవాడు.

రోజులు గడుస్తున్నాయి.

సుధీర్ ఉదయమే టెక్స్టైల్ దుకాణానికి వెళ్ళే వాడు. మధ్యాహ్నం ఇంటికి వచ్చి, భోజనంచేసి, మళ్ళీ షాపుకి వెళ్ళిపోయేవాడు. తిరిగి రాత్రి పదిగంటలకి ఇంటికి వచ్చేవాడు.

సుధీర్ లేని సమయంలో ఆ బంగళాలో కవిత, దామోదర్ ....ఇద్దరే వుండేవాళ్ళు!

భర్త స్నేహితుడని కవిత అతనితో చనువుగా మాట్లా డేది. ఆ చనువు ఆసరాగా తీసుకుని దామోదర్ ఆమెతో మరింత చనువుగా మెలిగేవాడు. మాటలలో వుండి వుండి తరచుగా ఆమె శరీరాన్ని తాకేవాడు. కవిత కూడా క్రమక్రమంగా అతని యెడల ఆకర్షితురాలైంది.

ఒకరోజు అవకాశం చూసుకుని దామోదర్ ఆమెని కౌగలించుకున్నాడు. కవిత అభ్యంతరం చెప్పలేదు.

భర్తకి ద్రోహం చేస్తున్నాననే ఆలోచన కూడ ఆమెకు కలగలేదు. పైగా సరింత తమకంగా అతనిని హత్తుకు పోయింది.

పాపం! అమాయకుడైన సుధీర్ దామోదర్ మంచి వాడనే అనుకొంటున్నాడు.

కవిత నిజంగా ఆమె ప్రేమతో తన తల్లి నే మరిపిస్తోం దని నమ్మాడు. "అమ్మా! అమ్మా!" అని పిలుస్తూ ఆమె కూడా కూడా తిరిగేవాడు.

ఓ రోజు కవిత సుధీర్ తో—

"ఏమండీ నేను నెలకప్పాను. మీరు తండ్రి కాబో తున్నారు!" అని చెప్పింది.

"హిప్ ....హిప్ ....హుర్రే!" అంటూ ఎగిరి గంతే శాడు సుధీర్.

అతని ఆనందానికి మేర లేకపోయింది.

కవితను తన కౌగిలిలో బంధించి గిరగిరా తిప్పేశాడు.

"పిచ్చి మొగుడు" అని అనుకుని కవిత తనలో తాను ఆదోలా నవ్వుకొంది.

ఆ రోజు సుధీర్ ఉదయమే షాపుకు వెళ్లాడు.

ఓ గంట గడిచేసరికి అతనికి భరించలేని తలనొప్పి పట్టుకుంది. వెంటనే స్కూటర్ మీద బంగళాకి వెనుదిరిగి వచ్చేశాడు.

మేడ మెట్లు యెక్కి బెడ్ రూమ్ దగ్గరకు వచ్చాడు.

తలుపులు దగ్గరగా వేసి వున్నాయి.

లోపలినుంచి యేవో మాటలు వినబడుతున్నాయి.

ఆ ప్రయత్నంగా అక్కడే ఆగిపోయాడు సుధీర్.

తలుపు సందుల్లోంచి కుతూహలంగా లోపలికి తొంగి చూశాడు.

"దామూ! నీ లాంటి మగాడి పొందు దొరకడం నిజంగా నా అదృష్టం" పరవశించిపోతూ అంటోంది కవిత.

"నీలాంటి అందమైన ఆడది ఇంత సులభంగా నాకు లొంగిపోవడం నిజంగా నాదీ అదృష్టమే" ఆమె చెక్కిళ్లు ముద్దు పెట్టుకుంటూ అంటున్నాడు దామోదర్.

"ఆగలేను దామూ! తొందరగా ఆక్రమించుకో" అంటోంది కవిత ఆతృతగా.

"మొదలు పెడుతున్నారు" అంటూ ఆమె చీరలాగేసి ఆవేశంగా లంగా బొందు తెంపేశాడు దామోదర్.

అంతే!

సుధీర్ నిలువునా వుద్రేకంతో వూగిపోయాడు.

ఇద్దరినీ నరికి పోగులు పెట్టా లనిపించింది.

కాని—

వెనువెంటనే అతని ఉద్రేకం చల్లారిపోయింది. దాని స్థానే మనసులో ఉవ్వెత్తున బాధాతరంగాలు సాగర కెరటాల్లా ఎగిసెగిసి పడ్డాయి.

'ఛీ! ఇది భార్యా? వీడు మిత్రుడా?...హు...నమ్మక ద్రోహులు.'

తను కవితని యెంతలా ప్రేమించాడో!

ఎంతలా ఆరాధించాడో!

కవితలో భార్యకంటే తల్లినే చూసుకున్నాడు తను. కాని ఏం చేసిందది?

వీడు—యేమీ లేనివాడని ఆశ్రయమిస్తే తిన్నింటి వాసాలే లెఖ్ఖపెట్టాడు కృతఘ్నుడు!

గదిలోపల జరుగుతున్న నగ్న మోసాన్ని తిలకించలేక తల పక్కకి తిప్పుకున్నాడు.

"ఏయ్ దామూ! యేమిటిది? అబ్బ! అమ్మ!" అంటూ లోపలినుంచి కవిత మూల్గులు వినిపిస్తున్నాయి.

సుధీర్ హృదయం భగ్గున మండుతోంది.

మనస్సు బాధగా మూల్గింది.

"దామూ! నా పిచ్చి మొగుడు ఈ కడుపు వాడివల్లే వచ్చిందనుకుంటున్నాడు. కాని నీవల్ల వొచ్చిందని వాడికి తెలీదు పాపం!" అంటోంది కవిత.

ఆ మాటలు సుధీర్ చెవుల్లో శూలాల్లా గుచ్చుకున్నాయి.

హృదయం ఆవేదనతో చితికిపోయింది.

పిచ్చిగా జుత్తు పీక్కున్నాడు.

'ఏం చేయాలి? ఇప్పుడు నేనేం చేయాలి?' తనలో తనే ప్రశ్నించుకున్నాడు.

ఎందుకో ఆ సమయంలో అతని మనసు స్తబ్దుగా అయిపోయింది.

జరిగినది ఎలాగూ జరిగిపోయింది. ఇప్పుడు తను వగచి లాభంలేదు. వుద్రేకపడి కవితని, దామోదర్‌ని బయటికి నెట్టేసే తనకే తలవంపులు. ఫలానా వాడి పెళ్ళాం ఫలానా వాడితో లేచిపోయిందని నలుగురిలో తనకే తలవంపులు. అందుకే కష్టమైనా, సుఖమైనా, బాధైనా, బరువైనా ఈ బడబాగ్నిని తనలోనే దాచుకోవాలి. ఈ జీవన నావని ఇలాగే నెట్టుకు రావాలి!

ఒక నిర్ణయానికి వచ్చాడు సుధీర్.

గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

సుధీర్ తన బాధని మనసులో దాచుకోలేక, బయటికి వెళ్ళగక్కనూ లేక తనలోతానే సతమతమవసాగాడు. అతనికి జరిగిన అన్యాయం జ్వాలలా బాధతో గుండెను

దహించివేస్తోంది.

ఫలితంగా తాత్కాలికోపశమనం కోసం తాగుడు అలవాటు చేసుకున్నాడు.

రోజూ షాపు మూసేయగానే తాగి స్కూటరుమీద ఇంటికి రావడం ప్రారంభించాడు.

ఆ రోజు కూడా—

యథావిధిగా షాపు కట్టేసి బార్ కి వెళ్ళాడు సుధీర్.

బాగా తాగి రాత్రి పదకొండు గంటల సమయంలో బంగళా చేరుకున్నాడు.

ఆవరణలో స్కూటర్ పార్కు చేసి బంగళా మెట్లెక్కి బెడ్ రూమ్ లోకి ప్రవేశించాడు.

ఎదురుగా కవిత, దామోదర్ లు నిలబడి వున్నారు.

"హలో దామూ! హలో కవితా!" అని పలకరించి పక్కనే వున్న కుర్చీలో కూర్చున్నాడు.

దామోదర్ అదోలా క్రూరంగా చూశాడు.

కవిత పెదాలపైకూడా ఒక వికృతమైన చిరునవ్వు చిందింది.

"సుధీర్! నిన్ను చంపేయాలనుకుంటున్నాము" అన్నాడు దామోదర్.

"జోక్ చేస్తున్నారా?" నవ్వుతూ అడిగాడు సుధీర్.

"కాదు, నిజమే!" బిగ్గరగా అంది కవిత.

సుధీర్ వాళ్ళ వంక నిర్వికారంగా చూశాడు.

"నేను మీకేం అపకారం చేశాను?" అడిగాడు నవ్వుతూనే.

"నీకు తెలియని నిజం ఒకటి వుంది. అది నీకిప్పుడు చెప్పాలనుకుంటున్నాము. కవిత, నేను ఒకరికొకరం దగ్గరయ్యాము. ఆమె నన్ను వదిలి వుండలేక పోతోంది.

నేను ఆమెని వదలి వుండలేక పోతున్నాను" అంటూ చెప్పాడు దామోదర్.

సుధీర్ పేలవంగా నవ్వాడు.

"అది నాకు తెలుసు" అన్నాడు.

"అందుకే నిన్ను అంతం చేద్దామనుకుంటున్నాము" అన్నాడు దామోదర్.

అసలే డ్రింక్ చేసి వున్నాడేమో!....సుధీర్‌లో మందు మత్తు అప్పటికే మరింత ఎక్కువై కుర్చీలో సరిగా కూర్చో లేకపోతున్నాడు. అటూ ఇటూ ఒరిగిపోతున్నాడు.

దామోదర్ సుధీర్ భుజాలు వడిసి పట్టుకున్నాడు.

కవిత లోపలినుండి పాడవాటి తాడు తీసుకొచ్చింది.

ఇద్దరూ కలిసి కాళ్ళు చేతులు తాడుతో కట్టేశారు. నోటికి టేప్ అంటించారు.

మందు మత్తులో వున్న సుధీర్ వాళ్ళని ప్రతిఘటించ లేకపోయాడు.

అప్పుడే —

"కూ ...." అంటూ దూరాన కూత వినిపించింది.

"చుక్ .... చుక్ ... చుక్ .... చుక్ ...." మంటూ దయ్యాలబండి వస్తున్న చప్పుడు వినిపించింది.

గోడ గడియారం "టంగ్ ...టంగ్ ....టంగ్" మని పన్నెండు గంటలు కొట్టింది.

నేలమీద అచేతనంగా పడివున్న సుధీర్‌ని చూసి "సుధీర్! అదిగో దయ్యాలబండి వస్తున్న కూత వినిపి స్తోంది ఆలకించావా? ఇప్పుడు నిన్ను మోసుకెళ్ళి ఆ పట్టాలమీద పడేస్తాము. కాసేపట్లో దయ్యాలబండి ఇటు వైపుగుండే వెళుతుంది. అప్పుడు ఆ బండిచక్రాలక్రింద నీ శరీరం ముక్కలవుతుంది. నామరూపాలు లేకుండా

పోతుంది. తరువాత సమాజాన్ని నీది ఆత్మహత్య అను కునేలా నమ్మిస్తాం. ఆ తరువాత కవిత, నేను ఆనందంగా హాయిగా వుంటాం" అంటూ ప క ల బ డి నవ్వాడు దామోదర్.

సుధీర్‌లో చావు భయం తొంగి చూసింది.

అతడిని భుజంమీదికి ఎత్తుకొని బంగళా బయటికి వచ్చాడు దామోదర్.

కవిత అతనిని అనుసరించింది.

"కూ... చుక్... చుక్.... చుక్... చుక్" దయ్యాల బండి శబ్దం కొద్దిగా దగ్గరయింది.

ఆ బండి చప్పుడు ప్రాణభయంలో సుధీర్ గుండెల్లో దడపుట్టిస్తోంది.

బస్తాలో అచేతనంగా వున్న అతను ఇంకా "రక్షిం చండి...రక్షించండి" అని అరుస్తూనే వున్నాడు కాని అతని పెదాలమీద ప్లాస్టరు ఆ అరుపులని నిరోధిస్తోంది. అతని గావుకేకలు బయటికి రాలేక తనువులోనే నర నరాన ప్రతిధ్వనిస్తున్నాయి.

దామోదర్, కవిత రైలు కట్ట దగ్గరకు వచ్చారు.

సుధీర్‌ని పట్టాలమధ్య పడేశారు.

"చుక్... చుక్.... చుక్..." దయ్యాలబండి దగ్గరవు తోంది.

సుధీర్ భయంతో మరణ వేదన పడసాగాడు.

"ఓ! భగవంతుడా నన్ను కాపాడు" కనిపించని దేవుడిని చివరిసారిగా ప్రార్థించుకున్నాడు.

"సుధీర్! దెయ్యాల బండి దగ్గరవుతోంది. ఇక నీ పని అవుట్!" అంటూ పకపకా నవ్వాడు దామోదర్.

అతని నవ్వులో కవితకూడా పకపకమని శృతి కలిపింది,

ప్రాణభయంతో వణికిపోతున్నాడు సుధీర్.

"చుక్...చుక్...చుక్. చుక్" దయ్యాలబండి బాగా దగ్గరవుతోంది.

"కూ..." అంటూ భయంకరంగా కూత పెడుతోంది.

కవిత, దామోదర్ లు పగలబడి నవ్వుతున్నారు.

"మిత్ర ద్రోహీ! భర్తృ ద్రోహీ! ఇంతకు ఇంతా అనుభవిస్తారు" చివరిసారిగా వాళ్ళని మనసులోనే శపించాడు సుధీర్.

అతని కళ్ళనుండి ఆవేశంగా కన్నీరు కారుతోంది.

అంతే!

"కూ..." అని కూత వేస్తూ—

"టక...టక...టక...టక...టక. .టక..." మంటూ దయ్యాలబండి సుధీర్ మీదనుండి వెళ్ళిపోయింది.

ఆఖరుసారిగా అతను వేసిన "అమ్మా" అనే భయంకరమైన కేక అతనితోనే గాలిలో సమాధి అయిపోయింది.

అతని తనువు చక్రాలక్రింద తుత్తునియలై పోయింది.

తరువాత—

సమాజం అతనిది ఆత్మహత్య అనుకుంది.

సుధీర్ ఆస్తి కవిత పరమైంది.

సుధీర్ కి వున్న స్కూటర్ ని అమ్మేసి జీప్ కొన్నాడు దామోదర్.

"సుధీర్ టెక్స్ టైల్స్" అని వున్న సుధీర్ బట్టల దుకాణం "దామోదర్ టెక్స్ టైల్స్" గా మారింది.

## 10

గతమంతా కళ్ళముందు గిర్రున తిరగ్గా వర్తమానం లోకి వచ్చారు దామోదర్, కవిత.

రాజు క్రూరంగా వాళ్ళ నే చూస్తున్నాడు.

పళ్ళలో కోరలు అలాగే వున్నాయి.

కనుగుడ్లు బయటికి వెళ్ళుకొచ్చి ఇంకా అగ్నిశిఖల్లా అలాగే మండుతున్నాయి.

"అంటే...అంటే...నూ..ను...నువ్వు సుధీర్ వా?" దామోదర్ కవిత — ఇద్దరూ ఒకేసారి వణుకుతూ అడిగారు.

"అవును నేను సుధీర్ నే. మీరు నన్ను అన్యాయంగా, అకారణంగా, దారుణంగా చంపినందుకు నా ఆత్మ ఎంత గానో క్షోభించింది. అందుకే పగతీర్చుకోవడానికి మీ కొడుకుని ఆవహించాను. ఆనాడు మీరు నన్ను దెయ్యాల బండికింద పడేసినప్పుడు నే ననుభవించిన మరణవేదన ఇంకా నా గుండెల్లో ప్రతిధ్వనిస్తూ నా కళ్ళకి కట్టినట్టుగా కనబడుతోంది" అన్నాడు రాజు.

దామోదర్, కవిత నోట మాటరాక భయవిహ్వలులై అలాగే వుండిపోయారు.

"కూ..." దూరాన కూత వినిపించింది.

ఆ వెనుక నే—

"చుక్..చుక్...చుక్...చుక్.." మంటూ దెయ్యాల బండి వస్తోన్న శబ్దమయింది.

ఆ బండి చప్పుడు వాళ్ళ చెవులకు ఆ నిశ్శబ్ద నిశీధిలో కర్ణకఠోరంగా వినిపిస్తోంది.

గుండెలు భయంతో గుబగుబమని అదిరాయి.

"టంగ్..టంగ్..టంగ్" గోడగడియారం పన్నెండు గంటలు కొట్టింది.

రాజు వికటంగా నవ్వాడు.

ఆ నవ్వు బంగళా అంతా ప్రతిధ్వనించింది.

దామోదర్, కవిత నిలువునా వణికిపోసాగారు.

"నేటికి మీ పాపం పండింది. మిమ్మల్ని చంపేస్తాను" అన్నాడు రాజా.

వాళ్ళిద్దరూ ఓ క్షణం శిలాప్రతిమల్లా అలాగే వుండిపోయారు.

ఏం చేయాలో పాలుపోలేదు.

రాజా ఒక్కొక్క అడుగే వేసుకుంటూ వాళ్ళని సమీపించసాగాడు.

అలా అడుగులో అడుగు వేసుకుంటూ వాళ్ళకి అడుగు దూరం సమీపంలోకి వచ్చేశాడు.

ఆ ఇద్దరిలోనూ చావు భయం తొంగి చూసింది.

గిరుక్కున వెనుదిరిగి పరుగు అందుకున్నారు.

బంగళా బయటకు వచ్చి, ప్రహారీ గేటు దాటి, ఏక బిగిన పరుగులంకించుకున్నారు.

"కూ ...చుక్ ...చుక్ ...చుక్ ...చుక్" దెయ్యాలబండి వస్తోన్న చప్పుడు ఆ నిశ్శబ్ద నిశీధిలో భయంకరంగా వినిపిస్తోంది.

చెట్లు చేమలు దాటుకుంటూ అలాగే పరిగెట్టసాగారు వాళ్ళిద్దరూ.

అలా పరిగెడుతూనే రైలు కట్టదగ్గరకు వచ్చారు.

ఒగురుస్తూ ఇక పరిగెట్టలేక అలుపుతీర్చుకోడానికి ఒక్క క్షణం పట్టాలమధ్య ఆగారు.

భయపడుతూనే ఇద్దరూ వెనక్కి తిరిగి చూశారు.

వెనక రాజా తమని వెన్నంటుతున్న జాడ ఎక్కడా కానరాలేదు.

"హమ్మయ్యా!" అంటూ తృప్తిగా గాలి పీల్చుకున్నారు.

మళ్ళీ ముందుకు దృష్టిసాగించారు.

అంతే

ఇద్దరూ కెవ్వుమని ఒక్కసారిగా కేక పెట్టారు.

ఎదురుగా రాజు నిలబడి వున్నాడు!

కనుగుడ్లు సూర్యగోళాల్లా మండుతున్నాయి.

కోరలు బయటికి పొడుచుకొచ్చి కరకరమని శబ్దం చేస్తున్నాయి.

పట్టాలమధ్య దామోదర్, కవిత!

పట్టాల ఇవతలివైపు రాజు!

వాళ్ళు వేగంగా వెనక్కి తిరిగి అవతలకు పరిగెట్ట బోయారు.

కాని—వాళ్ళిద్దరికి కాళ్ళాడలేదు కాళ్ళు పట్టాలకు అంటుకుపోయాయి.

ఇక వాళ్ళకి పారిపోవడానికి అవకాశం లేదు.

"చుక్..చుక్. చుక్..చుక్" దయ్యాలబండి దగ్గరవుతోంది.

"సుధీర్! ప్లీజ్! నీకు దణ్ణం పెడతాము. మమ్మల్ని క్షమించి వదిలేయ్" వాళ్ళు దీనంగా వేడుకోసాగారు.

రాజు మాట్లాడలేదు

"ప్లీజ్ సుధీర్! మమ్మల్ని వదిలేయ్! వదిలేయ్" అంటూ వణికిపోతూ అరవసాగారు దామోదర్, కవిత.

రాజు వికటంగా నవ్వసాగాడు.

"చుక్..చుక్..చుక్...చుక్" దయ్యాలబండి బాగా సమీపంలోకి వచ్చేసింది.

"అంతే!—

"అమ్మా" అంటూ ఆఖరుసారిగా వాళ్ళిద్దరూ ఒకే

సారి వేసిన చావుకేకలతో పాటు "టక...టక...టక...టక" మంటూ చప్పుడు చేస్తున్న దయ్యాలబండి చక్రాల క్రింద వాళ్ళ తనువులు తుత్తునియలై పోయాయి.

కవిత, దామోదర్‌ల పాపం అంతటితో పండి పోయింది.

వాళ్ళ ప్రాణాలు అనంత వాయువుల్లో లీనమై పోయాయి..

రైలు కట్టపక్కన నిలబడి వున్న రాజా ముఖం ఇప్పుడు నిర్మలంగాను, ప్రశాంతంగాను వుంది.

—: అయిపోయింది :—

# బ్లూ ప్రింట్స్

'దీపిక'

లోనికి వస్తున్న చైతన్యను చూసి చదువుతున్న డాక్యుమెంటు ప్రక్కన పెట్టి,

"హల్లో చైతన్య హౌ ఆర్ యు?" అన్నారు ఇండియన్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్స్ డైరెక్టరు మలహోత్రా.

"ఫైన్ సార్" అని ఆయన యెదురుగానున్న కుర్చీలో కూర్చున్నాడు చైతన్య.

ఎప్పుడూ నెం. 1 అని సంబోధించే మలహోత్రా పేరు పెట్టి పలకరించాడు అంటే యేదో ముఖ్యమైన విషయం అయివుండాలి అనుకొన్నాడు చైతన్య.

"నువ్వు ఈ రోజు పరిస్తాన్ వెళ్ళాలి. ఆ దేశంలోని ప్రస్తుత రాజకీయ పరిస్థితి నీకు తెలిసే వుంటుంది."

"యస్ సార్! మాజీ అధ్యక్షుడ్ని సైనిక తిరుగుబాటులో తొలగించి జనరల్ అహ్మద్ తనే అధ్యక్షుడిగా ప్రకటించుకొన్నాడు. దేశంలో మార్షల్ లా

ప్రవేశపెట్టాడు.

మిలటరీ, సివిల్ సర్వీసులో కీలక పదవుల్లో వున్న యింతోమందిని మాజీ అధ్యక్షుకి వర్గం అని తలచి అరెస్టు చేయించాడు. వాళ్ళందరూ బ్రతికే వున్నారో, లేదో తెలీదు.

దేశంలో ఉవ్వెత్తున లేచిన నిరసన, ఆందోళన అలజడులను ఇనుప హస్తంతో అణగద్రొక్కాడు.

దేశంలో ఇంకా ప్రశాంత పరిస్థితి నెలకొనలేదు. సైనికులను అల్లరు జరిగినచోటికి పంపి, క్రొత్త ప్రభుత్వానికి మద్దతునిచ్చిన కొంతమంది పౌరులు, సంఘాలుగా యేర్పాటయ్యారు. అలాంటి పౌర సంఘాలకు రేవులు, విమానాశ్రయాలలో కాపలా కాచే బాధ్యత అప్ప చెప్పాడు...."

"గుడ్. ఈ రాత్రికే బయల్దేరాలి. ఎలా వెళతావు?"

"సరిహద్దు దాటి, దొంగతనంగా ప్రవేశించటమే మేలు" అన్నాడు.

"కరెక్ట్! ఇప్పుడా దేశంలోని పరిస్థితుల దృష్ట్యా అలా వెళ్ళడమే మేలు" అన్నాడు మలహోత్రా.

చైతన్య తల వూపాడు.

"పరస్తాన్ దేశపు రాజధానీ నగరం రాచీలో అలీ అనే ఆయన ఇంటిని నువ్వు చెప్పిన పౌర సంఘంలోని సభ్యులు ఆక్రమించారు. అలీ పరిస్తాన్‌నుంచి పారిపోయి ఇండియా వచ్చాడు. అతడికి భారత ప్రభుత్వం ఆశ్రయ మిచ్చింది.

అలీ ఇంటిలోని సేఫ్‌లో మన మిలటరీ రీసెర్చి లాబరేటరీనుంచి మాయమయిన అతి ముఖ్యమయిన బ్లూ ప్రింట్సు వున్నాయి.

అలీ ఇప్పుడు ఇక్కడే వున్నాడు. ఆ ఇల్లు ఎక్కడ

వుందో, సేఫ్ సెక్యూరిటీ లాక్ నెంబర్లు నీవు కావలసిన అన్ని వివరాలు 'అలీ'ని అడిగి తెలుసుకో. ఆ బ్లూ ప్రింట్సు యెలాగైనా తెచ్చే బాధ్యత నీది. యు కెన్ గో. గుడ్ లక్" అన్నారు మలహోత్రా.

చైతన్య సెలవుతీసుకొని మలహోత్రా గదిలోంచి బయటకు వచ్చాడు.

## 2

పరిస్తాన్ దేశపు రాజధాని రాచీ నగరం.

సాయంత్రం 6 గం॥ల సమయం.

ఆకాశం నిండా మబ్బులు దట్టంగా అలముకున్నాయి. ఏ క్షణంలోనైనా వర్షం పడేటట్లుగా వుంది.

మారు వేషంలోనున్న చైతన్య అలీ ఇల్లున్న వీధిలోకి వచ్చాడు. అలీ ఇంటిముందుగా వెడుతూ క్రీగంట చూసాడు.

అలీ ఇంటిముందున్న అరుగుపై నలుగురు యువకులు కూర్చుని వున్నారు. నలుగురి చేతుల్లోనూ రైఫిల్సు వున్నాయి.

ఓ కంట వాళ్ళని గమనిస్తూ చైతన్య ముందుకు వెళ్ళాడు. అలీ ఇంటి ప్రక్క ఇల్లు వదలి ఆ ప్రక్కనున్న ఇంటికి సమీపంగా ఆగి వీధి అంతా పరీక్షగా చూసాడు. తనని యెవరూ ఫాలో అవటంలేదని నిర్ధారణ చేసుకొని ఆ ఇంటి గేటు దగ్గర చేరగానే చేతిలోని అగ్గిపెట్టె క్రింద పడేసాడు. దాన్ని వంగితీస్తూ గేటులోంచి ఆ ఇంటిలోనికి చూశాడు.

ఒక అరవై సంవత్సరాల వృద్ధుడు గుమ్మంవద్ద కూర్చుని తనలోతనే యేదో పాడుకుంటున్నాడు. అతని చేతిలో చుట్ట ఆరిపోయి వున్నట్టుంది పొగ రావటంలేదు. అలీ

చెప్పిన బాబా ఇతనే అయ్యుంటాడనుకొని గేటుతీసి లోనికి వెళ్ళి ఆగాడు.

ఇంటిముందున్న తోట అంతా ఒకసారి పరిశీలించి ముందుకు కదిలాడు చైతన్య.

అపరిచిత వ్యక్తిని చూసి ఆ ముసలివాని భృకుటి ముడిపడింది. అతని చేయి ప్రక్కనే వున్న తువ్వాలు క్రిందున్న రివాల్వర్ పైకి వెళ్ళింది.

ఐ.బి.ఐ. లో టాప్ ఏజంట్ నెం 1 ఆ చర్య గమనించకపోలేదు.

"భయపడకు బాబా నేను మిత్రుడ్నే" అన్నాడు చైతన్య నవ్వుతూ.

"ఆగు" అని, "ఎవరున్నవ్వు?" అడిగాడు బాబా.

"అలీ పంపారు నన్ను!"

బాబాలో నమ్మకం కుదరలేదు.

చైతన్య తన వ్రేలికున్న ఉంగరంతీసి అందించాడు.

"ఇది అలీబాబు ఉంగరం. నీ చేతికి ఎలా వచ్చింది?" కోపంగా అనుమానంగా చూస్తూ అన్నాడు బాబా.

"బాబాకు చూపిస్తే నీకు అన్నివిధాల సహాకరిస్తాడు అని అలీ ఇచ్చారు నాకు" అన్నాడు చైతన్య.

"చేతులెత్తి లోపలికి రా" బాబా రివాల్వర్ చూపుతూ అన్నాడు.

చైతన్య భుజాలెగరేసి ఇంటిలోనికి నడిచాడు.

బాబా, చైతన్య వెనుక ఇంటిలోనికి వెళ్ళి తలుపు గడియపెట్టాడు. చైతన్య జేబులోంచి ఒక కవరుతీసి బాబా కాళ్ళ దగ్గర పడేటట్లుగా విసరి "అలీ నీకు వ్రాసిన ఉత్తరం" అన్నాడు.

చైతన్య నే ఓ కంట కనిపెడుతూ వంగి ఉత్తరంతీసాడు

బాబా చైతన్యను కూర్చోమని సైగ చేసి గదిలో మూలగా వున్న త్రాళ్ళు తెచ్చి చైతన్య రెండు చేతులు వెనక్కి విరిచి కట్టాడు.

చైతన్య ఇచ్చిన కవరులోంచి ఉత్తరం తీసాడు. పరిచయమయిన అలీ చేతివ్రాత చూడగానే బాబా ముఖంలో ప్రసన్నత చోటు చేసుకుంది. సాంతం చదివి, "నన్ను క్షమించు బాబు. ఈ దేశ పరిస్థితి నువ్వు చూశావుగా. ఎవరు మిత్రులో, ఎవరు శత్రువులో తెలియని పరిస్థితి. నీకు అన్ని విధాల సహకరించమని వ్రాసారు అలీ" అన్నాడు బాబా—చైతన్యను బంధించిన త్రాళ్ళు విప్పుతూ.

"ఫరవాలేదు. నీ పరిస్థితుల్లో నేనువున్నా అలానే ప్రవర్తిస్తాను" అన్నాడు చైతన్య బద్ధకంగా ఒళ్ళు విరచి.

"కాఫీ తెస్తాను" అని లోపలికెళ్ళాడు బాబా.

"బాబా ఒళ్ళంతా బడలికగా వుంది కొంతసేపు నిద్ర పోవాలి" అన్నాడు చైతన్య, బాబా ఇచ్చిన కాఫీ కప్పు అందుకొంటూ.

"అలాగే. మేడమీద గది సిద్ధం చేస్తాను" అన్నాడు బాబా.

కాఫీ త్రాగి మేడమీదకు వెళ్ళాడు చైతన్య. మెట్లు యెక్కగానే ఒక పెద్ద హాలు, కుడివైపుగా రెండు ఎడమ వైపుగా రెండు గదులు కన్పించాయి. ఒక్క గది తలుపు తప్ప తక్కిన గదుల తలుపులు అన్నీ గడియ పెట్టబడి వున్నాయి.

తలుపులు తెరచివున్న గదిలోకి వెళ్ళాడు చైతన్య. బాబా పరుపుపై దుప్పటి సరుదుతున్నాడు. "రా బాబు" అని "నువ్వు లేచే వేళకి భోజనం రెడీ చేస్తాను" అన్నాడు.

రెండు రోజులుగా నిద్ర అంటే తెలియదేమో మంచంపై వాలీవాలగానే నిద్రలోకి జారుకున్నాడు.

చిన్న అలికిడై కళ్ళు తెరిచాడు. ఆటోమాటిక్ గా చైతన్య చెయ్యి దిండు క్రిందున్న రివాల్వర్ పై పడింది.

"లేచావా చైతన్య. పదిగంటలయింది. భోజనం చేస్తావేమోనని అడగటానికి వచ్చాను. రా బాబు" అన్నాడు బాబా.

రెండు రోజులుగా తిండి కూడా సరిగ్గా లేదేమో అపురాపురమంటోంది కడుపు. తృప్తిగా తిని 'బ్రేవ్'మని తేన్చాడు చైతన్య.

హాల్లో సోఫాలో కూర్చుని సిగరెట్ వెల్గించాడు. బాబాకూడా భోజనం ముగించుకొని వచ్చాడు.

"బాబా ఇంక నువ్వు పడుకో. నేను ఇక్కడ కొంత సేపు కూర్చొని పోయి పడుకుంటాను" అన్నాడు చైతన్య.

బాబా తలూపి మెట్లప్రక్కగానున్న గదిలోకి వెళ్లాడు చైతన్య అక్కడే సోఫాలో కూర్చుని సిగరెట్టు మీద సిగరెట్టు కాలుస్తూ 12 గంటలు యెప్పుడు అవుతుందా అని సహనంగా యెదురుచూడసాగాడు.

## 3

గోడ గడియారం 12 గంటలు కొట్టింది.

హుషారుగా లేచి నిల్చున్నాడు చైతన్య. బాబా పడుకొన్న గదిలోకి వెళ్ళి చూశాడు. బాబా గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

మేడమీదకు వెళ్ళాడు. నీట్ గా మడతపెట్టి వున్న తన బట్టలు వేసుకున్నాడు.

రివాల్వర్ లో బులెట్స్ నిండుగా వున్నాయో లేదో పరీక్షించి. రివాల్వరును భుజానికి తగిలించి వున్న హోల్స

టర్‌లో వుంచి, కుర్చీకి తగిలించి వున్న జర్కిన్ ధరించాడు.

జర్కిన్ జేబులోంచి షో బటన్స్ ఆకారంలో వున్న రెండు పవర్‌ఫుల్ గ్రెనేడ్స్ నడుముకున్న బెల్టుకు పెట్టాడు.

పెన్ టార్చి బ్యాక్ పాకెట్‌లో పెట్టుకున్నాడు.

జర్కిన్ మరో జేబులోంచి దూదిలో చుట్టి వున్న చిన్న గాజు గొట్టం పగలకుండా వుందో లేదో పరీక్షించి తిరిగి జేబులో పెట్టాడు.

మరోసారి అన్నీ సరిగ్గా వున్నాయో లేదో చూసి కర్చీఫ్‌తో, తను ముట్టుకొన్న ప్రదేశాలన్నీ తుడిచాడు.

క్రిందకు దిగి వీధి గుమ్మం ప్రక్కనే విడిచిన రబ్బరు సోల్ షూస్ తొడుక్కుని వంటగదిలోకి వెళ్లాడు.

కుడివైపుగా వున్న అలమారులో నీట్‌గా పేర్చి వున్నాయి స్పూన్‌లు, కత్తులు వగైరా. తన అవసరానికి పనికొస్తుందని ఎంచి ఒక కత్తి తీసి దాన్నికూడా బ్యాక్ పాకెట్‌లో పెట్టుకుని హాలులోకి నడిచాడు.

హాలులో కూడా తన వేలిముద్రలు ఎక్కడా లేకుండా జాగ్రత్తగా తుడిచాడు.

ఇక అలీ ఇంట్లోకి ప్రవేశించాలి అనుకున్నాడు చైతన్య.

చప్పుడు చెయ్యకుండా వెనుక గుమ్మం దగ్గరకు వెళ్ళి తలుపు గడియతీసి తోటలోనికి వెళ్ళాడు. వర్షం జోరుగా కురవసాగింది. ఒక చెట్టుక్రిందకు వెళ్ళి ఆగాడు. చెవులు రిక్కించాడు. ఎటువంటి శబ్దం లేదు. తోటచుట్టూ కళ్ళతోనే ఒక మారు పరిశీలించి అనుమానాస్పదమైన కదలికగానీ అంశంగానీ లేవు అని తలచి చెట్ల మధ్యకు నడచి

ఫాస్ఫలం కన్పించి ఆగాడు.

ఒకేఒక క్రోటన్స్ మొక్క కన్పించి అలీ చెప్పిన చెప్పిన కొలతలు జ్ఞప్తికి తెచ్చుకొని క్రోటన్స్ మొక్క నుంచి ముందుకు 5 అడుగులు వేసి ఆగి, వంగి అక్కడున్న మట్టిలో చేతితో తట్టాడు. శబ్దం రాలేదు.

చైతన్యలో నిరుత్సాహం చోటుచేసుకుంది. అలీ చెప్పిన ప్రదేశం ఇదే. ఇక్కడే ఓ ఇనుప తలుపు వుందని చెప్పాడు మరి.

మట్టిక్రిందున్న ఇనుప తలుపు మరీ తట్టగానే తెలిసి పోయేట్లుంటే మీద మట్టి కప్పడమెందుకు అన్న ఊహ కలిగి నవ్వుకున్నాడు.

మోకాలిపై కూర్చుని మట్టిని తొలగిస్తూ గొయ్యి చేయసాగాడు. అలా అడుగు లోతున గొయ్యి చేయగానే చదునుగా చేతికి తగిలింది.

ఉత్సాహం తిరిగి చోటుచేసుకుంది. మట్టిని రెండు చేతులతో తీసి ప్రక్కనే పోయసాగాడు. వర్షం చినుకు కలిస్తోంది. తప్పదుగా. అలా అరగంట కష్టపడిన తరువాత రెండడుగుల పొడవు వెడల్పులతో కన్పించింది ఇనుప తలుపు. తలుపును మెల్లగా ఎత్తి ప్రక్కనే పెట్టాడు.

తుప్పుపట్టి వుందేమో 'కర్ర్'మని శబ్దం వచ్చింది. చైతన్య నరాలు బిగుసుకున్నాయి. ఆత్రంగా చుట్టూ చూశాడు. కటిక చీకటి. ఏం కన్పించడంలేదు, పెన్ టార్చితీసి వెలుగు చెట్లమీద మొక్కలమీద వేశాడు. ఆకుల కదలిక తప్ప మరేం కన్పించలేదు.

శబ్దం ఎవరికీ వినపడదు అనుకొని పెన్ టార్చి వెలుగు సొరంగంలోకి ఫోకస్ చేశాడు.

బూజులు, పట్లు పట్టి భయంకరంగా వుంది లోపలి

దృశ్యం. ఒక్కప్రక్కగా లోనికి దిగటానికి ఇనుపనిచ్చెన కనిపించింది.

చైతన్య ఒక్క క్షణం ఆలోచించి లేచి నిలబడి చేరువలో వున్న చెట్టుకొమ్మ ఒకటి విరచి చేతిలో పట్టుకొని నిచ్చెనమీదుగా సొరంగంలోకి దిగాడు.

రెండు మెట్లు దిగి చెట్టుకొమ్మతో దట్టంగా పేరుకున్న పట్లు తప్పించుకుంటూ సొరంగంలోకి నేలపై దిగాడు.

పెన్ టార్చ్ వెలుగులో జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు సాగాడు. సుమారు వంద అడుగులు వేసిన తరువాత ఇంకో ఇనుప నిచ్చెన కన్పించి ఆగాడు. తలెత్తి చూశాడు. ఏం కన్పించలేదు. టార్చ్ ఫోకస్ వేశాడు. ఇనుప తలుపు కన్పించి హుషారుగా నిచ్చెన ఎక్కాడు. ఇంకా 5 మెట్లు ఉన్నాయనగా చైతన్య తలకు తలుపు తగిలింది. ఆగాడు.

రెండు నిమిషాలు ఆగి నిచ్చెన మెట్టుపై బాలన్స్ చేసుకుంటూ నిచ్చెన సైడ్ గార్డ్‌ను పట్టుకున్న చేతినితీసి రెండు చేతులతో మూసుకున్న తలుపు ఎత్తాడు.

కదలలేదు. నీరసం చోటుచేసుకుంది. ఇంత కష్టం వృధాయేనా? అలీ ఇంటిలోకి వెళ్ళటానికి ఇంకో మార్గం వుందా? అలీ ఇంటికి కాపలా వున్న యువకులు అనుభవం లేనివాళ్ళలా కన్పిస్తున్నారు. అయినా వాళ్ళ చేతిలో రైఫిల్స్ వున్నాయి.

తనలో తాను అలా ఆలోచిసుండగా ఈ తలుపు మీదకూడా అడుగు మందాన మట్టి వుండాలన్న ఆలోచన వచ్చింది.

వెంటనే బాక్ పాకెట్ లోంచి కత్తితీసి వెలుగులో చూశాడు. కత్తి పిడికాక ఆరంగుళాల పొడవుమాత్రమే

వుంది. ఏం చెయ్యాలి. ప్రయత్నించడంవల్ల నష్టంలేదు అని తలచి కత్తిని తలుపుకి, తలుపు చుట్టూ వున్న ఫ్రేమ్‌కి మధ్యవున్న సన్నని చీలికలో దోపి చుట్టూ త్రిప్పుతూ మీదున్న మట్టిని తోసాడు. వర్షంలో తడిసిన మట్టి మెత్తగా తోసుకుంది.

తలుపును రెండుమూడుసార్లు గట్టిగా బలంగా మీదకు త్రోశాడు. కొద్దిగా కదిలింది. ఇంకా, బలమంతా ఉపయోగించి తలుపు ఎత్తాడు. మట్టిలో కలసిన నీరు అతని తలపై పడింది. తలుపు సాంతం ఎత్తి ప్రక్కన పెట్టి సొరంగంలోంచి బయటకు వచ్చాడు.

వర్షం కుంభవృష్టిలా కురవసాగింది. చెట్ల ఆకుల మధ్యగా ఆలీ ఇల్లు కన్పిస్తోంది. గేటువద్ద మాత్రమే లైటు వెలుగు కన్పిస్తోంది. మిగతా భాగం అంతా చీకటిగా వుంది. పరుగెత్తుకొని వెళ్ళి ఇంటి గోడవారగా ఆగాడు.

ఇంటి ముందునుంచి మాటలు స్పష్టంగా విన్పిస్తున్నాయి. హోల్‌స్టర్ నుంచి రివాల్వర్ తీసి ఇంటి ముందు భాగం వదలి ఇంటిచుట్టూ మెల్లగా నడుస్తూ పరీక్షించాడు. ఇంటి వెనుక కాపలా లేదు. ఇంటి ముందున్న వారిని తప్పించుకొని ఇంటిలోకి ప్రవేశించాలి.

చెట్ల వెనుకగా నడచి ఇంటిముందున్న కాంపౌండ్ వాల్ నీడలో నిలబడి చూశాడు.

అరుగుమీద కూర్చున్న ఆ నలుగురు యువకులూ బాతాఖానీ కొడుతూ విస్కీ సేవిస్తున్నారు. రైఫిల్స్ ప్రక్కన పడేసి వున్నారు. చాలా నిర్లక్ష్యంగా వున్నారు. నలుగురూ పరిసరాలు గమనించే స్థితిలో లేరు.

జేబులోంచి గాజా గొట్టంతీసి వారి మధ్యగా నేలపై

పరేట్లు విసిరాడు. ఆ గాజు గొట్టం నేలమీదపడి పగిలింది. అంతే....

ఆ గొట్టంలోని ఆసిడ్ గాలిలో కలసింది. ఆ గాలిని పీల్చిన నలుగురూ స్పృహతప్పి పడ్డారు. అంతా క్షణాలలో జరిగిపోయింది.

తెరచివున్న గేటు దగ్గరగా వేసి, స్పృహతప్పి పడివున్న ఆ నలుగురినీ సమీపించాడు చైతన్య. ఎవరిలోనూ చలనంలేదు.

మెల్లగా మెట్లు ఎక్కి గుమ్మం ప్రక్కగా నిల్చుని తలవంచి చూశాడు. ముందున్న హాలులో ఎవరూ లేరు. ఇంటిలోపల యెవరయినా వున్నారో లేదో తెలీదు. ధైర్యంచేసి ఇంటిలోనికి నడిచాడు. ఇల్లంతా వెతికి ఇంకెవ్వరూ లేరని నిర్ధారణ చేసుకున్నాడు.

సేఫ్ వున్న గదిలోకి వెళ్లాడు. గది తలుపు దగ్గరగా చేరవేశాడు. గది మధ్యలో సోఫాలు వాటి మధ్య టీపాయ్ యెదురుగానున్న గోడకు ఆరడుగుల అందమైన సీనరీ వున్నాయి.

గబగబా అడుగులువేసి ఆ సీనరీని సమీపించాడు. రెండు చేతులతో ఎత్తి ఆ సీనరీ ప్రక్కన పెట్టాడు. 3 అడుగుల పొడవు వెడల్పుతో ఐరన్ సేఫ్ దర్శనమిచ్చింది.

ఇంకేమాత్రం ఆలస్యం చేయకుండా—మోకాలుపై కూర్చుని సేఫ్ సెక్యూరిటీ లాక్ నెంబర్లు జ్ఞప్తికి తెచ్చుకొని డయల్‌లా వున్న చక్రాన్ని త్రిప్పాడు.

ఒక్కో నెంబరు త్రిప్పుతున్నప్పుడల్లా 'క్లిక్'మన్న శబ్దం విన్పించి చైతన్యలో ఉత్సాహం ఇనుమడించింది. ఆఖరి నెంబరు త్రిప్పి ఊపిరిబిగబట్టి సేఫ్ తలుపు మెల్లగా

లాగాడు. తెరుచుకొంది.

సేఫ్‌లో ఎదురుగా అమెరికన్ డాలరు కట్టలు పరిస్తాన్ దేశపు నోట్ల కట్టలు, బంగారపు నగలు, వజ్రాలు చాలా అమూల్యమైన సంపద వుంది.

చైతన్య దృష్టిని అవేవీ ఆకర్షించలేవు. అతని కళ్ళు సేఫ్ అంతా నిశితంగా గాలిస్తున్నాయి.

అమెరికన్ డాలర్ కట్టల క్రిందుగా సేఫ్‌లో మూలగా ఒక కవరు కన్పించి ఆత్రంగా కవరులోని కాగితాలు తీసి చూశాడు. అవే. తనకు కావలసినవే. హాయిగా సంతృప్తిగా నిట్టూర్చి జేబులో పెట్టుకొని నేలపై ఉంచిన రివాల్వర్ తీద్దామని వంగాడు.

అంతే....

## 4

"ఆగు" అన్న మాటలు విన్పించి గిరుక్కున వెనక్కు తిరిగాడు.

ఆరడుగుల మిలటరీ యూనిఫారంలో వున్న గడ్డపు వ్యక్తిని, అతని చేతిలో ఏ క్షణంలోనైనా నిప్పులు కక్కటానికి రెడీగా వున్న రివాల్వర్‌ను చూడగానే చైతన్య అదిరిపడ్డాడు.

"ఎవరున్నువ్వు?" అడిగాడా గడ్డపు వ్యక్తి.

"నేను .... నేను ...." కంగారు పడుతున్నట్లుగా భయాన్ని నటించాడు చైతన్య.

చైతన్య మెదడు కంప్యూటర్ కంటే వేగంగా ఆలోచించసాగింది. ఏ చిన్న అవకాశం దొరుకుతుందా, తప్పించుకుందామా అని మార్గాలు వెతుకుతున్నాడు.

చైతన్య ఉద్దేశాన్ని గ్రహించాడో లేక జాగ్రత్త కోసమో ఆ మిలటరీ యూనిఫారంలో వున్న వ్యక్తి

చిన్నగా విజిల్ వేశాడు. నలుగురు సైనికులు పరుగెత్తుకు వచ్చారు. నలుగురి చేతుల్లోని స్టెన్‌గన్స్ చూసి చైతన్య ఆటలు అడుగంటాయి.

ఒకడ్ని అయితే ఎలాగో దెబ్బతీయవచ్చు. నలుగురితో అందులోనూ ఆయుధాలతో వున్నవారితో, ఆ నలుగురు సైనికులు స్టెన్‌గన్స్ పట్టుకొన్న విధానం చూస్తుంటే సుశిక్షితులైన సైనికుల్లా వున్నారు.

నెమ్మదిగా రెండు చేతులూ పైకెత్తి పెట్టాడు.

"చెక్ చేయండి?" అన్నాడు ఆ గడ్డపు వ్యక్తి.

"యస్ కల్నల్" అన్నారు నలుగురూ ఒక్కసారిగా.

ఇద్దరు సైనికులు చైతన్య ఛాతీకి స్టెన్‌గన్స్ గురిపెట్టి నిల్చున్నారు, మిగిలిన ఇద్దరు చైతన్యను తడిమి ఒక కవరు కత్తి, పెన్‌టార్చ్, సిగరెట్ పాకెట్, సిగరెట్ లైటర్ అతని కాళ్ళవద్ద నేలపై పడివున్న రివాల్వర్ తీసి టీపాయ్ మీద పెట్టారు.

"ఆ జర్కిన్ కూడా విప్పివ్వు" అన్నాడు కల్నల్.

చెప్పినట్లు చేయటమే మంచిది. ప్రతిఘటన కోరి చావును ఆహ్వానించడమే అనుకొని జర్కిన్ విప్పి అందించాడు.

కల్నల్ జర్కిన్ అందుకొని సోఫాలోకి విసిరాడు.

"అలీ ఎక్కడ?" అనడిగాడు.

"అలీయా? అలీ ఎవరు?"

"బుకాయించాలని ప్రయత్నించకు. అలీ యేదో వాడు ఈ ఇంటికి తానుగానీ ఇంకెవరినైనాగానీ పంపిస్తాడని తెలుసు మాకు. అందుకోసమే వెయిట్ చేస్తున్నాం. కాపలా పెట్టాం." కల్నల్ అన్నాడు.

చైతన్య చిన్నగా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నావు. ఓహ్! అర్థమయింది. బాధ్యత, కర్తవ్యం అనుభవములేని ఆ నలుగురినీ కాపలా పెట్టాను నేగా నీ పరిహాసం. పొరపడ్డావు. ఈ ఇంటిలో ప్రవేశించేవారికి అనువుగా ఉండేటందుకే వాళ్ళని నియమించాం."

ఆశ్చర్యంగా చూశాడు చైతన్య.

"అర్థమవలేదా? అలీ ఈ ఇంటిని అర్ధాంతరంగా వదలి వెళ్ళిపోయాడు. అతను వట్టి చేతులతో వెళ్ళిపోయాడని తెలుసు. అలీ ఈ ఇంటిలో యెన్నో లక్షలు విలువచేసే నగలు, డబ్బు వదిలేసి పారిపోయాడు. అతనికోసం వెతుకుతున్నాం. మాకు కావలసినది అతని సంపద కాదు. ఇదిగో ఈ కవరు. ఇది మాకెంతో అవసరం. పటిష్టమైన కాపలా వుంటే అలీగానీ మరెవ్వరైనాగాని ఈ ఇంటిలోనికి ప్రవేశించటానికి సాహసిస్తారా? అందుకే ట్రాప్ వేసాం" కల్నల్ నవ్వుతూ అన్నాడు.

"ట్రాపా?"

"యస్ మై బాయ్ ఈ ఇంటి ఎదురుగా వున్న ఇల్లు వెనుకనున్న రోడ్డులోనూ ఐదరేసి సైనికులు కాపలా వున్నారు. ఆ నలుగురూ ఇదిగో వీళ్ళే. ఈ నలుగురూ యెంతో అనుభవం, శిక్షణ పొందినవాళ్ళు. మరి నువ్వు వాళ్ళని, వాళ్ళ కళ్ళని తప్పించుకుని ఈ ఇంట్లోకి యెలా ప్రవేశించావో అర్థంకావడంలేదు. నాలుగు తగిలిస్తే నువ్వే చెబుతావులే"

"డామిట్! ఛ! ఎంత ఫూలిష్‌గా ప్రవర్తించాను. అసలు ఆ సంగతే ఊహించలేదు" తనను తనే తిట్టుకున్నాడు చైతన్య.

"ఏదో చిన్న గాజు వస్తువు గాలిలో తేలి ఈ

ఇంటికి కాపలా వున్న ఆ నలుగురు యువకుల మధ్య పడటం, వెంటనే ఆ నలుగురూ స్పృహతప్పి పడటం, ఒక్క నిమిషం తరువాత నువ్వు ఈ ఇంటిలోకి ప్రవేశించటం అంతా మావాళ్ళు చూస్తూనే వున్నారు.

"నేను ఈ ఇంటిలోనికి ప్రవేశించి 5 నిమిషాలైంది. వెంటనే వచ్చి నన్ను అరెస్టు చెయ్యలేదేం. ఈలోపల నేను తప్పించుకు పారిపోతే?" చైతన్య అడిగాడు.

"మంచి ప్రశ్న. కావాలనే ఆలస్యం చేశాం. ఈ ఐరన్ సేఫ్ లాక్ నెంబర్లు మాకు తెలీవు. నిన్ను వెంటనే అరెస్టుచేసి, హింసించి నీచేత ఆ నంబర్లు చెప్పించవచ్చు. కానీ, నువ్వు మొండికేసి నిజం చెప్పకుండా మొరాయించావు అనుకో, ఇంకా క్రూర పద్ధతులు ఉపయోగించాల్సి వుంటుంది. ఆ ప్రయత్నంలో నువ్వు చచ్చిపోయావనుకో ఇంక ఆ సేఫ్ నెంబర్లు మాకు తెలిసే అవకాశం లేదు.

పై అధికారులతో తిట్లు తినాలి. అందుకే నీకు అవకాశం ఇచ్చి నీ చేతనే ఈ సేఫ్ ఓపెన్ చేయించటానికని ఆలస్యం చేశాం" అన్నాడు కల్నల్.

"ఆ సేఫ్‌ని మీరు తెరవాలంటే తెరవలేరా? ఇంకో మార్గమే లేదా?

"వుంది. చిన్న ఎక్స్‌ప్లోజివ్‌తో ప్రేల్చో, గ్యాస్ కటింగ్ చేసో తలుపు తెరవచ్చు. కానీ ఇక్కడో చిన్న ప్రమాదం వుంది. ఆ కవరు సేఫ్‌లోపలగా వుందో తలుపుకు దగ్గరగా వుందో తెలీదు. ఒకవేళ తలుపుకు దగ్గరగా వుందనుకో ఆ కవరు కాలిపోయే ప్రమాదం వుంది."

"అర్థమయింది" అన్నాడు చైతన్య.

కల్నల్ కవరుతీసి అందులోని కాగితాలు బయటకు లాగి చూశాడు.

"మై గాడ్. Z15 ఎంతో ఆధునికమైన మిస్సైల్ కేరియర్ ఇండియన్ శాస్త్రజ్ఞులు రూపొందిస్తున్నారు అని విన్నాను. నిజమేనన్న మాట?"

కల్నల్ భృకుటి ముడిపడింది.

"ఎవరు నువ్వు? నిజం చెప్పు. నువ్వు ఈ దేశ పౌరుడివి కావు. అవునా, కొన్ని లక్షలు విలువచేసే బంగారం, వజ్రాలు డబ్బు వదలి కేవలం ఈ కవరు మాత్రం తీసావంటే అర్థం యేమిటి? నువ్వు ఇండియన్ వి అయ్యుండాలి. లేకుంటే అలీయే ఈ కవరులోని కాగితాలు చూపి భారతదేశంలోనో మరేదేశంలోనైనా ఆశ్రయం సంపాదించడానికి చేసుంటాడు. చెప్పు. నిజం చెప్పు" అన్నాడు కల్నల్.

"నేను పరిస్తాన్ పౌరుడ్నే. నా పేరు అబ్దుల్. అతని పేరు అలీయే కావచ్చు మరోటి కావచ్చు ఈ ఇంటిలోని సేఫ్‌లో వున్న కవరు తెస్తే పాతిక వేలు ఇస్తానన్నాడు" అన్నాడు చైతన్య.

"స్టాప్. స్టాప్" అని పకపకా నవ్వాడు కల్నల్. "ఇంకెవరో అయితే నువ్వు చెప్పిన మాటలకు బోల్తా పడవచ్చు కానీ నేను మిలటరీ ఇంటలిజన్స్‌లో ఆఫీసర్నే. పాతిక వేలకోసం ప్రాణాలకు తెగించిన నువ్వు ఒక్క బంగారపు నగకూడా తీసుకోలేదు అంటే అర్థం" అన్నాడు కల్నల్.

"మీరు యేవేవో ఊహించుకుంటున్నారు, నా పేరు అబ్దుల్. నేను ఈ రాచీ నగరంలో పుట్టి పెరిగాను,

పరిస్థితులు ....."

"ఊఁ. చెప్పు. ఆ పేసా వేం? నువ్వు చిన్నప్పుడు చదువు కున్న బడి, ఆ బడిలో నీ క్లాసు రూంలో నీ బెంచీపై నువ్వు చెక్కిన నీ పేరు అన్నీ నిరూపించగలవు. నో డవుట్. నువ్వు ఎవరో యేమిటో క్షణంలో తేల్చేస్తాను" అని గది అంతా పరికించి "ప్రక్క గదిలోకి తీసుకు రండి" అన్నాడు.

టీపాయ్‌మీదున్న సిగరెట్ ప్యాకట్, కవరు, రివాల్వరు, సేఫ్‌లోంచి కవరు లాగుతున్నప్పుడు క్రింద పడ్డ అమెరికన్ వందడాలర్ల కట్టలు రెండూ చూస్తూ నిల్చున్నాడు చైతన్య.

"ఊఁ! పద" అని వెనుక నిల్చున్న సైనికుడు చైతన్యను బలంగా ముందుకు త్రోశాడు.

స్టెన్‌గన్‌తో పక్క టెముకలు పొడిచి ముందుకు తోశాడు సైనికుడు.

వెనుక ఇద్దరూ ప్రక్కగా ఇద్దరూ చైతన్యను కవర్ చేస్తూ ప్రక్క గదిలోకి తీసుకెళ్ళారు.

"గది మధ్యలో కెళ్ళి నిలబడు" అన్నాడు కల్నల్.

చైతన్య నెమ్మదిగా నిదానంగా అడుగులు వేస్తూ గది మధ్యలో కెళ్ళి నిల్చున్నాడు.

"అతనితో నిజం యెలా చెప్పించాలో తెలుసా మీకు?" సైనికుల నుద్దేశించి అన్నాడు కల్నల్.

"యస్ సార్" అన్నారు నలుగురూ ముక్త కంఠంతో.

"ప్రొసీడ్" అన్నాడు కల్నల్.

క్రూరంగా నవ్వుతూ ముందుకు అడుగు వెయ్యబోయారు ఇద్దరు సైనికులు.

చాలా వేగంగా ఆలోచించాడు చైతన్య.

"ఇంకొక్క క్షణం కూడా వృథా చెయ్యరాదు. తన మీద వాళ్ళ చేతులు పడకముందే సాహసించాలి. తిరిగి నిల్చునే శక్తి, అవకాశం రాకపోవచ్చు" అని మనసు లోనే అనుకొని "ఆగండి" అని అరిచాడు.

సైనికులు నలుగురూ సైన్‌గన్స్ ఎత్తిపట్టుకున్నారు. "చెప్తాను. నిజం చెప్పేస్తాను. నన్నేం చెయ్యకండి" ముఖంలో భయాన్ని చూపిస్తూ గదిలో మూలకు పరుగెత్తాడు.

అతన్ని అతని భయాన్ని చూసి కల్నల్‌తో సహా మిగతా వారూ నవ్వారు.

ఆ ఒక్క క్షణం చాలు.

నడుముకున్న బెల్టుకి తగిలించిన షో బటన్స్ ఆకారంలో వున్న రెండు మినీ గ్రెనేడ్సు తీసి బలంగా సైనికుల మధ్యకు మెరుపు వేగంతో విసిరి నేలపై అమాంతం బోర్లాపడ్డాడు రెండూ చెవులూ మూసుకుంటూ.

నేలను తాకగానే పెద్ద శబ్దం చేస్తూ ఎక్స్‌ప్లోడ్ అయ్యాయా గ్రెనేడ్లు.

నలుగురు సైనికులు హాహాకారాలు చేస్తూ నేలకూలారు.

బలమైన వస్తువు యేదో వేగంగా వచ్చి చైతన్య యెడమకాలి మోకాలిచిప్ప క్రిందుగా తగిలి 'అబ్బా' అన్నాడు.

## 5

ఓ పదినిమిషాలు గడిచాయి.

ఎడమ కాలిలో విపరీతమైన బాధ. తలవంచి కాలి వంక చూశాడు చైతన్య. రక్తం బాగా కారుతోంది. కాలు ఊడిపోయిందో లేదో తెలీదు. కాలు మెల్లగా కదిపాడు.

ఎర్రగా కాల్చిన సూదులతో పొడిచినట్లుగా మంట. ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

జేబులోంచి కర్చీఫ్ తీసి గాయంమీద గట్టిగా కట్టాడు. రక్తం కారటం తగ్గింది.

వెనుకలెవరయినా బ్రతికి వున్నారో లేదో చూశాడు. గదిలో యెక్కడ చూసినా మంటలు. నలుగురి సైనికులలో చలనంలేదు. ఇద్దరి యూనిఫారంలు తగలబడి పోతున్నాయి. తలుపు వంక చూశాడు.

పొగవల్ల సరిగ్గా కనిపించడంలేదు. కళ్ళు మండి నీళ్ళు కారుతున్నాయి.

కళ్ళు తుడుచుకొని కుడికాలుపై బరువు అంతా వుంచి గోడ ఆసరాగా చేసుకుని నిల్చున్నాడు.

ఎడమ కాలుకూడా నేలపై పెట్టాడు. కొన్ని టన్నుల బరువు కాలుపై వున్నట్లుగా విపరీతమైన నొప్పి. అయినా తప్పదు. గ్రెనేడ్లు ప్రేలి అప్పుడే ఒక నిమిషం పైనే అయింది.

ఎడమ కాలును రెండు చేతులతో పట్టుకొని కుడి కాలుతో గెంతుతూ గుమ్మంవైపు సాగాడు.

పళ్ళ బిగువున్న బాధను భరిస్తూ రెండడుగులు ముందుకు వెళ్ళాడు. కాలికి యేదో అడ్డం తగిలి ముందుకు పడ్డాడు.

ఆ పడటం సరిగా కల్నల్ శరీరంపై పడ్డాడు. తేషం చే ముఖం చిలికివుందేది.

కల్నల్ ఉచ్ఛ్వాసనిశ్వాసాలు చూసి కల్నల్ బ్రతికే వున్నాడని నిశ్చయించుకున్నాడు. తలపై పెద్ద గాయం వలన స్పృహ తప్పాడని వూహించాడు.

తనను చూసిన 5 గురిలో నలుగురు చనిపోయారు, కల్నల్ కూడా తనను చూశాడు. అతను బ్రతికుంటే

ప్రమాదమని తలచాడు. చుట్టూ తల త్రిప్పిచూశాడు. ఆయుధము యేమన్నా దొరుకుతుందేమో అని.

సైనికుల స్టెన్ గన్స్ చాలా దూరంగా వున్నాయనిపించి కల్నల్ దుస్తులు వెతికాడు. రివాల్వర్ లేదు. కల్నల్ తల ప్రక్కనే ఒక్క అద్దంముక్క కన్పించింది. ఆల మారు అద్దాలు పగిలి ముక్కలై పడ్డాయి.

చెయ్యి చాచి అద్దంముక్క అందుకొని కల్నల్ కంఠంపై పెట్టాడు.

"ఛ! స్పృహతప్పి పడివున్న వ్యక్తిని చంపడమా?" అని ఆలోచించాడు.

"తప్పదు. నా వృత్తిలో జాలి దయ వుండకూడదు. తన నీతి, ధర్మంకన్నా ఈ కవరు యెంతో విలువైనది. కల్నల్ తనను చూశాడు. తన ఆకారం, రూపురేఖలు అన్నీ కల్నల్‌కి జ్ఞాపకమే. తెలివి వచ్చిన మరుక్షణం తన కోసం వేట మొదలవుతుంది. ఈ రాచీ నగరం నుంచి బయటకు ప్రతీత్రోవ సీలుచేసి, నిఘా వేసి వుంటారు" అని మనసులో అనుకొని కల్నల్ కంఠంపై బలంగా అద్దం ముక్కతో బలంగా పొడిచాడు.

రివ్వుమని ఫౌంటెన్ లా రక్తం విరజిమ్మింది కల్నల్ కంఠంనుంచి. కల్నల్ తల ప్రక్కకు వాలిపోయింది. కల్నల్ చనిపోయాడో లేదో నిర్ధారించుకొని ప్రాణం వున్న సూచనలు లేవు అని సంతృప్తిగా నిట్టూర్చి ఆ గది లోంచి బయటకు వెళ్ళాడు.

ప్రాణాలతో బయటపడాలి. వేగంగా కదలాలి. ఎడమకాలు ఈడ్చుకుంటూ కుడికాలితో గెంతుతూ కేఫ్ వున్న గదిలోకి వెళ్ళాడు.

దూరంగా పోలీసుకార్ల సైరన్‌లు వినిపించాయి.

టీపాయ్‌మీదున్న కవర్, అమెరికన్ డాలర్ నోట్ల కట్టలు. రివాల్వరు తీశాడు. సోఫాలోని జర్కిన్ తీసి తొడుక్కుని లోపలి గదుల్లోకి వెళ్ళాడు.

రెండు గదులు దాటిన తరువాత కిటికీ అద్దాలలో నుంచి తోట కన్పించి గుమ్మం దగ్గర వెళ్ళి ఆగాడు. తలుపుపై అనుకుని గడియలు తీసాడు. అతని బరువు అంతా తలుపుపై వున్నందువల్ల గడియతీయగానే తలుపుతో బాటుగా ముందుకు తూలి రెండు మెట్లమీదుగా తోటలోని మట్టిలో పడ్డాడు.

ప్రాణం పోయిందేమో అన్పించింది. అచేతనుడై అలాగే వుండిపోయాడు. వర్షం చాలా జోరుగా కురవ సాగింది.

పోలీస్ కార్ల సైరన్లు దగ్గరవుతున్నాయి.

ఎడమకాలు వుంటేనేం పోతేనేం అనుకొని కుడి కాలితో అతిస్పీడుగా గెంతుకుంటూ సొరంగం దగ్గరచేరి సొరంగం ద్వారం ప్రక్కనే నేలపై పడుకున్నాడు.

తోటలోని నీరు అంతా సొరంగంలోకి ధారలుగా పడసాగింది. ఇంక ఆలస్యం మంచిది కాదు. నిచ్చెనపై కాలు వేశాడు. ఎడమకాలు కూడ తీసి నిచ్చెన మెట్టుపై పెట్టాడు. బాధను తట్టుకోలేక కాలు తీసి వేయాలనుకున్నాడు.

జీవన్మరణ సమస్య.

ఇంకో దారి లేదు. తప్పదు.

ఇంటిముందు 'కీచు'మని శబ్దం చేస్తూ ఆగాయి వాహనాలు. బాధను ఓరుస్తూ నాలుగు మెట్లు దిగాడు. చేతిలో పట్టుకొని వున్న ఇనుప తలుపు హాండిల్‌తో తలుపుమీదకు లాగుకున్నాడు.

అంతే. అంత ఎత్తునుంచి పట్టుతప్పి క్రిందపడ్డాడు. వర్షం నీరు క్రింద మడుగుకట్టి వున్నందువల్ల దెబ్బ తగ లేదు. అదీ ఒక అదృష్టమే అని తలచి నీటిలో నిలబడి కవరుతీసి చూశాడు తడవలేదు. కవరును జర్కిన్ లోపలి జేబులో పెట్టుకొని ముందుకు సాగాడు. నీరు నడుము వరకు వుంది.

బాధతో, నిస్సత్తువతో, ఆత్రుతగా కంగారుగా ఆ చివర వున్న నిచ్చెన చేరి ఆగాడు. ఒంటి కాలితో మెట్లు యెక్కాలి. అతికష్టంతో శక్తినంతా కూడదీసుకొని నిచ్చెన ఎక్కి సారంగం పైకి చేరుకొని నేలపై పడుకొని సేదతీర్చుకున్నాడు.

దాహంతో నోరు యెండిపోయింది. పెదాలు విప్పి నోరు తడిచేసుకున్నాడు చైతన్య.

ఇంటివైపు చూశాడు. లైటు వెలుగు గుమ్మంలోంచి స్పష్టంగా కన్పిస్తోంది.

తను ఇందాక లైటు వేసిన గుర్తులేదు.

మరి బాబా నిద్ర లేచాడా?

ఆశతో 'బాబా అని గట్టిగా అరిచాడు.

అంతసేపు అతనిలో దాగివున్న నీరసం ఒక్కసారిగా ఆవహించి సొమ్మసిల్లి పడిపోయాడు.

## 6

చైతన్యకు మెలకువ వచ్చి కళ్ళు తెరచి చూడగానే అతనిలో విభ్రమం. ఎన్నడూ చూడని గది. విస్మయంతో తలత్రిప్పి చూశాడు.

మంచం ప్రక్కనే వున్న కుర్చీలో కునికిపాట్లు పడు తున్నాడు బాబా.

"బాబా" పిలిచాడు చైతన్య.

"మెలకువ వచ్చిందా బాబూ" అన్నాడు బాబా పరీక్షించి లేస్తూ.

"బాబా ఆ కథేమిటి?" అన్నాడు చైతన్య.

ఎప్పుడూ ప్రశాంతంగా వుంటూ కర్తవ్యం మరచిపోని చైతన్యను మెచ్చుకోలుగా చూస్తూ "జాగ్రత్తగానే వుంది బాబు — కాలికి దెబ్బ ఫ్రాక్చరయ్యింది — డాక్టరుబాబు కట్టు కట్టారు. ఈ ఇల్లు ఆయనదే" అన్నాడు బాబా.

ఆందోళనగా కాలు వంక చూశాడు చైతన్య. ఎడమ కాలికి ప్లాస్టర్ ఆఫ్ పారిస్ కట్టు కట్టబడి వుంది. కొద్దిగా నొప్పిగా వున్నట్లు ఫీలయ్యాడు.

గత రాత్రి సంఘటనలు జ్ఞాపకం వచ్చాయి, "స్పృహ తప్పి పడిపోతున్నట్లుగా తెలుసు. ఆ తరువాత?" అ సంగతే అడిగాడు బాబాను.

"చెప్తాను. ఒక్క నిమిషం" అని మంచం ప్రక్కనే వున్న ఫ్లాస్కులోని పాలు గ్లాసులో పోసి అందించాడు.

చైతన్య గ్లాసు అందుకున్నాడు.

"నిన్న రాత్రి మంచి నిద్రలో వుండగా పెద్ద ప్రేలుడు విన్పించి మెలకువవచ్చి భయంతో నిశ్చేష్టుడనయ్యాను. నీకుకూడ మెలకువ వచ్చిందేమోనని మేడ మీదకు వెళ్ళి చూశాను. నువ్వు లేవు. ఇల్లంతా వెతికాను. ఎక్కడా నువ్వు కన్పించలేదు. తోటలోకి వెళ్ళే ద్వారం తెరచివున్నట్లు గమనించి తోటలోకి వెళ్ళాను. సొరంగ మార్గం తలుపు తెరచివుంది.

అలీబాబు ఇంట్లోని ప్రేలుడుకి నీకు సంబంధముంటుందని తలచి, ఇంట్లోకి వెళ్ళి నీకోసం అక్కడే గుమ్మం వద్ద కూర్చున్నాను. 5 నిమిషాల తర్వాత 'బాబా 'అన్న

కేక విన్పించి చెట్ల మధ్యకు పరుగెత్తాను. నువ్వు స్పృహ తప్పి పడివున్నావు" అన్నాడు బాబా.

ఇంతలో, తలుపు తెరచుకొని ఓ 50 సంవత్సరాల వ్యక్తి లోనికి వచ్చాడు. అతని మెడలోని స్టెతస్కోపు డాక్టరు అని చెప్పకనే చెపుతోంది.

"రండి బాబు" అని చైతన్య వంక తిరిగి "ఈయనే డాక్టరు హుస్సేన్" అని పరిచయం చేశాడు బాబా.

"గుడ్ మార్నింగ్ డాక్టర్" విష్ చేశాడు చైతన్య.

"వెరీ గుడ్ మార్నింగ్. ఎలావుంది? నొప్పి తగ్గిందా?" అన్నాడు డాక్టర్ హుస్సేన్.

"కొద్ది నొప్పి వుంది"

డాక్టర్, చైతన్యను పరీక్ష చేసి, "గుడ్. ఎవ్విర్ థింగ్ నార్మల్. మంచి వ్యాయామం చేసిన శరీరం కావటం మూలాన త్వరగానే కోలుకున్నారు. ఓ పదిరోజులు రెస్టు తీసుకుంటే కాలు హీలు అవుతుంది" అన్నాడు డాక్టర్.

"నో, నేనీరోజే వెళ్ళిపోవాలి. నేనిక్కడ వున్న ప్రతిక్షణం అలీ ప్రాణాలు అరచేతిలో పెట్టుకు బ్రతకాలి ప్లీజ్" అరిస్తూ చిన్న అబద్ధం ఆడాడు చైతన్య.

అలీ కష్టాల్లో వున్నాడనగానే కలవరపడ్డాడు బాబా. ఆత్రంగా డాక్టర్ వంక చూసి బాబాకూడా చైతన్య వెళ్ళడానికి అంగీకరించమని ప్రార్థించాడు.

"ఓకే. తప్పదంటున్నారుగా వెళ్ళండి" చైతన్య జబ్బకు ఇంజక్షన్ పొడిచి అన్నాడు డాక్టర్ హుస్సేన్.

"థాంక్యూ" అన్నాడు చైతన్య.

"కాలు దుమ్ము ప్రాక్చరయ్యింది. చర్మం కూడా చీలింది. కుట్లు వేశాను. చాలా జాగ్రత్తగా వుండాలి. నడక ప్రాక్టీసు చేయండి. జాగ్రత్త. చాలా నొప్పిగా

వుంటుంది. నేను మళ్ళీ వచ్చి చూస్తాను" అని వెళ్ళి పోయాడు డాక్టర్.

"బాబా ఆ తరువాత యేమయింది?" అడిగాడు చైతన్య.

"అతికష్టంమీద నిన్ను ఇంటిలోకి తీసుకెళ్ళాను. బురద, రక్తంతో ముద్దయి వున్నాయి నీ దుస్తులు, అవి మార్చి, వళ్ళు శుభ్రంగా తుడిచి డాక్టరు బాబు దగ్గరకు వెళ్ళి విషయం చెప్పాను. ఆయన తన కారులో వచ్చి నిన్ను పరీక్షించి, దెబ్బ ఫ్రాక్చరయ్యిందా అన్న అను మానం ఎక్స్‌రే తియాలని ఇక్కడకు తీసుకొచ్చారు నిన్ను" అన్నాడు బాబా.

"బాబా ఆ కవరు?"

"తెస్తాను" అని గదిలో మూలగా సామగుల బల్ల వద్ద కెళ్ళి జర్కిన్ తెచ్చి ఇచ్చాడు. ఆ కవరు జేబులో అలానే వుంది.

చైతన్య రెండు కాళ్ళు క్రింద పెట్టి నిల్చున్నాడు. ఒక్కక్షణం నిలబడి నొప్పికలిగి తిరిగి మంచంపై కూర్చు న్నాడు. అలా నాలుగయిదుసార్లు ప్రయత్నించి ఒకటి, రెండు, మూడు అని 60 అంకెలు లెక్కపెట్టేవరకు నిలబడగలిగాడు.

5 గంటలవరకు పట్టు విడవకుండా ప్రయత్నించి పది అడుగులు వేయగలిగాడు చైతన్య.

కాలికి కట్టిన కట్టు వదులయింది. నొప్పి ఎక్కువై విశ్రాంతి తీసుకున్నాడు.

సాయంత్రం 6 గంllలవుతుందనగా డాక్టరు వచ్చి చైతన్య కాలు పరీక్ష చేశాడు.

"అరె కట్టు వదులయింది. అలా పడుకోండి కట్టు

మారుస్తాను" అన్నాడు డాక్టర్.

అరగంట తర్వాత ఒకడుగు వెనక్కి వేసి "ఈ కట్టు కొద్దిగా మోకాలుచిప్ప క్రిందుగా కట్టాను. కాలు మూవ్ మెంటుకు వీలుగా వుంటుందని అన్నాడు.

"డాక్టర్, నేను అరగంటలో వెళ్ళిపోతున్నాను. అవసరమయితే తిరిగివస్తాను" అన్నాడు చైతన్య.

"ష్యూర్! ఆల్వేస్ వెల్ కమ్" అన్నాడు డాక్టర్ హుస్సేన్.

## 7

అదే సమయంలో.

రాంచీ నగరంలోని పార్లమెంటు స్క్వేర్ కి దగ్గరలో నున్న పోలీసు జనరల్ కార్యాలయంలో జనరల్ పర్సనల్ రూంలోకి అడుగుపెట్టాడు రాంచీ నగర పోలీసు కమీషనర్.

"హా. కమీషనర్. కమ్. టేక్ యువర్ సీట్" అన్నాడు పోలీసు జనరల్.

"థాంక్యూ సార్!" అన్నాడు కమీషనర్.

ఎంతోమంది రౌడీలకు, దొంగలకు, నేరస్తులకు క్రింది అధికారులకి అందరికీ సింహస్వప్నమయిన కమీషనర్ - జనరల్ ముందు భయపడుతూ నిల్చున్నాడు. గొంతులో యేదో అడ్డుపడినట్లుగా అతనికి మాటలు రావడంలేదు.

"అలీ అనే ఆయన ఇంటిలోని ప్రేలుడు—మీ పరిశోధన—యెంతవరకు వచ్చింది?" జనరల్ అడిగాడు.

కమీషనర్ గొంతు సవరించుకొని, "పూర్తి వివరాలు ఇంకా తెలియలేదు. ఇంకా పరిశోధన సాగిస్తున్నాం" అన్నాడు కమీషనర్.

జనరల్ కనుబొమలు ముడిపడ్డాయి.

కమీషనర్ కి బి.పి. పెరిగింది.

జనరల్ చిరునవ్వు నవ్వాడు.

కమీషనర్ కి చెమటలు పట్టాయి.

“అసమర్థత. ఎక్కడ చూసినా అసమర్థత” జనరల్ అన్నాడు.

“యస్ సార్” ఇంకేం అనాలో తోచలేదు కమీషనర్ కి.

“అసలిప్పటివరకు మీరు చేసిన పరిశోధన యేమన్నా వుందా?’

“ఆ ఇంట్లో చనిపోయిన కల్నల్, సైనికుల శవాలు పోస్టుమార్టం చేయించాం. రిపోర్టు ప్రకారం ఆ నలుగురు సైనికులు గ్రెనేడు ప్రేలుడువల్ల చనిపోయారని తెలిసింది. కల్నల్ కంఠంపై గాజుముక్కతో బలంగా పొడవటంవలన చనిపోయాడు-చనిపోయేముందు కల్నల్ స్పృహతప్పి పడివున్నాడు.”

జనరల్ ముఖం కోపంతో జేవురించింది.

“స్పృహ తప్పి వున్న వ్యక్తిని చంపాడా? అతనెవరో తెలిసిందా? ఆలీయే ఆ ప్రేలుడికి కారణమా?”

“కాదు సార్. ప్రేలుడు జరిగిన గదిలో మూలగా చాలా ఎక్కువగా రక్తం కనిపించింది. ఆ బ్లడ్ గ్రూపు చనిపోయిన ఆ అయిదుగురి బ్లడ్ గ్రూపూ ఒకటి కాదు. ఆలీ బ్లడ్ గ్రూపుకూడా కాదని తెల్సుకున్నాం.

ఆ ఇంటిలోని సేఫ్ తెరిచివుంది. అందులోని కొన్ని లక్షల ఖరీదుచేసే సంపద వుంది. దొంగతనంకోసం ఆ ఇంటిలో ప్రవేశించలేదని తెలిసింది” అన్నాడు కమీషనర్ చిన్న స్వరంతో.

“ఆ సేఫ్ లో మన మిలటరీకి సంబంధించిన విలువైన

కాగితాలు వున్నాయి. అవి మాయమయ్యాయి అని వారు వచ్చిన ఇన్ఫర్మేషన్. ఆ కాగితాలు ఈ నగరం విడిచి వెళ్ళకుండా చూడవలసిన బాధ్యత మీది. డిఫెన్సు మినిస్టరు ఈ విషయాలలో ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్నారు. ఆ కాగితాలు తిరిగి సంపాదించాలి. లేకుంటే పర్యవసానం చెప్పక్కర్లేదు అనుకొంటాను" అన్నాడు జనరల్.

కమీషనర్ ముఖం రక్తవిహీనమయింది.

"యస్ సార్—ఆ ఇల్లు అంతా 'క్లూ' ఏదన్నా దొరుకుతుందేమో అని వెతుకుతున్నప్పుడు, తోటలో పొదల మధ్యగా ఒక సొరంగమార్గం కన్పించింది.

"ఏమిటి?" ఆశ్చర్యంగా అన్నాడు జనరల్.

"ఆ సొరంగం అంతా నీరుతో నిండి వుంది. నీళ్ళు తోడించి మనుష్యులను దింపి పరిశోధించాం. ఆ సొరంగం అలీ ఇంటికి ఒక ఇల్లు తరువాతి వున్న ఇంటిలోని తోట లోకి అంతమయింది. వరుసగా మూడిళ్ళు అలీ వేనని తెలిసింది" అన్నాడు కమీషనర్.

"మరి ఆ రెండు ఇళ్ళు ఖాళీగా వున్నాయా?"

"యస్ సార్. కానీ ఆ రెండో ఇంటిలో నిన్నటి వరకు ఒక ముసలివాడు వుండేవాడని తెలిసింది. తాళాలు విరగ్గొట్టి ఆ ఇల్లు అంతా చెక్ చేశాం.

ఒక గదిలో బురదతోను రక్తంతోను తడసిన బట్టలు కన్పించాయి. ఆ దుస్తులబట్టి ఆ వ్యక్తి కాలికి గాయం అయినట్లుగా తెలుస్తోంది. వేలిముద్రలకోసం ఇల్లంతా వెతికాం. ముసలివాని వేలుముద్రలు కాక ఇంకో జత వేలిముద్రలు కన్పించాయి.

ఇంటి వెనుక కుమ్మానికి అంటుకొని వున్న రక్తంలో

వేలిముద్రలు స్పష్టంగా కన్పించాయి. ఆలీ ఇంటిలో ప్రేలుడు జరిగిన గదిలో మూలగావున్న రక్తం ఈ రక్తం ఒకే గ్రూపుకు చెందినవి" అన్నాడు కమీషనర్.

"ఇంకేమన్నా వుందా?"

"ఆ ముసలివాడి గురించి వెతుకుతున్నాం?"

"ఆ ఇంటిలో ప్రవేశించింది యెవరో యేమిటో తెలీదు?" అవునా" కటువుగా అన్నాడు జనరల్.

"యస్ సార్!" మెల్లగా వణుకుతున్న గొంతుతో అన్నాడు కమీషనర్.

"వెంటనే ఆ వ్యక్తి ఎవరో తెల్సుకొని అదుపులోకి తీసుకోండి. పొరపాటున అతన్ని షూట్ చేసి చంపటమది చేయవద్దు. ఆ కాగితాలు మన వశమయ్యేంతవరకు అతని ప్రాణాలు యెంతో విలువైనవి.

అన్నట్లు ప్రేలుడు జరిగిన గదిలో మూలగా వున్న రక్తం యెక్కువగా కారింది అన్నారు. దానినిబట్టి ఆ వ్యక్తి కాలికి అయిన గాయం పెద్దది అయ్యుంటుంది. అతను వైద్య సహాయానికి వెళ్ళుంటాడు. మరి నగరంలో డాక్టరందరినీ ప్రశ్నించారా?" అడిగాడు జనరల్.

ఇంతవరకు తనకు ఆ ఆలోచన రానందుకు తనని తానే తిట్టుకున్నాడు కమీషనర్.

"యస్ సార్! ఎంక్వాయిరీ చేస్తున్నాం. ఈ రాచీ నగరంలో సుమారు 500 డాక్టర్లున్నారు. అందరినీ..."

"త్వరగా ఎంక్వాయిరీ చేయండి. ఇక మీరు వెళ్ళవచ్చు" అన్నాడు జనరల్.

అటెన్షన్‌లోకి వచ్చి సాల్యూట్ చేసి వెనక్కు తిరిగి ఆ గదిలోంచి బయటపడ్డాడు.

# 8

మంచంపై కూర్చుని తీవ్ర ఆలోచనలో పడ్డాడు చైతన్య. ఈ దేశంనుంచి తప్పించుకోవాలి. ఎలా? అలీ ఇంటిలో తన కాలినుంచి కారిన రక్తం ఆధారంగా గాయమున్న వ్యక్తుల్నందరినీ అరెస్టుచేసి ప్రశ్నిస్తారు.

రాంచీ నగరంనుంచి బయటకుపోయే మార్గాలన్నీ ఈ పాటికి సీలుచేసే వుంటారు.

రేడియో, టెలివిజన్, వార్తాపత్రికల్లో అలీ ఇంట్లో ప్రేలుడు గురించి క్లుప్తంగా చెప్పారు. అంతకుమించి వాళ్ళ పథకాలేవీ తెలుపలేదు.

ఎంత ఆలోచించినా సరైన అయిడియా స్ఫురించక చిరాకుగా గదిలో పచార్లు చేయసాగాడు.

'ఛ! ఈ కాలికే దెబ్బ తగిలి వుండకపోతే ఎలాగోలా తప్పించుకోవచ్చు' అని బాధపడుతుండగా మెదడులో మెరుపు మెరిసినట్టు ఓ ఆలోచన కలిగి చిరాకుపోయి హుషారు చోటుచేసుకుంది

తిరిగి మంచంపై కూర్చుని సిగరెట్ వెల్గించి తనకు వచ్చిన ఆలోచనకు మెరుగులు దిద్దాడు. అంతకంటే వేరే మార్గంలేదని తలచి అంతవరకూ మౌనంగా కూర్చుని వున్న బాబాతో—

"బాబా ఈ ఇంటినుంచి ఎవరి కంటా పడకుండా ఓ చోటికి వెళ్ళాలి. ఎలా?" అనడిగాడు చైతన్య.

"నాకు తెలిసిన ఒక టాక్సీ డ్రైవరున్నాడు. అతని టాక్సీలో వెళ్ళవచ్చు" అన్నాడు బాబా.

"అతన్ని నమ్మవచ్చా?" అన్నాడు చైతన్య.

"నాది హామీ. అతనెవరో కాదు. నా మేనల్లుడు. నేనంటే ప్రాణం ఇస్తాడు" అన్నాడు బాబా.

"అయితే వెంటనే వెళ్ళి అతన్ని తీసుకొస్తావా?" అనడిగాడు.

"ఆ ఇప్పుడే వెళ్తాను" అన్నాడు బాబా గుమ్మం వైపు అడుగులు వేస్తూ.

చైతన్య ఆతృతగా గదిలో పచార్లు చేస్తున్నాడు. బాబా వెళ్ళి అరగంట పైనే అయింది.

మరో 5 నిమిషాలు గడిచాయి. ఎందుకైనా మంచిది. ముందుగా ఈ ఇంటిలోనుంచి వెళ్ళిపోవటమే మేలు అని తలచి గుమ్మం వైపు అడుగులు వేశాడు.

ఇంతలో తలుపు తెరచుకొని బాబా వచ్చాడు. చైతన్య హాయిగా ఊపిరి పీల్చాడు.

"వాడు యేదో బేరంమీద వెళ్ళాడు. తిరిగి వచ్చేసరికి ఇంత ఆలస్యమయింది. రండి" అన్నాడు.

అమెరికన్ డాలర్ల కట్టలోంచి 20 వంద డాలర్ల నోట్లుతీసి జేబులో పెట్టుకొని బాబాను అనుసరించాడు.

టాక్సీలో కూర్చుని యేదో చెప్పాడు చైతన్య. డ్రైవరు తలూపి కారు స్టార్టుచేశాడు. అరగంట తరువాత ఒక వీధిలో ఆగింది టాక్సీ. అది పేద ప్రజలు నివసించే వీధి. అపరిశుభ్రంగా, దుర్గంధమయమై వుంది.

డ్రైవరు ప్రశ్నార్థకంగా చూశాడు. చైతన్య మెల్లగా యేదో చెప్పాడు. డ్రైవరు క్రిందకు దిగి వెళ్ళాడు.

5 నిమిషాల తరువాత ఒక 40 ఏళ్ళ వ్యక్తితో తిరిగి వచ్చాడు డ్రైవరు. ఆ నూతన వ్యక్తి కారెక్కి చైతన్య ప్రక్కనే కూర్చున్నాడు.

"నా పేరు ప్రభు. నీ దగ్గరకు వెళ్ళమని చెప్పాడు శ్రీకాంత్" చైతన్య అన్నాడు.

"శ్రీకాంత్. ఇండియన్. చెప్పండి. ఏం కావాలి?"

అన్నాడా వ్యక్తి.

"నాకు అర్జంటుగా పకిస్తాన్ ప్రభుత్వం ఇష్యూ చేసి నట్లుగా పాస్‌పోర్టు, మినిస్ట్రీ ఆఫ్ డిఫెన్సు స్పెషల్ పాస్ కావాలి."

"ఏ పేరుమీద?"

"అబ్దుల్" అన్నాడు చైతన్య.

"ఎన్ని రోజుల్లోగా కావాలి?"

"ఎన్ని రోజుల్లోనా? ఇంకో గంటలో ఇవ్వాలి" అన్నాడు చైతన్య.

అతను ఆశ్చర్యంగా చూశాడు.

"కష్టం. సుమారు ఓరోజు అయినా పడుతుంది."

"నో. ఇంకో గంటలో కావాలి. ఎంతయినా ఫరవా లేదు."

"చాలా ఖర్చవుతుంది. వెయ్యి అమెరికన్ డాలర్లు" అన్నాడు.

"అమెరికన్ డాలర్లా?" సంతోషంతో అన్నాడు చైతన్య.

"అవును. ఇప్పుడున్న కరెన్సీ రద్దుచేసి కొత్త కరెన్సీ ప్రవేశపెడతారని పుకారు" అన్నాడు అతను.

"మరీ ఎక్కువ?" అన్నాడు చైతన్య.

"అది నా రేటు. అదీకాక గంటలో కావాలంటు న్నారు. ఇంత తక్కువకి చేసేవాళ్ళున్నారు. వాళ్ళ దగ్గర ట్రై చెయ్యండి. శెలవు" అని కారు డోర్ తీశాడు.

"ఆగండి" అని జేబులోంచి నోట్లకట్టతీసి అందులో 5 అమెరికన్ వంద డాలర్ల నోట్లుతీసి అందించాడు. "సగం పనయ్యాక" అన్నాడు.

"ఓ.కే. డన్. ఈ రూపంలోనే వెళతారా?"
అనడిగాడు.

"లేదు. కొద్దిగా ఛేంజస్ చేసుకోవాలి. మేకప్ సామానుందా మీ దగ్గర" అన్నాడు చైతన్య.

"వుంది. మనం ఒక చోటికి వెళ్ళాలి" అన్నాడతను.

చైతన్య డ్రైవర్ని పిలిచాడు.

పదినిముషాల తర్వాత ఒక చిన్న సందు మొదట్లో టాక్సీ ఆగింది.

ఇద్దరూ క్రిందకు దిగారు. చైతన్య చుట్టూ పరికించాడు జనం అంతగా లేరు.

"టాక్సీ కొద్దిదూరం తీసుకొని వెళ్ళి ఆపు ఇక్కడే వుండు. వెళ్ళిపోకు" అని చెప్పి చైతన్య సందులోకి వెళ్ళాడు.

అరగంట తరువాత చైతన్య ఒక్కడే వచ్చాడు. అతని రూపం కొద్దిగా మార్పులతో ముప్పయి సంవత్సరాల అతని వయస్సు నలభయిదు సంవత్సరాలకు మారింది.

టాక్సీ ఎక్కి పోనివ్వమన్నాడు. ఒక టెలిఫోన్ బూత్ వద్ద టాక్సీ ఆపి దిగి బూత్ లోకి వెళ్ళి జేబులోంచి కరీఫ్ తీసి రిసీవర్ పైవేసి డయల్ చేశాడు.

"హల్లో" అని విన్పించి కాయిన్ స్లాట్ లో వేశాడు.

"హల్లో! ఎయిర్ పోర్టు" అని కటువుగా విన్పించింది.

"హల్లో! మీ కో చిన్న ఇన్ఫర్మేషన్. ఇంకో గంటలో ఇండియా వెళ్ళే ఫ్లైట్ లో ఒక వ్యక్తి వెళ్ళిపోతున్నాడు. అతను తనతో కొన్ని లక్షల విలువచేసే వజ్రాలు తీసుకొని వెళ్ళిపోతున్నాడు" అన్నాడు చైతన్య.

"హల్లో మీ రెవరు?"

"అతన్ని గుర్తించడం చాలా తేలిక. అతని కాలికి

పెద్ద కట్టు కట్టబడి వుంటుంది. వజ్రాలు అందులోనే వున్నాయి" అని ఫోన్ రిసీవర్ క్రెడిల్ చేసి బూత్ లోంచి బయటపడ్డాడు.

టాక్సీలో కూర్చుని "ఇందాక మనం వెళ్ళిన చోటుకి వెళ్ళనీ. తొందరలేదు. మెల్లగా ఊరంతా తిరిగి వెళ్దాం. ఇంకా గంటన్నర గడపాలి" అన్నాడు చైతన్య.

టాక్సీలో ఒక గంట ఊరంతా తిరిగి, చైతన్య ఇంతకుముందు వెళ్ళిన వీధికి వెళ్ళి పాస్‌పోర్టు, డిఫెన్సు మినిస్ట్రీ ఇష్యూ చేసిఉట్లున్న స్పెషల్ పాస్ తీసుకొని ఎయిర్‌పోర్టుకు వెళ్ళాడు.

# 9

చైతన్య కుంటుతూ ఎయిర్‌పోర్టు లాంజ్‌లోకి నడిచాడు. తన ప్రతి అడుగునీ ఒక ఇరవై కళ్ళు కనిపెడుతున్నాయి అని తలచి నవ్వుకున్నాడు. నిదానంగా నడుస్తూ ముందుకు సాగాడు.

అంతే....

"చేతులెత్తు" అని గట్టిగా అరవు వినిపించి ఆగాడు చైతన్య.

లాంజ్ అంతా నిశ్శబ్దం చోటుచేసుకుంది. లాంజ్‌లోని కొన్ని వందల కళ్ళు చైతన్యవైపు తిరిగాయి. కొంతమంది ఊపిరితీసుకోవటం కూడా మరిచి చైతన్యను జాలిగా చూస్తున్నారు.

భయాన్ని నటిస్తూ రెండు చేతులూ ఎత్తాడు చైతన్య.

"పద" అన్నాడు ఒక యువకుడు.

"ఏమిటిది. నేను చేసిన నేరం యేమిటి" తడబడుతున్న గొంతుతో అన్నాడు చైతన్య.

"అదేదో చెప్తాం" అని చైతన్య చెరో జబ్బ పట్టు

కాని ఎయిర్‌పోర్టు కాపలా బృందం నాయకుడు హబిబుల్లా కూర్చున్న గదిలోకి తీసుకెళ్ళారు.

గదిలో పచార్లుచేస్తున్న హబిబుల్లా చైతన్య వైపు చూసి చిరునవ్వు నవ్వాడు. "ఆ కట్టు విప్పండి" అన్నాడు.

"ఎందుకు? ఏమిటిది? కట్టు విప్పటం ఎందుకు? ప్లీజ్ టెల్ మి. వాటీస్ ఆల్ దిస్?" అన్నాడు చైతన్య.

"షటప్" అని, "ఏమిటి అలా నిల్చున్నారు. ఆ కట్టు విప్పండి" అని హుంకరించాడు హబిబుల్లా.

"నేను ప్రభుత్వ అధికారిని. ప్రభుత్వం పనిమీద అర్జంటుగా ఇండియా వెళ్ళాలి ప్లీజ్" అన్నాడు చైతన్య.

ఇద్దరు యువకులు చైతన్యను కదలకుండా పట్టుకున్నారు. చైతన్య అరుస్తూనే వున్నాడు. ఇంకో యువకుడు చైతన్య కాలికున్న కట్టును పరపరా కోసాడు. రక్తం కారసాగింది చైతన్య చర్మం చీలిన చీలికలోంచి.

కాలు చీలికకు కుట్లు వెయ్యబడి వుండడంచూసి నిరుత్తరుడయ్యాడు ఆ యువకుడు.

హబిబుల్లా ఆశ్చర్యపోయాడు. అయినా అతని అనుమానం తీరలేదు.

"కుట్లు తెంపి లోపల వెతుకు" అన్నాడు.

"ప్లీజ్ వద్దు. నేను స్మగ్లర్‌ని కాను. వద్దు" అని అరిచాడు చైతన్య.

తనని పట్టుకొన్న వాళ్ళనుంచి విడిపించుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నట్లు నటించాడు.

తన ప్లాను పారుతున్నందుకు సంతోషంగా వుంది. మరోవైపు కాలిలో బాధ. చీలినచోట కట్లు తెంపి

లోపల వెతకకపోతే తన ప్లాను సక్సెస్ అయ్యే అవకాశం లేదు. వాళ్ళంత తప్పుచేస్తే తరువాత తనకంత సహాకరిస్తారు.

కట్టూ కట్ చేసిన కత్తితోనే చైతన్య కాలికి వేసిన కట్లు కట్ చేశాడా యువకుడు. రక్తం ధారలుగా కారుతోంది. విపరీతమైన బాధతో, నొప్పితో చైతన్యకు కళ్ళు తిరగసాగాయి.

"డిఫెన్సు మినిస్టర్‌కి ఈ విషయం తెలిస్తే మీ బ్రతుకులేం అవుతాయో ఆలోచించండి" చైతన్య కోపంగా అన్నాడు.

"నోర్ముయ్" ఈడ్చికొట్టాడు హాబిబుల్లా.

ఆ దెబ్బకు చైతన్య పళ్ళు అన్నీ కదిలాయి.

అనుమానం తీరక చైతన్య కాలు చీలినచోట వ్రేళ్ళతో గాలికి పరీక్షించారు. ఇక నిలబడలేక స్పృహతప్పిపడ్డాడు చైతన్య.

చైతన్య దుస్తులు వెతికారు. పాస్‌పోర్టు మినిస్ట్రీ ఆఫ్ డిఫెన్సు జారీచేసిన స్పెషల్ పాస్ చూసి ముచ్చెమటలు పోశాయి హాబిబుల్లాకి.

'ఛ. ముందే జేబులు వెతికవలసింది. ఈ స్పెషల్ పాస్ చూస్తే తను ఇంత కఠినంగా ప్రవర్తించేవాడు కాదేమో. ఒక ప్రభుత్వ ఉద్యోగిని ఇలా హింసలకు గురిచేసామని అధికార్లకు తెలిస్తే ఇంకేమన్నా వుందా. కింకర్తవ్యం?' అని తనలోతానే అనుకొని "ఎయిర్‌పోర్టు రెసిడెంట్ డాక్టర్‌ని తీసుకురండి" అన్నాడు.

రెండు నిమిషాలలో ఎయిర్‌పోర్టు డాక్టర్ వచ్చి, చైతన్యను పరీక్షించి, "ఎవరు చేశారు ఈ పనీ మనుష్యులా? రాక్షసులా?" కోపంగా అన్నాడు.

"మిస్టర్ డాక్టర్. మైండ్ యూవర్ బిజినెస్"
అన్నాడు హాబిబుల్లా క్రోధంగా.

ఎయిర్‌పోర్టు డాక్టర్ చైతన్య కాలినుంచి కారుతున్న రక్తాన్ని అరికట్టి, చైతన్య జబ్బకు రెండింటికీను పాడిచి, స్టిచెస్ వేసి కట్టుకట్టాలి. నా రూంకి తీసుకు రండి" అన్నాడు.

హాబిబుల్లా సైగ చెయ్యగా నలుగురు యువకులు చైతన్యను మోసుకు వెళ్ళారు. సుమారు గంట తర్వాత ఇద్దరి భుజాలపై రెండు చేతులు వేసి కుంటుతూ ఆ గదిలోకి వచ్చాడు చైతన్య.

చైతన్యను చూడగానే హాబిబుల్లా ముఖం వికసించింది.

చైతన్య కూర్చున్నాడు. హాబిబుల్లా తన అనుచరులకు సైగ చేశాడు.

అనుచరులందరూ ఆ గదిలోంచి నిష్క్రమించారు. హాబిబుల్లా తలుపు గడియవేసి వచ్చాడు.

"నేను ఇప్పుడే ఈ విషయం డిఫెన్సు మినిస్టర్‌కి తెలియచేస్తాను. నేను అర్జంటుగా ఇండియా వెళ్ళాలి అని చెప్పాను. వినలేదు మీరు. ఇప్పుడా ఫ్లైటుకూడా వెళ్ళిపోయింది" కోపంగా చిరాకుగా అన్నాడు చైతన్య.

చైతన్య రెండు చేతులు పట్టుకుని బ్రతిమాలాడు హాబిబుల్లా.

"ప్లీజ్ రిపోర్టు చెయ్యకండి. మాకు ఎవరో ఫోన్‌లో ఫాల్స్ ఇన్ఫర్మేషన్ ఇచ్చారు. ప్లీజ్. ఇంకో రెండు గంటలలో ఇంకో ఫ్లైట్ వుంది. అందులో మిమ్మల్ని ఎలాగైనా పంపిస్తాను ప్లీజ్" బ్రతిమాలాడు హాబిబుల్లా.

కొంతసేపు బెట్టు చూపి శాంతించాడు చైతన్య.

"నేను ఊరిలోకి వెళ్ళి ఫ్లైట్ టైంకి వస్తాను" అన్నాడు చైతన్య.

"తప్పకుండా. నేనే దగ్గరుండి ప్లేన్‌లోకి ఎక్కిస్తా మిమ్మల్ని" అన్నాడు హబిబుల్లా సంతోషంగా.

ఎయిర్‌పోర్టు బయట తనకోసం వేచివున్న టాక్సీలో ఎక్కి డాక్టర్ ఇంటికి కొంతదూరంలో టాక్సీ ఆపి దిగాడు చైతన్య.

"నేను మళ్ళీ ఒకగంటలో ఎయిర్‌పోర్టు కెళ్లాలి. వస్తావు కదా" అడిగాడు చైతన్య.

"తప్పకుండా" అన్నాడు డ్రైవరు.

వంటుతూ డాక్టర్ హుస్సేన్ ఇంట్లోకి వెళ్ళాడు చైతన్య.

చైతన్యను పోల్చుకోలేకపోయాడు డాక్టర్.

"నేను డాక్టర్. చైతన్యను."

"గుడ్. గుడ్. పోల్చుకోలేకపోయాను. "ఏమిటిదంతా" నవ్వుతూ అన్నాడు డాక్టర్.

"ఇక్కడనుంచి తప్పించుకోవాలిగా. తప్పలేదు. ఇండియా వెళ్లే ఫ్లైటుకి సీటు రిజర్వు చేసుకొని వస్తున్నాను" నవ్వుతూ అన్నాడు చైతన్య,

నిజమా అన్నట్లు చూశాడు డాక్టర్ హుస్సేన్.

"యస్ డాక్టర్ నిజమే. ఆ మీరు నాకింకొక సహాయం చెయ్యాలి. ఈ కట్లు విప్పి ఇంకో కట్టు కట్టాలి" అన్నాడు.

"ఏదేం?"

"చెప్తాను. రండి ప్లీజ్. అర్జంట్" అన్నాడు

చైతన్య.

"పదండి" కుర్చీలోంచి లేచి అన్నాడు డాక్టర్.

ఇంతకు ముందు తనున్న గదిలోకి వెళ్ళాడు చైతన్య. బాబా లేడు. ఇంటిలోనే ఎక్కడో వుంటాడనుకొని సొరుగులబల్ల వద్ద నడచి ఆగాడు చైతన్య.

మధ్య సొరుగు సాంతం బయటకు లాగి బల్లమీద పెట్టాడు. ఆ సొరుగు త్రిప్పి ప్లాస్టర్‌తో అంటించి వుంచిన కవరు తీసి జేబులో పెట్టుకున్నాడు. సొరుగును యథాస్థానంలో వుంచి మంచంవద్దకు నడిచి కూర్చున్నాడు.

డాక్టర్ సరంజామా అంతా పట్టుకొచ్చాడు.

చైతన్య ఎడమకాలు మంచంపై పెట్టి పాంటు మీదకి లాగాడు.

"వాటీజ్ దిస్? ఇది నేను కట్టిన కట్టుకాదు."

"ఇంకో డాక్టరు కట్టారు."

"అదేం?"

"ఎయిర్‌పోర్టులో జారి పడిపోయాను. మీరు వేసిన కుట్లు తెగి రక్తం కారుతుంటే ఎయిర్‌పోర్టు డాక్టర్ వద్దకు వెళ్ళాను. మళ్ళీ స్టిచెస్ వేసి కట్టు కట్టారు" అన్నాడు చైతన్య.

"గుడ్ గాడ్" అన్నాడు డాక్టర్ హుస్సేన్.

"డాక్టర్ ఓ, ప్లాస్టిక్ సంచి చిన్నది వుంటే ఇవ్వండి. పాలథిన్ కవరైనా పరవాలేదు."

"ఇస్తానుగాని, ఈ కట్టు బాగానే వుందిగా మళ్ళీ కట్టు మార్చటమెందుకు?"

"ఈ కవరు లోపల పెట్టాలి."

"వ్వాట్?" ఆశ్చర్యంగా అని అంతలో అర్థమయి,

"బ్రిలియంట్ అయిడియా" నవ్వుతూ అన్నాడు డాక్టర్ హాన్సేన్.

డాక్టరిచ్చిన ఖాళీ పాలిథిన్ సంచిలో బ్లూ ప్రింట్సున్న కవరు పెట్టి, డాక్టరకందించాడు, "ఇక మీ పని కానివ్వండి" అన్నాడు నవ్వి.

డాక్టర్ హాన్సేన్ నవ్వుతూ చైతన్య కాలికున్న కట్టు ఊడదీసి మళ్ళీ మరో కట్టు కట్టడంలో నిమగ్నుడయ్యాడు.

"ఎక్సలెంట్. లోపల కవరున్నదన్న అనుమానం ఎవరికీ కలుగదు. ఇంక నాకు శెలవిప్పించండి. మళ్ళీ యెప్పుడయినా కలుద్దాం. ఢిల్లీ వస్తే ఈ నెంబరుకు ఫోన్ చేయండి. నమస్తే" అని రెండు చేతులు జోడించి నమస్కరించాడు చైతన్య.

డాక్టర్ హాన్సేన్ నవ్వుతూ ఆప్యాయంగా చైతన్య భుజంపై చరిచాడు.

"డాక్టర్! బాబా ఏడి?"

"మేడమీద గదిలో పడుకున్నాడు. లేపనా?"

"ఇప్పుడో అరగంటలోనో పోలీసులు వచ్చే అవకాశం వుంది. నా గురించి ప్రశ్నిస్తారు. నేను అసలు ఈ ఇంటికి వచ్చిన సూచనలు గుర్తులు యేవీ లేకుండా శుభ్రంగా క్లీన్ చేయించండి. నా ఫింగర్ ప్రింట్స్ కూడ వుండకూడదు. నాకు సమయం చాలదు. లేకుంటే నేనే...."

"ఓకే. నెవర్ మైండ్. మా పనివాళ్ళతో నేను శుభ్రం చేయిస్తాను. మీరు నిశ్చింతగా వెళ్ళండి" అన్నాడు డాక్టర్.

"ఇంకొక్క విషయం. బాబాను ఆ ఇంటికిగానీ ఆ ఇంటి చుట్టుపక్కలకు గానీ వెళ్ళవద్దని చెప్పండి. కొన్ని రోజులు రోడ్డుమీదకు కూడా వెళ్ళవద్దని చెప్పండి. బాబాను వెంటనే ఈ ఇంట్లోంచి వేరేచోటికి వెళ్లే యేర్పాటు చేయండి. బాబాను అరెస్టుచేసి ప్రశ్నిస్తే నా గురించి తెలుస్తుందని, బాబాకోసం ఈపాటికి వేట మొదలయి వుంటుంది" అని కృతజ్ఞతలు తెలిపి వెళ్ళి పోయాడు చైతన్య.

# 10

పోలీసు కమీషనర్ చాలా ఆందోళనగా వున్నాడు. అలీ ఇంట్లోకి ప్రవేశించిన వ్యక్తి ఆచూకి ఇంతవరకు ఏమీ తెలియలేదు.

రివాల్వరు, ఐరన్ సేఫ్ తలుపులమీద వున్న ఫింగర్ ప్రింట్సు అన్నీ ఒక వ్యక్తివే. పోలీసు ఫైల్సులో వున్న కొన్ని వందల వ్రేలిముద్రలతో సరిపోల్చి చూస్తున్నారు. ఇప్పటివరకు ఫలితం కనపడలేదు.

గది తలుపులు త్రోసుకొని లోపలికి వస్తున్న తన సెక్రటరీని చూడగానే అరకాలిమంట తలకెక్కింది.

"యూ ఇడియట్ యెక్కడికి వెళ్ళిపోయావు" అని అరిచాడు కమీషనర్.

అతని కోపం చూసి నివ్వెరపోయాడు అతని సెక్రటరీ.

"ఇంతసేపూ నీ గురించే యెదురుచూస్తున్నాను. అలీ ఇంట్లో ప్రేలుడుకు కారణం అయిన వ్యక్తిని రేపు సాయంకాలం లోపల అరెస్టు చేయకుంటే నా ఉద్యోగం వూడేలా వుంది" కమీషనర్ కంఠంలో బాధ ధ్వనించింది.

"నేను ఆ పనిమీదనే వెళ్ళాను సార్. ఆ మూడో ఇంటిలో ముసలివాడి రూపురేఖలు వర్ణన సేకరించి వాటిని బట్టి ఒక ఆర్టిస్టుతో ఆ ముసలివాని బొమ్మ గీయించి, అతనే ఆ బాబా అని నిర్ధారణ చేసుకొని అన్ని పోలీసుస్టేషన్లకి, టి. వి. కేంద్రానికి కాపీలు ఇచ్చి వస్తున్నాను. ప్రతీ గంట కోమారు బాబా బొమ్మ టి.వి. లో చూపమని చెప్పాను."

ప్రశంసాపూర్వకంగా చూశాడు కమీషనర్.

"అలీ తరచూ వెళ్ళే క్లబ్బుకి వెళ్ళి అలీకి బాగా పరిచయమున్న డాక్టర్లు, వాళ్ళ అడ్రస్‌లు తెలుసుకొని వస్తున్నాను. ఆ ముసలివాడు తప్పకుండా అలీకి పరిచయమున్న డాక్టర్ వద్దకు తీసుకొని వెళ్ళుంటాడు ఆ వ్యక్తిని" అని ఓ కాగితం అందించాడు.

కమీషనర్ ముఖం 1000 వాట్సు బల్బులా వెలిగింది.

అదే సమయంలో—

చైతన్య మరోసారి ఎయిర్‌పోర్టు దగ్గర టాక్సీ దిగి 10 వంద డాలర్ల నోట్లు ఇచ్చాడు డ్రైవరుకి.

"నా దగ్గర అవే వున్నాయి. ఈ దేశపు కరెన్సీ లేదు" అన్నాడు.

"ఫరవాలేదు సార్. డాలర్లు ఈజీగా మార్చుకో వచ్చు" అని సలాం చేసి వెళ్ళిపోయాడు డ్రైవర్.

ఎయిర్‌పోర్టులోకి ప్రవేశించాడు చైతన్య.

హబీబుల్లా ఎదురొచ్చాడు.

"రండి" అన్నాడు.

చైతన్య నవ్వాడు. ఇద్దరూ ప్లేన్ సమీపించారు. హబీబుల్లాను చూడగానే పాస్‌పోర్టు అదీ తనిఖీ చేయకుండా వదిలేశారు.

టేకాఫ్! టైం అయ్యేవరకు చైతన్య ప్రక్కనే వుండి, ఏవేవో చెప్పసాగాడు, హబీబుల్లా. ఎయిర్ హోస్టెస్ టైమయింది దిగమంది. ఎయిర్ హోస్టెస్‌కి చైతన్యను మర్యాదగా చూసుకోమని చెప్పి, దిగి వెళ్ళి పోయాడు అతను.

బోయింగ్ మెల్లగా గాలిలోకి లేచింది.

హాయిగా నిట్టూర్చి సీట్లో వెనక్కి వాలాడు చైతన్య.

—:అ యి పో యిం ది:—

సీరియల్

# వి.యస్.రావ్

# అన్వేషణ

(గత సంచిక తరువాయి)

"మిసెస్ రంగనాథ్, మీ నోటిమీది చేతిని తీసేస్తాను; మీరు బొబ్బలెట్టడానికి కాదు. అరిస్తే మీ కుడి చెవి తెగి కింద పడిపోతుంది!" అన్నాడతను కత్తిని ఆమె చెవి దగ్గరగా పట్టుకుంటూ.

కటాలున అతని చెయ్యి దూరంగా జరిగింది. కాంత అప్రయత్నంగా నోరు తెరిచింది. పాలియెస్టర్ షర్టు బంతిలా ఆమె నోట్లోకి కుక్కబడింది. నాలుకను నొక్కేస్తూ, అంగుడును కర్కశంగా రాసుకుంటూ గుడ్డ ఆమె నోట్లో కూరుకుపోతోంది. పొట్టివ్యక్తి రెండు బొటనవేళ్ళతో చొక్కాను ఆమె నోట్లోకి దోపుతున్నాడు. కాంతకి నోరారా దగ్గాలనిపిస్తోంది.

అతను ఆమె వెనక్కి జరిగాడు. వేళాడుతున్న

చొక్కా చేతుల్ని వెనక్కి లాగి, ఆమె తల వెనుక భాగంలో గట్టిగా ముడేశాడు.

ముందుకి నడిచి తన మిత్రుడి పక్కనే నిలబడ్డాడు. శాంత అతన్నే చూస్తోంది. రేగడి నేల పగుళ్ళలోంచీ పెరిగిన గడ్డిపోచల్లా అతని చెవుల్లోంచీ వెంట్రుకలు మొలిచి, బయటికి పొడుచుకు వచ్చాయి. మొరగకుండా, కాటు వేసే పిచ్చికుక్క గుర్తొస్తోంది—మౌనంగా తన పని చేసుకుపోతున్న అతన్ని చూస్తోంటే—శాంతకి.

తన కళ్ళలోకి విజయగర్వంతో చూస్తున్న నాలుగు కళ్ళని శాంత అయోమయంగా, భయంగా చూసింది. వాళ్ళకి యేం కావాలి? డబ్బా? నగలా? తనా? గుండెలు అవిసిపోయేలా ఆమెలో సాగుతున్న ఆలోచనలు ఆమె కళ్ళల్లో నీళ్ళుగా మారుతూన్నాయి.

“మిసెస్ రంగనాథ్, మా రాకకి రకరకాల కారణాల్ని మీరు ఊహించుకుంటున్నారు. డబ్బు, నగలు, మీ అందం—ఇవే మీకు సాధారణంగా కనుపించే కారణాలు. మాలాంటివాళ్ళని చూస్తే, డబ్బుకోసం వచ్చామనీ, డబ్బున్నవాడూ అఘాయిత్యం చేయడానికి వచ్చామని మీలాంటి అందగత్తెలూ అనుకుంటారు. లోకంలో డబ్బూ, ఆడదీ రెండే కాదు; ఇంకా వేరే వస్తువులూ వున్నాయి!” పొడుగాటి వ్యక్తి సగర్వంగా అన్నాడు. శాంత అర్థంకానట్టు చూసింది.

“మేం వేరే పనిమీద వచ్చాం, మిసెస్ రంగనాథ్, మనం ఆ గదిలోకి వెళ్దాం. మీలో తేలుకొండీల్లా తలెత్తుతున్న ప్రశ్నలకి సమాధానాలు దొరుకుతాయి!” అంటూ అతను ఆమె భుజంమీద చెయ్యి వేసి, పక్క గదివైపు తిప్పాడు. పొట్టివ్యక్తి గబగబా కదిలి, ఆమె ఎడమ

వైపున చేరాడు.

మెల్లగా అడుగులు వేస్తూ శాంత నిట్టూర్చింది. తన మీద అత్యాచారం జరగదు! మరేం జరుగుతుంది? వీళ్ళు పిచ్చాసుపత్రి నుండి తప్పించుకున్నారా? ఆలోచనల్లో కూరుకుపోయిన శాంత తన భర్త ఆఫీసు గదిలో కుర్చీలో కూచోబెట్టబడింది. గదిలో లైటు వెలుగుతోంది. పొడుగాటి వ్యక్తి ఆమె ముందు గెడకర్రలా నిలబడ్డాడు. జర్దాబీడాని విశ్రాంతి లేకుండా నములుతోంది అతని నోరు. పెదవుల చివర్లో ఎర్రటి ద్రవం జారుతోంది; రక్తంలా.

రెండో వ్యక్తి ఆలస్యం చేయకుండా ఆమె ముందు నేలమీద గొంతుక్కూచున్నాడు. ముందే బాగా రిహార్స్ చేసినట్టు వాళ్ళిద్దరూ పనులు చేసుకుపోడం ఆమెకి ఆశ్చర్యాన్నీ, గాభరానీ కలిగిస్తోంది.

రెండు నిమిషాల్లో ఆమె కాళ్ళని కుర్చీకాళ్ళకి గట్టిగా బంధించి పొట్టివ్యక్తి లేచి నిలబడ్డాడు. జేబులోంచి మరో తాడు తీశాడు. వెనగ్గా జరిగి, ఒక్కటిగా బంధించబడిన ఆమె చేతులక్రిందుగా పోనిచ్చి, చేతుల్నీ, కుర్చీ వెనుకభాగాన్నీ కలిపి కట్టేశాడు. శాంతలో కొత్త భయం ప్రారంభమైంది. ఆమెలో వెయ్యి ప్రశ్నలు పుట్టుకొస్తున్నాయి. రెప్ప వేయకుండా ఆమె ఎదురుగా వున్న నాయకుడిని చూస్తోంది.

"మిసెస్ రంగనాథ్, మీలాంటి స్త్రీలు శీలం కోసం ప్రాణాలు అర్పించేస్తారు! అవునా?" నవ్వుతూ ప్రశ్నించా డతను. "తల ఆడిస్తే చాలు. మీరు మాట్లాడలేరు!"

శాంత ఉలిక్కి పడింది. ఒక్కసారిగా శరీరమంతా చల్లబడిపోయిందామెకి. చెమటలు కమ్ముతున్నాయి. వలలో చిక్కిన లేడి కళ్ళల్లా భయానికి రూపాల్లా తయా

రయ్యాయి ఆమె కళ్ళు. తల రక్తంతో పోటెక్కి పోతోంది.

కెంపుల్లా ఎర్రగా వున్న ఆమె కళ్ళలో విశ్వరూపం ధరించిన భయాన్ని అర్థం చేసుకున్నట్టు అతను చిన్నగా నవ్వాడు. ఇవతలికి ఉబుకుతున్న బీడా రసాన్ని జబ్బతో తుడుచుకున్నాడు. అతని చెయ్యి జేబులోకి వెళ్ళింది. క్షణంలో, యెర్రటి పిడిలో దాగిన కత్తితో ప్రత్యక్షమైంది.

కాంత గుండెలో వెయ్యి గుర్రాలు ఒకేసారి పరుగెట్టడం ప్రారంభించాయి. భయంతో తన గుండె ఆగిపోతుందా? వీళ్ళు యెందుకిలా ప్రవర్తిస్తున్నారు? వీళ్ళెవరు? వీళ్ళకి తనేం అపకారం చేసింది? అతని మణికట్టు మెరుపులా కదిలింది. తళుక్కున మెరుస్తూ కత్తి ఇవతలికి వచ్చింది. కాంత కంగారుగా చూస్తోంది. శీలం కోసం ప్రాణం....తన....ప్రాణం తీస్తాడా?....

అతను రెప్పలు వాల్చి కత్తి పదునుని వోసారి చూశాడు. అతని పెదవులమీద తృప్తికరంగా చిరునవ్వు ప్రతింక్షమవుతోంది. అతని చేతిలో కత్తి అటూ ఇటూ ఆడింది. వెలుతురు కత్తి పదును మీద నాట్యం చేస్తోంది.

కాంత శరీరం మళ్ళీ జలదరించింది. కళ్ళు తిరుగుతున్నట్టుంది. నోట్లో ఇరుక్కున్న గుడ్డని తోసుకుంటూ వాంతి అయ్యేలా వుంది. అతని రెప్పలు పైకి లేచాయి. ఆమె కళ్ళలోని భయాన్ని సంతృప్తికరంగా ఒకసారి చూసి, పొడుగాటి ఆమె కంఠాన్ని ఆశగా చూశాడతను.

కాంత చూపులు అతనిపక్కనే నిలబడ్డ పొట్టివ్యక్తి మీద పడ్డాయి. వదులుగా వున్న నలిగిపోయిన పాంటు,

వదులుగా వున్న చొక్కామీద క్రీజు మరకలు. మడమలమీద తన బరువుని ఆన్చి, వెనక్కీ ముందుకీ పూనకం వచ్చిన గణాచారిలా వూగుతున్నాడతను.

కత్తి పట్టుకున్న పొడుగాటి వ్యక్తి చెయ్యి అతనివైపు సాగింది. మౌనంగా కత్తిని అందుకున్నాడతను. కాంత అతన్నే చూస్తోంది. అతను మూగవాడా?

క్షణకాలం కత్తిని పరిశీలించిన అతని చూపులు గదిని కలయజూశాయి. నిద్రలో నడుస్తున్నవాడిలా అతను టేబుల్ పక్కగా వున్న స్టూల్ వైపు అడుగులేశాడు. స్టూలుమీదున్న గాజుకూజాని తృప్తికరంగా చూశాడు. జేబులోంచి రుమాలు తీసి, కూజామీది మూతను రుమాలుతో జాగ్రత్తగా పట్టుకుని, తీసి స్టూలుమీద పెట్టాడు. అతని చెయ్యి మళ్ళీ జేబులోకి వెళ్ళింది. కాంత ఆశ్చర్యంగా అతన్నే గమనిస్తోంది. ఏం చేస్తున్నాడతను?

సిగరెట్ లైటర్తో అతని చెయ్యి ఇవతలికి వచ్చింది. కాంత చూపులు అతని పళ్ళమధ్య కదుల్తోన చుట్టమీద వాలాయి. లైటర్ వెలిగింది. మంట పొడుగ్గా, నీలంగా పైకి లేచింది. మంట చుట్టని తాకలేదు.

కత్తి పదునుని మంటలో పెట్టి, అటూఇటూ జరుపుతూ వుండిపోయాడతను. కాసేపు కాల్చిన తరువాత లైటర్ని ఆర్పి జేబులో పడేసుకున్నాడు. కత్తిని కూజాలోని నీళ్ళలో ముంచాడు. సుయ్మంటూ చప్పుడైంది. కత్తిని ఇవతలికి లాగి, నోట్లోంచి చుట్టని లాగి, కత్తిని కాసేపు ఊదుతూ వుండిపోయాడతను.

"మిసెస్ రంగనాథ్ ...." కాంత తటాలున తన కళ్ళని పొడుగాటి వ్యక్తివైపు తిప్పింది.

"ఇప్పుడు మీకు కొంచెం కష్టం కలిగించాల్సి వుంది. పెద్ద కష్టమేంకాదు. మీరు వోర్చుకోగలరు. ఓర్చుకోవాలి...." పొడుగాటి వ్యక్తి మర్యాద ఉట్టిపడే తన మామూలు ధోరణిలో మాట్లాడ్డం ప్రారంభించాడు.

తేనె పూసిన కత్తి! కాంత లోపలోపలే—మనసులో పళ్ళు కొరుక్కుంది.

"మిసెస్ రంగనాథ్. చిన్న గాయం, చిన్న కోత. మీ వీపుమీద చాకుతో స్వస్తిక్ ఆకారంలో చిన్న గాయం చేస్తాను. మరీ లోతుగా కాదు; భయపడకండి. పన్నెండు కుట్లుకన్నా యెక్కువ అవసరంలేని కోత కోస్తాను...." అన్నాడతను శస్త్ర చికిత్స చేయబోయే సర్జన్ రోగికి ధైర్యం చెప్తున్నట్టు.

కాంత నిస్సహాయంగా కళ్ళని అటూ ఇటూ తిప్పింది. 'వద్దు, ప్లీస్.... వద్దు!' అంటున్నాయి ఆమె కళ్ళు; నీళ్ళతో నిండుతున్న ఆమె కళ్ళు.

"సారీ, మిసెస్ రంగనాథ్ తప్పనిసరి. క్షణకాలం కళ్ళు మూసుకోండి. కత్తి సర్జికల్ నైఫ్‌లా పదునుగా వుంది. మీకోసం దాన్ని కాల్చి, శుభ్రం చేశాం. ఏం జరిగిందో మీకు తెలిసేలోగా పనయిపోతుంది. మా దారిన మేం పోతాం...." అంటూ అతను కత్తి అందుకున్నాడు. కాంత కళ్ళు కాలువలు కట్టాయి. ఆమె హృదయం మౌనంగా ఆక్రోశిస్తోంది, ప్రాధేయపడుతోంది.

అతను కుర్చీ వెనక్కి నడిచాడు. అతని చేతివేళ్ళు జాకెట్ అంచులో దూరుతున్నాయి.

క్షణంలో ఆమె జాకెట్ కిందిదాకా ఫర్రున చిరిగిపోయింది. అతని వేళ్లు బ్రాహుక్స్‌ని తొలగించాయి.

జాకెట్ రెండువైపులకూ తోయబడుతోంది. అతని వేళ్ళు యేదో పురుగు కాళ్ళలా ఆమె వీపుమీద పాకుతున్నాయి. ఆమె చర్మం బిగుసుకుపోతోంది. భయంతో ఆమె శరీరం కుంచించుకుపోతోంది. ఏదో కేక, ఆర్తనాదం ఆమె గుండెల్ని చీల్చుకుంటూ దూసుకొస్తోంది, కంఠంలో అణగారిపోతోంది.

ఏదో అగాథంలోంచీ మళ్ళీ ఆ కంఠం మర్యాదగా పలుకుతోంది.

"మిసెస్ రంగనాథ్, కదలకండి. మీ యెడమ భుజానికి దగ్గరగా స్కెచ్ పెన్‌తో స్వస్తిక్ ఆకారంతో గీత గీస్తాను, ఆ తరువాత ఆ గీత వెంట...."

కాంత శరీరం పెనుగాలిలో చిగురుటాకులా వణకడం ప్రారంభించింది. రాక్షసుడు! తన చెవుల్లోకూడా పత్తి దోపి, తాత్కాలికంగా చెవిటిదాన్ని చేసేస్తే యెంత బాగుండేది! ఆమె వొళ్ళు ఒక్కసారి ఝల్లుమంది. మనిషి చేతిలోని పదునైన కత్తికింద చిక్కి నోరులేని జంతువులపట్ల జాలీ, కరుణా పర్వతాల్లా పెరుగుతున్నాయామెలో. వీపుమీద చల్లగా, తడిగా యేదో పాకుతోంది.

"కదలకుండా, భయపడకుండా కూచోండి. కళ్ళు మూసి తెరిచేలోగా అయిపోతుంది. కళ్ళు మూసుకోండి!" సానుభూతిపరుడైన సర్జన్ కంఠం వెనుకనుంచీ ఆమెని హెచ్చరించింది.

అప్రయత్నంగా కాంత కళ్ళని గట్టిగా మూసుకుంది భయం మూలంగా. ఆ రాక్షసుడు చెప్పినట్టు కళ్ళు మూసుకున్నందుకు ఆమె తనని తిట్టుకుంది.

చటుక్కున యేదో మంట ఆమె వీపుని రెండు

అంగుళాల పొడవు చీల్చింది. ఏదో వెచ్చగా జారుతోంది మంట కిందికి రెండంగుళాలు సాగింది. కుడివైపుకి రెండంగుళాలు. మరో రెండంగుళాలు. మరో రెండు.... మరో రెండు....వీపుమీద యేదో మంటలోంచీ ఏవో కాలువలు .... కన్నీళ్ళతో ఆమె మొహం తడుస్తోంది, రక్తంతో తడుస్తున్న ఆమె వీపులా....

"ఓకే....మిసెస్ రంగనాథ్! థాంక్యూ! అయిపోయింది...." వెనకనుంచీ తృప్తికరంగా అంటోంది అతని కంఠం. కాంత బరువుగా నిట్టూరుస్తూ కళ్ళు తెరిచింది ధైర్యంగా.

అతను ఆమె ముందుకి నడిచాడు. పిడిలాగా ఎర్రగా మెరుస్తున్న కత్తిని అనుచరుడికి అందించాడతను. మోచెయ్యిదాకా పైకితోసిన చొక్కా చేతిని ఎడంచేత్తో కిందికి లాగుతూ ఆమెవైపు నవ్వుతూ చూశాడతను. కాంత కళ్ళు అప్రయత్నంగా అతని చేతివైపు తిరిగాయి. అతని కుడి చేతిని అంటిపెట్టుకున్న గ్లవ్ పైన గొలుసు వదులుగా వేళ్ళాడుతోంది. గొలుసు మధ్యలో దీర్ఘ చతురస్రాకారంలో పట్టీ....గుండీ తగిలిస్తూ, చిన్నగా నవ్వాడతను.

పొట్టివ్యక్తికి ఆమె దగ్గరగా జరిగాడు. కత్తికి అంటిన రక్తాన్ని ఆమె చీరకి తుడిచేశాడు. మడిచి తన అనుచరుడి చేతికి అందించాడు. రెండు చేతుల్నీ పాంటుజేబుల్లోకి దోపుకొని అతను ఆమె అర్ద్రనయనాల్లోకి చూశాడు. ఎర్రటి నాలుక, అతని యెర్రటి పెదాల్ని ఒకసారి తడిమింది.

"గుడ్ బై మిసెస్ రంగనాథ్! మేం వెళ్ళిపోయిన పావుగంటలో మీ భర్త వస్తాడు. టేక్ రెస్ట్!" అంటూ

అతను అనుచరుణ్ణి చూస్తూ టేబుల్ వైపు తల యెగ రేశాడు.

పొట్టి వ్యక్తి ఉత్సాహంగా టేబుల్ మీదికి వొంగి, దొంతరలుగా పెట్టబడిన కేసు కాగితాల్ని అందు కున్నాడు. ఏకాగ్రతతో వాటిని చించిపడేయడం ప్రారంభించాడు.

మూడు నిమిషాల్లో అన్ని కాగితాల్ని ముక్కలు ముక్కలుగా చించి టేబుల్ మీద గుట్టగా పడేశాడు. ఆమెవైపు వొకసారి చూసి, ఇద్దరూ గుమ్మంవైపు నడిచారు.

కాంత అసంకల్పితంగా తన చూపుల్తో వాళ్ళని వెంబ డించింది. గది తలుపు వాళ్ళ వెనక మూసుకుంది. కాసేపట్లో వీధి తలుపు మూసిన చప్పుడు ఆమెకి వినిపిం చింది.

నోరారా వెక్కి వెక్కి యేడవాలనిపిస్తోందామెకి. తాత్కాలికంగా నోరులేని కాంత మౌనంగా వెక్కి వెక్కి యేడవసాగింది; దీనంగా.

• • •

లాయర్ రంగనాథ్ సగం కాలిన సిగరెట్ పీకతో మరో సిగరెట్ ముట్టించాడు. నోరు మండుతోంది. కడుపు మండుతోంది. ఆ రెండింటినీ మించి అతని హృదయం మండుతోంది.

ఎవర్నీ నొప్పించకుండా, పరిమితంగా ప్రాక్టిస్ సాగించుకుంటూ, మర్యాదగా, సాదాగా జీవించే వ్యక్తి తను. తనకి శత్రువులే లేరు. కాంత, తను ప్రేమించి పెళ్ళాడిన స్త్రీ. ఆమెకి శత్రువులు లేరు. తనకి లేనట్టే, ఆమెకీ చేదుగతం లేదు! గతంలోని క్రీనీడలు వర్త

మాసంలో తనమీద పడడానికి వీలులేదు.

అయితే, గతరాత్రి ఆమెమీద అఘాయిత్యం ఎందుకు జరిగింది? అర్థంకాని విధంగా, విచిత్రంగా జరిగిన ఆ దారుణం అతన్ని హడలగొట్టేస్తోంది.

కాంత చెప్పిందాన్నిబట్టి ఆ దుర్మార్గులిద్దరూ సైకలాజికల్ కేసుల్లా అవుపిస్తున్నారు. ఒకడు యెంతో మర్యాదగా, నెమ్మదిగా, శాంతంగా మాట్లాడాడు. రెండో వ్యక్తి అసలు పెదవి కదపలేదు.

తన భార్యను గాయపరచి, కేస్ ఫైల్స్‌ని యెందుకు పాడుచేశారు? ఆ ఫైల్స్‌లోని కేసుల్తో వాళ్ళకి సంబంధం వుందా? ఇరవై నాలుగ్గంటలుగా ఇవే ప్రశ్నల్ని తన బుర్ర కలయదిప్పుతోంది. జవాబులు దొరకని ప్రశ్నలవి!

ఆరిపోయిన సిగరెట్‌ని గిరాటేసి మరో సిగరెట్ వెలిగించాడతను. నీరసంగా తలని వెనక్కి వాల్చి, రెండు కాళ్ళనీ టేబుల్ మీదికి జాపి, కళ్ళు మూసుకున్నాడు రంగనాథ్. ఉన్నట్టుండి అతను ఉలిక్కిపడ్డాడు. తన ఆలోచనల్ని చెదరగొడుతూ శబ్దంచేసిన ఫోన్ని అందుకున్నాడు. అప్రయత్నంగా రిస్ట్‌వాచీ చూశాడు. పన్నెండు గంటలు.

"యస్?"

"లాయర్ రంగనాథ్?" అవతల కంఠం బొంగురుగా అంది. ఆ కంఠాన్ని యెప్పుడో, యెక్కడో విన్నట్టుందతనికి.

"యస్."

"రంగనాథ్, నీ భార్య యెలా వుంది?" బొంగురు కంఠం ఏకవచనంలో ప్రశ్నించింది.

"మీ రెవరు?" రంగనాథ్ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"నీ భార్య యెలా వుంది? యెన్ని కుట్లు వేశారు?"

రంగనాథ్ అప్రయత్నంగా మంచంవేపు చూశాడు. శాంత అటుతిరిగి పడుకుంది. వీపుమీది బ్యాండేజీ తెల్లగా అవుపిస్తోంది. డాక్టర్ పన్నెండు సూచర్స్ వేశాడు. ఆమెకి బాగా నిద్రపట్టడానికి మాత్రలిచ్చాడు. జరిగిందంతా అడిగి తెలుసుకున్న డాక్టర్ తనని అదోరకంగా అనుమానంగా చూశాడు. రంగనాథ్ నిట్టూర్చాడు. అటువైపున బరువుగా ఊపిరి పీల్చుకుంటున్న శబ్దం అతని చెవిలో దూరుతోంది.

"హూ ఆర్ యూ?"

"నేనెవరో నీకు తెలీదు; తెలుసుకోలేవు! అయితే నువ్వు తెలుసుకోవాల్సింది వేరేవుంది. దాన్ని నీ బుర్రలోకి యెక్కించడానికి, నిన్న రాత్రి నీకు, నీ భార్య ద్వారా హెచ్చరిక చేయబడింది...."

"ఎవరున్నువ్వు?" రంగనాథ్ బిగ్గరగా అరిచాడు. తన భార్యని కర్కశంగా గాయపరచిన ఛండాలుడు తనతో ధైర్యంగా మాట్లాడుతున్నాడు!

"ఇల్లూ కోర్టూ; కోర్టూ ఇల్లూ-బాడ్మింటన్ బాల్ లా బతకాల్సిన నువ్వు నీకు సంబంధించని విషయాల్లో జోక్యం చేసుకుంటున్నావ్."

"మిస్టర్, ఇతర్ల విషయాల్లో వేలుపెట్టే అలవాటు నాకులేదు. ఐ నెవర్ కేర్! నువ్వు...."

అవతలి కంఠం యెగతాళిగా నవ్వింది. "ఇతర్ల విషయాల్లో వేళ్ళు కాదు, చేతులూ కాళ్ళూకూడా పెట్టి జేబులు నింపుకోవడమే మీ లాయర్ల వృత్తి. నీది కాని వంటకంలో గరిటపెట్టి కలియదిప్పబోతున్నట్టు అయిదు రోజుల క్రితం స్వయంగా నువ్వే, నాకు ఫోన్లో

చెప్పాప్!"

రంగనాథ్ ఉలిక్కి పడ్డాడు. ఆ కంఠాన్ని ఎప్పుడు యెక్కడ విన్నాడో అతనికి తటాలున గుర్తొచ్చింది. రిసీవర్ని పట్టుకున్న అతని చెయ్యి వణకడం ప్రారంభించింది. నుదుర్ని తడుపుతున్న చెమటని అరచేత్తో తుడుచుకున్నాడతను.

"లాయర్, నీకు మళ్ళీ వార్నింగ్ ఇవ్వబడదు. ఏ పట్టాలమీద నువ్వు ప్రయాణం చేయాలో నీకు సూచించబడింది. ఈసారి నువ్వు సరిహద్దు దాటితే నువ్వూ, నీ భార్యా, నీ ఇల్లూ—నీ సర్వస్వం ప్రమాదవశాత్తూ కాలిబూడిదగా మారుతారు! మొదటి పొరపాటుగా భావించి నీకు మైల్డువార్నింగ్ ఇచ్చాను. అర్థమైందా?"

రంగనాథ్ పెదవులు వణకడం ప్రారంభించాయి. మైల్డువార్నింగ్! ఆడదాన్ని కట్టేసి, నోట్లో గుడ్డకుక్కి, వీపుమీద కోయడం మైల్డువార్నింగ్! గుడ్ గాడ్!

"నా ప్రశ్నకి నువ్వు సమాధానం చెప్పలేదు!" బొంగురు కంఠం గద్దించింది.

"ఏ... మి....టి....?"

"అర్థమైందా అని అడిగాను...."

"ఇది అమానుషం...."

"మనిషికి మనిషిలా చెప్తే వొకోసారి బుర్ర కెక్కదు. వాతపడితేగానీ వేడి తెలీదు....మళ్ళీ అడుగుతున్నా, అర్థమైందా?"

"ఆ...." రంగనాథ్ బలహీనంగా అన్నాడు.

"లాయర్ భాయ్, పీకమీద నాట్యం చేయాల్సిన కత్తి, వీపుమీద తేలిగ్గా గీతలు గీసింది. ఈసారి అలా జరగదు. గుల్లలో నత్తలా నీ బతుకు బతుకు!" క్లిక్ మన్న

శబ్దం అంతసేపూ సాగిన సంభాషణకి ఫుల్ స్టాప్ పెట్టింది.

చెమటతో తడిసిన చేతిలోంచీ వణుకుతూ జారిపోతున్న రిసీవర్ని మెల్లిగా క్రెడిల్ మీద పెట్టాడు రంగనాథ్. ఏవేవో దృశ్యాలు అతని కళ్ళముందు పరిగెడుతున్నాయి. అర్థం పర్థం లేకుండా జరిగిన విషయాలన్నింటినీ కలిపే కారణం అతనికి మెల్లి మెల్లిగా తెలుస్తోంది.

అతని గుండె వేగంగా కొట్టుకోడం ప్రారంభించింది. బలహీనంగా నిట్టూరుస్తూ అతను తలని వెనక్కి వాల్చేశాడు....

• • •

తలుపు తట్టిన చప్పుడు.

"లోపలికి రండి!" అన్నాడు లాయర్ రంగనాథ్, తల వంచుకుని ఏవో కాగితాల్ని చూస్తూ.

తలుపు తెరుచుకుంది; మూసుకుంది. కాగితాలను బల్ల మీద పడేసి రంగనాథ్ తలెత్తాడు. ఎదురుగా నిలబడ్డ పొడుగాటి యువకుణ్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

పొట్టిగా వున్న క్రాపు, పెద్ద కళ్ళు. సన్నగా పెదవుల చివర్ల దాకా సాగిన మీసాలు. కండలు తిరిగి కడ్డీలా వున్న శరీరం, తెల్లటి పాంటు, తెల్లటి షర్టు, స్నఫ్ కలర్ స్వెటర్ అతని శరీరాన్ని బిగుతుగా పట్టుకుంది.

"మిస్టర్ రంగనాథ్, నమస్తే!" అన్నాడతను. అతని చెయ్యి పైకి లేచి, అతని నుదుర్ని తాకింది. ఆ కదలికలో యేదో క్రమశిక్షణ వుంది. చేతి నరాలు మెలికలు తిరిగాయి.

రంగనాథ్ అప్రయత్నంగా తలపంకిస్తూ బొమలు ముడేశాడు.

"కేరాఫ్ 56 ఏ.పి.వో.కి పంపిన మీ ఉత్తరం, మిజోరంలోవున్న నాకు చాలా చాలా ఆలస్యంగా అందింది." అన్నాడతను చిన్నగా నవ్వుతూ.

రంగనాథ్ కళ్ళు మెరిశాయి. మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమయింది. "మనోజ్! పోల్చుకోలేకపోయాను....సిడౌన్!"

మనోజ్ అతనిముందు కుర్చీలో కూచుని, నిట్టూర్చాడు. రంగనాథ్ రెండు చేతుల్నీ టేబుల్ మీద వుంచి, ముందుకి వంగాడు.

"అయామ్ సారీ....చాలా దారుణం జరిగింది...."

మనోజ్ నిట్టూర్చాడు.

"కరుణాకర్ తను సంపాదించిందంతా నా స్వాధీనం చేశాడు. పాతిక వేలదాకా బ్యాంక్సులో వుంది. మరో ఇరవై వేలుచేసే నగలున్నాయి. మీ అన్నయ్య లైబ్రరీలోని బుక్స్ విలువ ముప్ఫై వేలదాకా వుంటుంది. ఆ పుస్తకాల్ని నన్ను తీసేసుకోమన్నాడతను. మొత్తం డెబ్భై అయిదు వేలు అవొచ్చు. అదంతా నీదే...."

"డబ్బుకోసం నేను రాలేదు."

రంగనాథ్ ఆశ్చర్యంగా చూశాడు. "అన్నయ్యను కలుసుకున్నావనుకుంటాను...."

"కలుసుకున్నాను. అంతా తీసుకుని ఆర్మీలోకి పారిపొమ్మన్నాడన్నయ్య!"

"మంచి సలహా...." రంగనాథ్ వెంటనే అన్నాడు.

మనోజ్ అతన్ని ఆశ్చర్యంగా చూశాడు. రంగనాథ్ మొహం సీరియస్‌గా వుంది.

"మిస్టర్ రంగనాథ్, యెందుకలా అంటున్నారు?"

మనోజ్ అడిగాడు. రంగనాథ్ మాట్లాడకుండా అదోలా చూశాడు.

"స్నేహితులైన మీరు, కేసు విషయంలో అన్నయ్యకి యెందుకు సహాయం చెయ్యలేదు?" మనోజ్ ప్రశ్నించాడు.

"కరుణాకర్ యెవర్నీ సహాయం చెయ్యనివ్వలేదు. మీ వదిన హత్య అతన్ని పూర్తిగా క్రుంగదీసింది. బాగా సన్నిహితులైన నాలాంటి వాళ్ళకి తప్ప అందరికీ మీ అన్నే దోషి అనిపించేంత కట్టుదిట్టంగా కేసు నడిచింది. మనోజ్, యెవరో చట్టంతో ఆడుకున్నారు...."

"చట్టంతో, అన్నయ్య జీవితంతో ఆడుకున్న వాళ్ళతో నేను ఆడుకుంటాను మిస్టర్ రంగనాథ్!"

రంగనాథ్ కంగారుగా చూశాడు. మనోజ్ కళ్ళు ఆవేశంతో మెరుస్తున్నాయి.

"అన్నయ్య నుంచీ కేసు వివరాలు తెలుసుకోవాలనుకున్నాను. ఆయన నన్ను పూర్తిగా నిరుత్సాహపరిచే ప్రయత్నం చేశాడు. ఆయన నా గురించి భయపడుతున్నాడు. వివరాలన్నీ నాకు చెప్పండి. వదిననూ, గీతనూ చంపిన కిరాతకుల్ని పట్టుకోవటంలో నాకు సహాయం చేయండి!" తదేకంగా రంగనాథ్ మొహంలోకి చూస్తూ అన్నాడు మనోజ్.

రంగనాథ్ యిబ్బందిగా చూశాడు. అసహనంగా కుర్చీలో కదిలాడు. తటాలున కుర్చీలోంచి లేచాడు. గుమ్మం వైపు నడిచాడు. హాల్లో కళ్ళి కాసేపట్లో తిరిగొచ్చాడు. టేబుల్ ముందు నిలబడి అదోరకంగా మనోజ్ ని చూశాడు.

"మనోజ్, మీ అన్నయ్య నీ కోసం కేసు వివరాలు

చెప్పకుండా దాటవేశాడు. నేను నా కోసం ఆ విష యంలో నీకు సహాయం చేయలేను....! అయామ్ సారీ!...."

"మిస్టర్ రంగనాథ్!"

"మనోజ్, నీకో సలహా యిస్తాను: మీ అన్నయ్య సలహా పాటించు!"

"రంగనాథ్ గారూ....!" మనోజ్ ఆశ్చర్యంతో అన్నాడు.

రంగనాథ్ నిట్టూర్చి, యేదో చెప్పబోయాడు. గుమ్మం దగ్గర చప్పుడయింది. కాఫీ ట్రేతో కాంత ప్రవే శించింది.

"కాంతా, నువ్వు మనోజ్‌ని చూడలేదనుకుంటా. మన కరుణాకర్ తమ్ముడు...." రంగనాథ్ పరిచయం చేశాడు. అతని కంఠంలో హుషారు లేదు.

మనోజ్ నిలబడి ఆమెకి నమస్కారం చేశాడు. కాంత తలాడిస్తూ చిరునవ్వు నవ్వింది. ఆమె అందించిన కాఫీకప్పుని అందుకుని కూచున్నాడతను.

"నర్మద నాతో చాలా కలుపుగోలుగా ఉండేది. అయామ్ సారీ" అందామె విచారంతో.

"థాంక్స్!" అన్నాడు మనోజ్. ఒకసారి కాఫీ చప్పరించి, రంగనాథ్ కుర్చీలోంచి లేచాడు. మనోజ్ వైపు చూశాడు.

"అప్పట్లో మీ అన్నయ్య పెద్ద షాక్‌లో వున్న కార ణంగా, అతని సహకారం లేని కారణంగా, ఆ కేసుని నేను తీసుకోలేకపోయాను. నిరపరాధి అయిన కరుణా కర్ జైల్లో మగ్గిపోవడం భరించరాని అన్యాయంగా అనిపించింది నాకు. అతని హృదయానికి తగిలిన గాయం

కొంచెం మానేశ, కేసుని అప్పీలుకి తీసుకెళ్ళాలని నేను అనుకున్నాను. కానీ ఆ ప్రయత్నం విరమించుకోవాల్సి వచ్చింది. మా అన్నయ్యాదీ, నాదీ మంచి స్నేహం. మని షికి తన తరువాతే స్నేహితం అని నేను అనుకోవాల్సి వచ్చింది..."

మనోజ్ అర్థంకానట్టు చూశాడు. "నా కంతా అయోమయంగా వుంది...."

రంగనాథ్ చిన్నగా నిట్టూర్చాడు. మెల్లిగా కాంత వైపు జరిగాడు. రెండు భుజాల్నీ పట్టుకుని ఆమె వీపు మనోజ్ వైపు వుండేలా తిప్పాడు. మెల్లిగా తలెత్తి మనోజ్ వైపు చూశాడు.

"మనోజ్, కరుణాకర్ కేసుని పై కోర్టుకి తీసుకెళ్ళాలన్న నా ఆలోచన, అమాయకురాలైన నా భార్యని శిక్షించింది! చూడు...." అంటూ ఆమె భుజాల్ని కప్పిన పైటని పక్కకి తోశాడు.

మనోజ్ ఆశ్చర్యంగా చూశాడు. ఎడమవైపు జాకెట్ బాగా కిందికి కత్తిరించబడింది, స్వస్తిక్ ఆకారంలో వున్న బ్యాండేజీ తెల్లగా అవుపిస్తోంది. దానిచుట్టూ వీపు కందిపోయి వాచింది.

"ఇద్దరు వ్యక్తులు ఈ యింట్లో కాంతని అటాక్ చేశారు. ఆమెని బంధించి, నోట్లో గుడ్డలు కుక్కి కత్తితో వీపు మీద గాయం చేశారు!" రంగనాథ్ కంఠం ఆవేశంతో వణికింది.

"ఎవరు? ఎవరు వాళ్ళు?"

"ఎవరో తెలీదు. ఎందుకలా చేశారో కూడా అప్పట్లో తెలీదు. అనవసరమయిన విషయాల్లో తల దూర్చినందుకు నన్ను హెచ్చరించడం కోసం నా భార్య వీపుమీద

కత్తితో పొడిచామనీ రాత్రి యెవరో వ్యక్తి ఫోన్లో నాకు తెలియజేశాడు. మీ అన్నయ్య కేసుగురించి ప్రయత్నాలు చేయడమే అనవసరమయిన విషయం అని అతని మాటల్ని బట్టి నేను అర్థం చేసుకున్నాను...."

"మీ ప్రయత్నాల గురించి యెవరికి తెలుసు?" మనోజ్ ఉద్రేకంతో ప్రశ్నించాడు.

"ఎవరికీ తెలీదు.... కానీ వారంరోజుల క్రితం ఒక వ్యక్తి నాకు ఫోన్ చేశాడు. కరుణాకర్ ఎన్నో కేసుల్లో తనకి సహాయం చేశాడనీ, అతను శిక్ష అనుభవించడం భావ్యంకాదనీ, అతని కేసుని అప్పీల్ చేపిస్తేను అన్ని విధాలా సహాయం చేయడానికి తను సిద్ధంగా వున్నాడనీ అన్నాడతను. మీ అన్నయ్యపట్ల అభిమానం అతని కంఠంలో వినిపించింది. అతనెవరో చెప్పమని అడిగాను. తన పేరు బైటికి రావడం తనకి ఇష్టంలేదనీ, తెర వెనక వుండి నాతో సహకరిస్తాననీ అన్నాడతను.

"అప్పీలు గురించి ఆలోచిస్తున్నట్టు అతనికి చెప్పాను. ఇలాంటి కేసులో మనకి యెందరి సహాయమో అవసరం కావచ్చు. మళ్ళీ ఫోన్ చేస్తానంటూ అతను డిస్కనెక్టు చేశాడు...."

మనోజ్ కుర్చీలో ముందుకి జరిగాడు. "తరవాత?" రంగనాథ్ తదేకంగా అతని మొహంలోకి చూశాడు.

"ఆ వ్యక్తీ, రాత్రి ఫోన్ చేసి నన్ను బెదిరించిన వ్యక్తీ ఒక్కడే అని ఆ కంఠస్వరం నాకు చెప్పింది!"

మనోజ్ ఆశ్చర్యంగా చూశాడు. రంగనాథ్ నిట్టూర్చాడు. "అతనెవరో నా ప్లాన్ గురించి, తెలివిగా, నా ద్వారానే తెలుసుకున్నాడు. భయంకరంగా ప్రవర్తించి; నా భార్యను గాయపరచి, నాకు 'మైల్డువార్నింగ్'

ఇచ్చాడు మనోజ్, యెవరో నరరూప రాక్షసుడి హస్తం దీని వెనక వుంది. కరుణాకర్ కోసం కాకుండా, చివరికి నాకోసంకూడా నేను ఆ వ్యక్తిని యెదుర్కోలేనని పిస్తోంది!" అన్నాడతను వణికే కంఠంతో.

మనోజ్ మెల్లిగా కాంతవైపు తిరిగాడు. "మిసెస్ రంగనాథ్, వాళ్ళెలా వున్నారో, ఎలా ప్రవర్తించారో దయచేసి చెప్పండి."

కాంత మొహంలో భయం ప్రత్యక్షమైంది. కళ్ళల్లో యేవో నీడలు వ్యాపించాయి. "నన్ను అనుక్షణం భయంతో నింపి గడగడలాడించిన వాళ్ళ గురించి తలుచుకోవాలంటేనే భయంగా వుంది. తాళంతీసి ఇంట్లోకి ప్రవేశించాను...." వణికే కంఠంతో ఆమె అంతా పూసగుచ్చినట్టు చెప్పింది. మొహానికి పట్టిన చెమటను చీరకొంగుతో తుడుచుకుంది. రంగనాథ్ చిన్నగా దగ్గాడు.

"ఆ రోజు నా కారు ట్రబులిచ్చింది. బ్రేక్స్ ఫెయిలయ్యాయి. మరమ్మత్తు చేయించుకుని ఆలస్యంగా ఇల్లు చేరుకున్నా. కాంతని దయనీయమైన స్థితిలో చూశాను. డాక్టర్కీ, పోలీసులకీ ఫోన్ చేశాను. పోలీసులు వెయ్యి ప్రశ్నలు వేశారు. వేలిముద్రలకోసం ఇల్లంతా గాలించారు. ఎలాగో తాళం తెరిచి, ఇంట్లో ప్రవేశించి, పెరటి తలుపుతీసి మళ్ళీ ముందు తలుపు తాళం బిగించి వాళ్ళు ఇంట్లో నక్కి దాక్కునివుండాలని ఇన్స్పెక్టర్ అన్నారు. కొంతమంది నేరస్థుల ఫోటోల్ని కాంతకి చూపించాడు. లాభంలేకపోయింది. ఏదేనా తెలిస్తే వెంటనే వాళ్ళకి తెలియచేయమన్నారు."

"ఫోన్ కాల్ గురించి తెలియజేశారా?" మనోజ్ ప్రశ్నించాడు.

రంగనాథ్ తల అడ్డంగా ఆడించాడు. "లేదు. ఇప్పటిదాకా జరిగిందంతా పూర్తిగా, పర్మనెంట్‌గా మరిచిపోడానికి నిశ్చయించుకున్నాను. పోలీసులకి తెలిస్తే మళ్ళీ ప్రమాదం జరగొచ్చు!"

మనోజ్ కుర్చీలోంచి లేచాడు. అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి. రక్తంతో యెరుపెక్కిన కళ్ళతో కాంత వైపు చూశాడు.

"మా వదినా, గీతనూ హత్య చేసి, మా అన్నయ్యను బతికిన శవంలా మార్చి, అర్థం కుర్థం ఎరగని మిమ్మల్ని పీడించిన ఆ రాక్షసుల్ని వెతికి పట్టుకొని, మీ అందరి తరఫునా ప్రతీకారం తీర్చుకుంటాను!" మనోజ్ కంఠంలో ఉద్రేకం గంటలా ఖంగుమంది.

రంగనాథ్ అదిరిపడి, కంగారుగా చూశాడు. "మనోజ్... ప్లీజ్....ఆవేశపడొద్దు. కరుణాకర్ చెప్పినట్టు చెయ్. ఆ విషయంలో జోక్యం చేసుకున్నవాళ్ళందరూ నిర్దాక్షిణ్యంగా శిక్షించబడతారని నాకు అనుమానంగా వుంది...."

"మీరుకూడా అన్నయ్యలాగే నాకు భయం రంగరించి పోస్తున్నారు!" మనోజ్ ఉడుకుతగులుతూ అన్నాడు.

రంగనాథ్ విచారంగా తల అడ్డంగా వూగించాడు. "అడ్వొకేట్ అన్నారావుగారి దగ్గర కరుణాకర్ గతంలో అసిస్టెంట్‌గా పనిచేశాడు. ట్రయల్ జరిగే టప్పుడు అన్నారావుగారు అతని కేసుని తీసుకొని వాదించాలనుకున్నారు. అలా అనుకోవడంవల్ల ఆయన హఠాత్తుగా మరణించాల్సి వచ్చింది...."

"వాట్?" మనోజ్ ఆశ్చర్యంగా అన్నాడు.

"ఏదో లారీ ఆయన కారుని నుజ్జునుజ్జు చేసి, మాయమై

పోయింది. అప్పట్లో అది మామూలు యాక్సిడెంట నే అనుకున్నాను. కానీ అది ఆయనకి పర్మనెంట్ వార్నింగ్ అని నాకు ఇప్పుడు అనిపిస్తోంది ..."

"గుడ్ గాడ్!" మనోజ్ తన ఆశ్చర్యాన్ని దాచుకో లేకపోయాడు. అతని మొహం తేపురించింది, "రంగ నాథ్ గారూ, మీరు నాకు సహాయం చెయ్యాలి కల్లేను. ఎవర్నీ ఇందులోకి లాగడం నాకు ఇష్టంలేదు. అన్నయ్య మీకు అప్పగించిందంతా బాంకులో నా పేర ట్రాన్స్‌ఫర్ చేయండి. మీరు కాస్టోడియన్ గా వున్నారన్న అనుమానం కూడా వాళ్ళకు రాకూడదు ..."

"యూ ఆర్ కరెక్ట్!" రంగనాథ్ తలాడిస్తూ అన్నాడు.

మనోజ్ అతన్ని నిదానించి చూశాడు. "రంగనాథ్ గారూ. అన్నయ్య కేసుని మీరు స్టడీ చేసివుండాలి. ఆ వివరాలన్నీ నాకు ఇవ్వగలరా?"

రంగనాథ్ చిన్నగా నిట్టూర్చాడు. "కోర్ట్ ప్రొసీడింగ్స్ అన్నీ సేకరించి ఫైల్ చేశాను. ఆ గూండాలు ఇతర ఫైల్స్‌తోపాటు హాటినీ నాశనంచేశారు. పాత్రుల పేర్లూ వగైరా డైరీలో నోట్ చేశాను. అదిస్తాను."

"థాంక్యూ వెరీమచ్. అవి చాలు" మనోజ్ కుర్చీ లోంచి లేచాడు.

రంగనాథ్ తాళంతీసి, టేబుల్ సొరుగులాగాడు. అందులోంచి తీసిన చిన్న డైరీని మనోజ్ వైపు చూశాడు. "చూసి, గుర్తుంచుకుని దీన్ని కాల్చేయి" అన్నాడు

మనోజ్ డైరీని పాంటుజేబులోకి దోపుకున్నాడు.

"ఓకే, మనోజ్. పదకొండు గంటలకి నన్ను స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మెయిన్ బ్రాంచ్‌లో కల్సుకో" అన్నాడు రంగనాథ్.

మనోజ్ శాంతని చిరునవ్వుతో చూశాడు. "గుడ్ బై, సిస్టర్!" శాంత చిరునవ్వు నవ్వింది. "గుడ్ లక్ మనోజ్!" మనోజ్ వెనక్కి తిరిగి గుమ్మంవైపు జోరుగా అడుగులు వేశాడు.

• • •

మనోజ్ హోటల్ గదిలోంచీ ఇవతలికి వచ్చాడు. మెట్లు దిగి, రిసెప్షన్ వైపు నడిచాడు. రిసెప్షనిస్టు అతన్ని నవ్వుతూ చూశాడు. తాళంచెవి అతనికి అందించి, మనోజ్ హోటల్లోంచి ఇవతలికి నడిచాడు.

తను వెళ్లాల్సిన ప్రాంతందాకా బస్సు వెళ్ళదు. అటు వేపు వెళ్ళే సిటీ బస్‌లో టెర్మినస్ దాకా ప్రయాణంచేసి, అరగంట నడిస్తే తన గమ్యస్థానం చేరుకోవచ్చు. మెయిన్ రోడ్డమ్మట కాకుండా అడ్డంగా, వీధులమ్మటా, సందులమ్మటా వెళ్తే ముప్పావు గంటలో అక్కడికి చేరుకోవచ్చు. సిగరెట్ వెలిగించి, నడవడం ప్రారంభించాడతను.

తారు రోడ్డునుంచీ మట్టిరోడ్డుమీదికి నడిచాడు మనోజ్.

సన్నగా వున్న రోడ్డుకి రెండువైపులా గుడిసెలూ, చిన్న చిన్న పెంకుటిళ్ళూ వున్నాయి. 'సంజయ్ నగర్' అన్న బోర్డు రోడ్డు పక్కగా వుంది.

తను రావాల్సిన ఏరియాకే వచ్చాడు. మనోజ్ త్వర త్వరగా నడవసాగేడు.

"ఇళ్ళ గోడలమీద తారుతో వంకర టింకరగా

రాసిన నంబర్లని చూస్తూ మలుపు తిరిగాడు. తనకి కావాల్సిన ఇల్లు కుడివైపున వుంది.

చిన్న పెంకుటిల్లు. గుమ్మానికి రెండువైపులా ఇటుకలతో కట్టిన అరుగులు. ముందున్న పందిరిమీంచి గుమ్మడితీగ పెంకులమీదికి పాకి, పచ్చగా కప్పేసింది.

మనోజ్ తాళం వేసిన తలుపుముందు ఆగాడు. తను ఊహించినట్టే అయ్యింది. తనకి కావాల్సిన వ్యక్తికి ఈ సమయంలో సాధారణంగా యింట్లో వుండే అవకాశం లేదు. ముందుగా ఇల్లు చూసుకోడం మంచిదనిపించి పొద్దున్నే వచ్చాడు తను. వెనక చప్పుడైంది. మనోజ్ గిరుక్కున వెనక్కి తిరిగి, తనముందు నిలుచున్న ముసలామెని నవ్వుతూ చూశాడు. ముడతలు పడిన మొహం చింపిరి జుట్టు.

"అది ఇట్లో లేదయ్యా...." వణుకుతున్న ముసలి కంఠం అంది. కళ్ళు చిట్లించి అతన్ని చూస్తోంది.

"ఎప్పుడుంటుంది పెద్దమ్మా!" మనోజ్ అడిగాడు.

"ఎప్పుడో సందేళకి వస్తుంది. దాంతో నీకేటి పని?" ముసలామె ప్రశ్నించింది.

"రేషన్ కార్డు తనిఖీ చేయాలి...." మనోజ్ నవ్వుతూ అన్నాడు.

"రేషన్ కార్డు మనిషివా? నాయనా, నాకు కార్డిప్పించు. ఉన్న కార్డు లాక్కుని కొడుకూ కోడలూ వెళ్ళిపోయారు...."

మనోజ్ ఆమెని సానుభూతితో చూశాడు. "రేపొస్తాలే" అంటూ రోడ్డువైపు తిరిగాడు.

* * *

బాగా చీకటి పడింది.

నల్లరంగు దుస్తులు ధరించిన ఆ వ్యక్తి, చీకట్లో నీడలా కదులుతున్నాడు.

తనకి కావాల్సిన ఇంటిముందు ఆగాడు.

ఇంట్లో లైటు వెలగడం లేదు. తలుపు తెరిచినట్టు లేదు. అతను చుట్టూ చూశాడు. చుట్టువున్న ఇళ్ళల్లో బుడ్డి— దీపాలూ, కొవ్వొత్తులూ వెలుగుతున్నాయి. ఈ కాలనీలో ఇవాళ కరెంటు వుండదని అతనికి తెలుసు. ట్రాన్స్‌ఫార్మర్ని తనే ఆఫ్ చేశాడు....

చకచక నడుస్తూ అతను పెంకుటింటి వెనక్కి నడిచాడు. పెరటి తలుపుని తోశాడు. గొళ్ళెం పెట్టబడింది. జేబులోంచి సన్నటి కమ్మీ తీశాడు. తలుపు పలకల మధ్య కన్నాలున్నందుకు సంతోషిస్తూ కమ్మీని దూర్చి కాసేపు కదుపుతూ వుండిపోయాడు. తలుపుని ఎడం చేత్తో ముందుకిలాగి. కమ్మీ సహాయంతో లోపలున్న గొళ్ళేన్ని పైకి తోశాడు.

తలుపు తోసుకుని ఇంట్లోకి ప్రవేశించాడు. తలుపు మూసి, చీకట్లో దెయ్యంలా అలాగే వుండిపోయాడు. కాసేపట్లో అతనికళ్ళు చీకటికి అలవాటుపడ్డాయి. జాగ్రత్తగా పక్కకి తిరిగి, చిన్న వంటగదిలోకి వెళ్ళాడు.

గోడవారగా పెట్టబడిన నీళ్ళపాత్రలూ, కుండలూ లీలగా అవుపిస్తున్నాయతనికి. మెల్లిగా వొంగి నీళ్ళకుండని రెండు చేతుల్లో కెత్తాడు. మోసుకుంటూ తలుపుదగ్గర కెళ్ళాడు. కాలితో తలుపుని లాగి, పెరట్లో ప్రవేశించాడు.

బాత్‌రూమ్‌గా వుపయోగించే చాటు ప్రదేశం చేరుకున్నాడు. నీళ్ళని పూర్తిగా కిందపోసేశాడు. ఇంట్లో కెళ్ళి ఖాళీకుండని యథాస్థానంలో పెట్టేశాడు. ఇంకా నాలుగు పాత్రలున్నాయి, మూతలు తీసి, చెయ్యిపెట్టి చూశాడు.

మూడింటిలో నీళ్ళున్నాయి. నాలుగో కడవ ఖాళీగా వుంది.

అయిదు నిమిషాల్లో మూడు పాత్రల్లోని నీటిని పెరట్లో నేలపాలు చేసి, పాత్రల్ని యథాప్రకారం పెట్టేసి. తలుపుని దగ్గరగా మూసి అతను నీళ్ళగదిలో వున్న తొట్టిలోని నీళ్ళను నేలమీదికి వదిలేశాడు. పెరట్లోకి నడిచాడు.

మూడువైపులా ముళ్ళపొదలూ, వాటికి అల్లుకున్న తీగలూ ప్రహారీగోడలా వున్నాయి. అతను జాగ్రత్తగా అడుగులు వేస్తూ ఒక మూలలో పొదచాటున నల్లపిల్లిలా నక్కి దాక్కున్నాడు.

నిమిషాలు గడుస్తున్నాయి....

అతను ఉలిక్కిపడ్డాడు.

తలుపు తీసిన చప్పుడు. కాసేపట్లో ఇంట్లో అగ్గిపుల్ల వెలిగింది. కిరోసిన్ దీపం బలహీనంగా వెలగడం ప్రారంభించింది. అతను చెవులు రిక్కించాడు ఎవరో కరెంటు డిపార్ట్‌మెంటుని బూతులు తిడుతున్నారు. కాసేపట్లో సణుగుడు ఎక్కువైంది. అతను పిల్లిలా గెంతేసి, ఇంటి గోడచాటున దాక్కున్నాడు.

చెవులు రిక్కించి. కళ్ళు చించుకుని గుడ్లగూబలా చూస్తూ కూచున్నాడతను. ఎవరో నీడలా నీళ్ళగదిలోకి వెళ్ళారు. గొణుగుతూ ఇవతలికి వచ్చారు. మళ్ళీ ఇంట్లోకి వెళ్ళి, కాసేపట్లో తిరిగొచ్చారు. రెండు నిమిషాల్లో బావి గిలక చప్పుడు చేస్తూ తిరగసాగింది. ఏదో ఆకారం విసుగ్గా పగ్గాన్ని పైకిలాగుతూ, కిందికి వదుల్తూ పాత్రని నీళ్ళలో ముంచడానికి ప్రయత్నిస్తోంది.

అతను చకచకా కదిలాడు. క్షణంలో, నీళ్ళు చేదే ప్రయత్నం చేస్తున్న ఆకారం వెనక బాగా కిందికి వొంగి

చూచున్నాడు. ఆకారం ముందుకి వొంగి పగ్గానికి కట్టిన పాత్రను పూర్తిగా ముంచే ప్రయత్నంలో వుంది.

అతను తోడేలులా, కొంచెం ముందుకి పాకాడు. అతని చేతులు పాముల్లా ముందుకి సాగేయి. పదివేళ్ళూ, ఆమె కాళ్ళని పాదాలపైన కొక్కెల్లా పట్టుకున్నాయి. ఏం జరుగుతోందో ఆమె ఊహించేలోగా అతను ఒక్క వూపుతో పైకిలేచాడు. ముందుకి, బావిచుట్టూ—వున్న పిట్టగోడ మీదుగా వొంగిన ఆమె శరీరాన్ని బలంగా, విసురుగా బావిలోకి తోసేశాడు.

భయంతో ఆమె పెట్టిన కేక అతని చెవుల్ని చీల్చింది. మరుక్షణం దబ్ మన్న చప్పుడు వినిపించింది. గిలక బ్రహ్మాండమైన వేగంతో తిరిగి ఆగింది. బావిలోంచీ పైకి దూసుకు వచ్చిన కడవ గిలకకి కొట్టుకుని భళ్ళున పగిలింది. తాడు గిలకలోంచీ బావిలోకి పాములా జారింది.

నూతిలోంచీ వస్తున్న విచిత్రమైన చప్పుళ్లని లెక్క చేయకుండా అతను పొదలవేపు పరుగెత్తాడు. ఆ ఇంటిని ఆనుకుని ఇళ్ళులేనందుకు సంతోషిస్తూ చీకట్లో కలిసి పోయాడతను....

• • •

ఉదయం పదిగంటలైంది.

మనోజ్ తారురోడ్డుమీంచీ సంజయ్‌నగర్ లోకి వెళుతున్న మట్టిరోడ్డులోకి తిరిగాడు. చకచకా అడుగు లేస్తూ మలుపు తిరిగాడు. ఉన్నట్టుండి అతని కాళ్లు నేలకి అతుక్కుపోయాయి. రెప్పవేయడం మరిచిపోయాడతను.

ఆ ఇంటి ముందు జనం గుంపుగా వున్నారు. అందరి మొహాల్లోనూ విచారం తాండవం చేస్తోంది. ఇద్దరు మగాళ్ళు ఇంటి ముందు వెదురు కర్రలతో పాడె తయారు

చేస్తున్నారు. అరుగుమీద బల్లికిలా పడున్న శరీరం మీద పడి యాభైయ్యేళ్ళ వ్యక్తి గోడిస్తున్నాడు.

తనవేపు వస్తున్న యువకుడిని మనోజ్ ఆపాడు. ఏం జరిగిందని ప్రశ్నించాడు.

"ఆ ఇంట్లో వున్న రాజమ్మ రాత్రి నీళ్ళతోడబోయి, నూతిలోకి పడిపోయిందండి. పాపం, తల పగిలింది" యువకుడు జవాబిచ్చాడు.

మనోజ్ మాటలు మరిచిపోయినవాడిలా చూస్తూండి పోయాడు. యువకుడు కదిలాడు.

"ఆమెకి.... ఆమెకి పిల్లలులేరా?" మనోజ్ అడిగాడు. యువకుడు ఆగి, తిరిగిచూశాడు. "ఉన్నారండి. ఇద్దరు కొడుకులు. ఇద్దరూ కువైట్‌లో వున్నారు. అయినా వాళ్ళు చావుకి అందుకోలేరుగా!"

మనోజ్ మెల్లిగా తిరిగాడు. తను ఆలస్యంగా వచ్చాడు. రాజమ్మ ప్రమాదవశాత్తూ మరణించిందా? అడ్వొకేట్ అన్నారావుకిలాగా ఆమెకీ ప్రమాదం సంభవించిందా? తను ఆలస్యంగా వచ్చాడా లేకపోతే, వాళ్లు వరో ఆమెకోసం తనకన్నా ముందుగా వచ్చారా? ఆమె నూతిలో ఎలాపడింది? ఆలోచిస్తూ అతను రోడ్డెక్కాడు.

పక్కనే వున్న టీకొట్టుదగ్గర అయిదారుగురు నిలబడి రాజమ్మ మరణం గురించి మాట్లాడుకుంటున్నారు. మనోజ్ వాళ్ళదగ్గరగా ఆగి, సిగరెట్ వెలిగించాడు. ఇలాంటి చోట్ల విషయాలకోసం అడగాల్సిన పనిలేదు. వింటూ నించుంటే చాలు!

కడవ మునిగిందో, లేదో చూడ్డానికి వొంగిన రాజమ్మ నూతిలోకి బోర్లా పడివుంటుంది. గోడకికొగిలి తల పగిలింది. పీకల్దాకా తాగేసి ఏ అర్ధరాత్రికో ఇంటికి చేరుకుని,

అరుగుమీద నిద్రపోయిన రాజమ్మభర్త తెల్లారేదాకా ఆమె గురించి పట్టించుకోలేదు. నూతిలోకి పడుతూ ఆమె వేసిన కేక ఎవరికీ వినిపించినట్టు లేదు. అసలు ఆమె కేక పెట్టిందో, లేదో!

మనోజ్ విసుగ్గా సిగరెట్‌ని గిరాటేసి కదిలాడు.

అతనిలో ఎన్నో ఆలోచనలు సాగుతున్నాయి. రాజమ్మ మరణం యాదృచ్ఛికంగా జరిగిందా? అడ్వొకేట్ అన్నారావు మరణంలా తెలివిగా ఏర్పాటు చేయబడిందా? తను ఆమెని కలుసుకోబోతున్నట్టు ఎవ్వరికీ తెలీదు.

లాయర్ రంగనాథ్ ఇచ్చిన డైరీలో పేర్లన్నీ చదువుకుని, కంఠతాపట్టి గుర్తుంచుకుని, డైరీని కాల్చిపారేశాడతను. తను గతాన్ని తవ్వే ప్రయత్నంలో వున్నట్టు కరుణాకర్కీ రంగానాథ్ దంపతులకీ తెలుసు. ఆ కార్యం తను ఎలా ఎప్పుడు ప్రారంభిస్తాడో వాళ్ళకు తెలీదు. తన ప్రయత్నం తెలిసినాగానీ ఎవరూ తనకంటే ముందు రాజమ్మను కలుసుకోడానికి ప్రయత్నించరు; ఆమె నోరు నొక్కేయరు!

అంటే రాజమ్మ ప్రమాదవశాత్తూ నూతిలోపడి మరణించి వుండాలి. మనోజ్ జేబులోంచీ సిగరెట్ తీసి వెలిగించాడు. రాజమ్మ ప్రమాదవశాత్తూ తనే నూతిలో పడి మరణించిందన్న ఆలోచనని అన్నారావు హత్యా, కాంతమీద అఘాయిత్యం పక్కకి నెట్టేస్తున్నాయి.

మనోజ్ తటాలున ఆగాడు. శత్రువు చేతిలో ఏదో ఆయుధం కనిపించనంత మాత్రాన అతను నిరాయుధుడని గుడ్డిగా అనుకోటానికి లేదని ఆర్మీ అనుభవం తనకి నేర్పింది.

రాజమ్మ మరణం హత్యకాదని తను అనుకున్నంత

కాలం తను అజాగ్రత్తగా వ్యవహరించే అవకాశంవుంది. ఆమె హత్యచేయబడిందని అనుకోడం తనలో జాగ్రత్తనీ, ఆలోచననీ, కలిగిస్తుంది. ఇరవైనాలుగ్గంటలూ తను అప్రమత్తంగా, వుండగలడు!

మనోజ్ తనలో నవ్వుకుంటూ జోరుగా అడుగులు వేయసాగాడు. తను అప్రమత్తంగా, మెలకువగా వుండాలి! అలస్యం చేయకుండా అడుగులు వెయ్యాలి.

మనోజ్ మలుపు తిరిగి తన హోటలున్న రోడ్డుమ్మట వేగంగా నడవసాగేడు. అట్టే రోజులు ఒకే హోటల్లో తను వుండకూడదు.

• • •

హోటల్ రాక్‌హిల్ ముందు టాక్సీ ఆగింది.

డోర్ తెరుచుకుని స్టీరింగ్ వీల్ వెనకనుంచీ డ్రైవర్ కృష్ణంరాజు దిగాడు. డోర్ని నిర్లక్ష్యంగా మూస్తూ చుట్టూ పరకాయించి చూశాడు.

కాంపౌండులో కార్లు వరుసగా నిలబడ్డాయి. సన్నగా వర్షం కురుస్తోంది. చలిగాలి.

మీసాలు సరుదుకుంటూ, తనపక్కనే నిలబడిన మస్తాన్ రావుని అతను నవ్వుతూ చూశాడు. ఆగివున్న కార్ల వెనక నుంచీ పొట్టిగావున్న వ్యక్తి, వాళ్ళ దగ్గరగా నడిచాడు.

"భూపాలంగారు మీ కోసం చూస్తున్నారు...." అన్నాడతను తగ్గు స్వరంలో.

"ఎక్కడ?" కృష్ణంరాజు గర్వంగా అడిగాడు.

"నాతోరండి....అంటూ అతను కార్ల మధ్యలో నడవసాగేడు. కృష్ణంరాజా, మస్తాన్ రావూ అనుసరించారు. రెండు నిమిషాల్లో అతను వాళ్ళని హోటల్ వెనక భాగంలో వున్న మెట్లదగ్గరకు తీసుకెళ్లాడు.

"అంతా రహస్యంగా జరగాలన్నారు భూపాలం గారు. అందుకే దొడ్డిదారి ఉపయోగిస్తున్నాం!" అంటూ పాట్రిక్ కి. జాకీ మెల్లిగ్గా సాగేడు.

కాసేపట్లో ముగ్గురూ నాలుగో అంతస్తులోవున్న గది ముందు ఆగారు. జాకీ తలుపుని తట్టేడు. తోసుకుని లోపలికి జొరబడ్డారు. ఇద్దరూ లోపల దూరాక తలుపు మూసి గోళ్ళెం పెట్టేశాడు.

జేబురుమాలుతో ముంజేతులకి పట్టిన చెమట తుడుచుకుంటూ కృష్ణంరాజూ, జాకీ వెంట కదిలాడు. కోడిపుంజు వెంట పెట్టలా మస్తాన్ రావు వెంబడించాడు. లోపలి గదిలో టేబుల్ వెనక ఎత్తుగా నించున్న పోతరాజు — భూపాలంగా వాళ్ళిద్దరికీ పరిచయం అయిన పోతరాజు వాళ్ళనిచూసి ధారాళంగా పళ్ళు చూపిస్తూ నవ్వాడు.

"నమస్కారం, భూపాలంగారూ!" యుగళ గీతం పాడుతున్న భక్తుల్లా కృష్ణంరాజూ, మస్తాన్ రావూ ఒకే సారి అన్నారు.

"నమస్తే. కూచోండి ఈ మీటింగ్ యేర్పాటు చేయడంలో ఆలస్యం జరిగింది! క్షమించాలి...." అన్నాడతను.

"ఎంతమాట!" మస్తాన్ రావు ఉబ్బి తబ్బిబ్బవుతూ అన్నాడు. బుర్ర మీసాల్ని సగర్వంగా సర్దుకుంటూ కృష్ణంరాజు కుర్చీలో కూచున్నాడు. అతని పక్కనే మస్తాన్ రావు కూలబడ్డాడు.

ఇద్దరి కళ్ళు టేబుల్ మీదున్న పీటర్ స్కాట్ బాటిల్స్ నీ, ఐస్ బకెట్ నీ ఆత్రంగా చూశాయి. పింగాణీ ప్లేట్స్ లో సర్దిన చికెన్ వాళ్ళకి నోరూరిస్తోంది. జాకీ టేబుల్ దగ్గరగా జరిగి గ్లాసుల్లో ఐస్ క్యూబ్స్ వేసి, విస్కీ పోశాడు. పోతరాజు వాళ్ళని ఉత్సాహంగా

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

చూశాడు.

"ధైర్యంగా కోర్టులో మీ పాత్రల్ని నిర్వహించారు. మీ ఋణం తీర్చుకోవాలనిపించింది...." అంటూ అతను మంచంమీదున్న రెండు బ్రీఫ్ కేసుల్ని కుడిచేత్తో చూపించాడు. కృష్ణంరాజూ, మస్తాన్ రావూ ఆశగా చూశారు.

"మీ సహాకారానికి ఎంతిచ్చినా తక్కువే అనిపించింది. చెరో పదివేలు వాట్లో సర్దాను!" పోతరాజు ఉత్సాహంగా అన్నాడు.

ఇద్దరూ ఉక్కిరిబిక్కిరవుతూ చూశారు. "థాంక్యూ, థాంక్యూ!" మస్తాన్ రావు అరిచాడు.

పోతరాజు వాళ్ళ కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ, సిగరెట్ వెలిగించాడు. "అనుకోని అవాంతరం వచ్చేలా వుంది. మీ ధైర్యంతో మాకు ఇంకా పని కలిగింది...."

"చెప్పండి. ఎప్పుడు రావాలి కోర్టుకి? ఏ పాట పాడాలి?" కృష్ణంరాజు నవ్వుతూ అడిగాడు.

పోతరాజు చిన్నగా నవ్వాడు. "ఆ అవసరంలేదు. పనిలేని, బుద్ధిలేని వ్యక్తులు కొందరు మీ సాక్ష్యాల్ని అనుమానిస్తూ ప్రశ్నలు అడిగే ప్రయత్నంలో వున్నట్టు తెలిసింది. ఎవరడిగినా, ఎన్నడిగినా టేప్ రికార్డర్ లా మీరు కోర్టులో పాడిందే పాడాలి. అంతే!"

"అంతేనా?" మస్తాన్ రావు నిరుత్సాహంగా అన్నాడు.

పోతరాజు తీక్షణంగా చూశాడు. "కోర్టులో మీ వాఙ్మూలాన్ని మార్చి మీరు మాట్లాడితే చట్టరీత్యా మీరు చిక్కుల్లో పడతారు! న్యాయస్థానాన్ని అబద్ధాలతో మోసం చేశారన్న కేసు బనాయించి, మిమ్మల్ని కోర్టు పచ్చడికింద రుబ్బేస్తుంది! అంచేత మీరు మీ




మా వద్ద సాంఘిక నవలలు, డిటెక్టివ్‌లు, బాల సాహిత్యం, నాటకములు, వైద్య, విద్య మరియు స్కూలు, కాలేజి విద్యార్థులకు అచ్చుపుస్తకములు, ఎక్సర్‌సైజు పుస్తకములు, స్టేషనరీ మొదలగునవి లభించును.

నేడే కేటలాగుకై వ్రాయండి.

# శ్రీ గణేశ్ బుక్ హౌస్

(బుక్ డిస్ట్రిబ్యూటర్స్ & స్టేషనరీ)

టౌన్‌హాల్ రోడ్డు—రాజమండ్రి - 1

వాళ్ళని జాగ్రత్తగా, అతి జాగ్రత్తగా వుపయోగించాలి!"

"నాటకంలో డైలాగ్స్‌లా అదే అప్పచెప్తాం! మీరు కంగారుపడకండి!" కృష్ణంరాజు సగర్వంగా అన్నాడు. మస్తాన్‌రావు ఆవేశంగా తలాడించాడు.

"వెరీగుడ్! ఆతిథ్యం స్వీకరించండి!" అంటూ పోతరాజు గ్లాసుని అందుకున్నాడు. మస్తాన్‌రావు ఆదరా బాదరా గ్లాసుని రెండు చేతుల్తో పట్టుకుని వంజిగలా విస్కీని గడగడా తాగేసి గ్లాసుని టేబుల్ మీద కుక్కి, పళ్ళికిలిస్తూ చూశాడు.

రెండు చేతుల్తో బుర్రమీసాల్ని పైకి యెగదోసి కృష్ణంరాజు విస్కీ జుర్రడం ప్రారంభించాడు. పదిహేను నిమిషాల్లో విస్కీ పూర్తిచేసి, ఇద్దరూ ప్లేట్స్‌ని ముందుకి లాక్కుని విజృంభించారు. పోతరాజు వాళ్ళని చిరునవ్వుతో చూస్తూ విస్కీ చప్పరిస్తున్నాడు.

గ్లాసుల్లోకి నీళ్ళుపోసి, జాకీ అతన్ని చూశాడు. "వాళ్ళు వచ్చే టైం అయింది. రిసీవ్ చేసుకోడానికి వెళ్తాను" అన్నాడు.

"వెళ్ళిరా. నువ్వొచ్చేదాకా ఇక్కడే వుంటా" పోతరాజు జవాబిచ్చాడు.

కృష్ణంరాజూ, మస్తాన్‌రావూ యేకాగ్రతతో చేతులకీ, నోళ్ళకీ పని కల్పిస్తున్నారు. జాకీ వెళ్ళిపోయాడు.

అరగంట గడిచింది. విందు భోజనం ముగించి ఇద్దరూ కుర్చీల్లో వెనక్కి వాలి, తృప్తికరంగా పోతరాజుని చూశారు. పోతరాజు చిరునవ్వు నవ్వుతూ చూశాడు.

"డియర్ ఫ్రెండ్స్ తృప్తిగా భోంచేశారా?"

రెండుతలలు ఆనందంగా వూగాయి. "ఫైవ్‌స్టార్ హోటల్లో కూడా ఈ మజా దొరకదు!" మస్తాన్‌రావు ఉషారుగా

# శ్రీ మహాలక్ష్మి వారి వెరైటీ నవలలు

వెలువడినవి !

| | | |
|---|---|---|
| 1. రాక్షస సంహారం | మల్లాది వెంకట కృష్ణమూర్తి | 30.00 |
| 2. కాంతి కిరణాలు | 'మీరా' లక్ష్మి | 25.00 |
| 3. పుష్పరాగం | ,, ,, | 25.00 |
| 4. నరసింహావతారం (అపన సీరియల్) | వసుంధర | 20.00 |
| 5. శివరామ్ నేరాలు (అపన సీరియల్) | V.S. రావ్ | 20.00 |
| 6 మైనా (సాహిత్య అకాడమి బహుమతి పొందినది) | శీలా వీర్రాజు | 25.00 |
| 7 ఇంకా ఉంది చాలా దూరం | భట్టిప్రోలు కృష్ణమూర్తి | 20.00 |
| 8. కొత్త సంగీత విద్యాదర్పణము | ఏకా సుబ్బారావు | 60.00 |

నేడే అడ్వాన్సుతో పాటు మీ ఆర్డరు పంపండి.

ఫోన్ నెం: 63322

**శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్**

మ్యూజియం రోడ్, గవర్నరు పేట,

విజయవాడ-520 002.

అన్నాడు. కృష్ణంరాజు పగలబడి నవ్వుతూ చార్మినార్ సిగరెట్ వెలిగించాడు. చార్మినార్ పాకెట్ని అందుకున్నాడు మస్తాన్ రావు.

పోతరాజు టైం చూసుకున్నాడు. లేచి నిలబడ్డాడు. "ఓకే ఫ్రెండ్స్ ఆ బహుమతులు తీసుకోండి. ఇక్కడ జరిగిందంతా మరిచిపోండి. ఇందాకా చెప్పిందంతా బాగా గుర్తుంచుకోండి!"

ఇద్దరూ కులాసాగా నవ్వుతూ లేచారు. కృష్ణంరాజు మంచం దగ్గరగా నడిచాడు. బ్రీఫ్ కేసుని తెరిచి కళ్ళు పెద్దవిగా చేసి చూశాడు. ఆనందంతో వెడల్పుగా అయిన మొహాన్ని తిప్పి, మస్తాన్ రావుని చూశాడు. మస్తాన్ రావు ఆడుసుమతిలో నడుస్తున్నట్టు అడుగులేస్తున్నాడు. కృష్ణంరాజు నవ్వుతూ జుబ్బా పట్టుకుని అతన్ని దగ్గరగా లాగాడు.

"మస్తాన్ రావ్, బ్రీఫ్ కేస్ తెరిచి, కళ్ళకి విందు చేసుకో!" అన్నాడు ఉల్లాసంగా.

మస్తాన్ రావు వణికే చేతుల్తో బ్రీఫ్ కేసుని తెరిచాడు. లోపల నీట్ గా పేర్చబడిన వందరూపాయల నోట్ల కట్టల్ని ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. ఆవేశంతో పోతరాజు వైపు చూశాడు.

"థాంక్యూ థాంక్యూ థాంక్యూ!" అరిచాడతను ఉద్రేకంతో. కృష్ణంరాజు రెండు బ్రీఫ్ కేసుల్ని మూసేశాడు. పోతరాజు ఇద్దర్నీ నవ్వుతూ చూస్తున్నాడు. కృష్ణంరాజు అతని దగ్గరగా ఆగాడు. మెరుస్తున్న కళ్ళతో చూశాడు.

"ఇంకా యేదేనా సాక్ష్యం కావాలంటే చెప్పండి. టాక్సీ తోలి, తోలి విసుగెత్తిపోయాను!" (సశేషం)

